# విషయానుక్రమణిక

## అక్టోబరు 1957

# జీవలక్షణం

శ్రీ మాదిరాజు రంగారావు

వేగ ఝరీ గమనము నడ్డు
నీలిరంగు కొండలపై నుండి
యెగసి పొంగి పొరలి కాంతిధార
చెంగున దూకునపుడె, గంభీర
ప్రశాంత ప్రకృతి రామణీయకత!

అంతశ్శక్తి రేఖ లొక్కమారు
మేలుకున్న మనలో తదనుభూతియె
పరిణత జీవితకావ్యనిహిత
సౌందర్య కళాన్విత శిల్పజ్ఞత.

సజీవ ప్రాణికోటి స్వభావం
నిర్జీవ శిలాప్రతిమ సౌందర్యం
ప్రకృతి దేవి జాలి మనసు
యంత్రవేది శక్తి స్వరూపం
నగరవాసి మేధాశక్తి పరిసర్పణం
అడవి మనిషి జాలిగుండె లోతులు
తెల్లని పక్షులెగురు శాంతిసీమ
నల్లని ధూమ మెగయు యుద్ధభూమి—

చిత్రవర్ణ దృశ్యమాన రూపంలో
కనుపించే సాంకేతిక జగత్తులో,
నీరులా దయ ప్రవహించే బాట,
మంచులా నిర్దయ గడ్డకట్టుచోట,
సంస్పందించును, వీణా తంత్రిలా,
మ్రోగును నదిలా, కవి హృదయం
సాగును కాంతిలా కవి భావన.

ప్రతివస్తువు సౌందర్య రసస్విన్నము
ప్రత్యణువణువు విచారణ యోగ్యము
ప్రతిభావము విచార మనోనిష్ఠము
ప్రతి మనీషి ఊహాజగత్తు భిన్నము
స్వీయ దృక్పథం చెరగని సరళరేఖ

భిన్నత్వం అనిశ్చలత్వం
క్షణక్షణ వినూతనత్వం
రూపురేఖలు మారే గుణం
భౌమ ప్రాపంచిక లక్షణం

చైతన్యతా లక్షణ మెరుగదు స్వర్గం
యుగాలుగా బ్రతికే రంగుల చిత్రం.

వీచే గాలిలా, మ్రోగేనదీ
తరంగంలా, దూకే జల
ధారాధునిలా, మెరసే అభి
నవ విద్యుల్లేఖా పుష్పంలా,
హసిస్తూ నిత్యం సంచరించడం
ఒక్కొక్క జీవ సృష్టి వైలక్షణ్యం

# నాలుగు బస్సులు

కరుణకుమార

కలకత్తా మెయిల్ బయలుదేరే వేళ అయింది. మదరాసు సెంట్రల్ స్టేషన్ ఒకటో నంబరు ప్లాటుఫారం జనంతో కిటకిటలాడుతోంది. మిలిటరీ సోల్జర్లు. ఆంగ్లో ఇండియన్ యువతులు, పిల్లలు, పెద్దలు, మొగ, ఆడ— జనం తోసుకొంటున్నారు. సామానుతో 'లోడు' చేసిన ట్రాలీలు, ప్రయాణీకుల పాదాంగుళుల మీదుగానే బరబరా లాక్కొని చక్కా పోతున్నారు లైసెన్సు కూలీలు. ఆ జనసమ్మర్దంలో ఒక యువకుడు కాళ్ళకు బ్లాకలర్ స్టాకింగ్సూ, బ్రౌన్ కలర్ షేప్‌లెస్ బాటా షూ, స్టాకింగ్సుమీద గోధుమవన్నె హనావా సూటూ, మెడలో టై వేసుకొని, కళ్లకి అద్దాలు తగిలించుకొని, కుడిచేత్తో లెదర్ సూటుకేసు పట్టుకొని, ముందు చూపే గాని వెనక చూపు లేకుండా విసవిస నడిచిపోతున్నాడు. అతడే స్టేషన్‌కి వెడుతున్నాడో తెలియదు. అతని ముఖంలోకి తేరిపార చూస్తే తొందరగా రైలులో పడాలనో లేక మరెందుకో—ఒక విధమైన ఆందోళన అతని హృదయాన్ని కళవళ పెట్టుతున్నట్టు, సూచనలు గోచరిస్తున్నవి. అతని నడక వేగంలో చెయ్యి తగిలి ప్రక్కనే నడిచే ఆంగ్లో ఇండియన్ యువతి చంకనున్న రంగుల గొడుగు క్రిందపడిపోవడంగాని, అతని కాలిబూటు కింద ఒక అరవ విద్యార్థిని ఎడమకాలి చిటికెన వ్రేలు పడి నలిగినందువల్ల కుయ్యోమని చేసే ఆక్రందనధ్వని గాని, ఎత్తుమడమల ఫాన్సీషూ తొడుక్కొని, వల్లెవాటుగా పైట వేసుకొని, వయ్యారంగా నడిచే ఒకానొక తెలుగు సినీమానటి పైట చివరి నూలు జాలరులో అతని కోటు డిన్నర్ బటన్ తగుల్కొని అతని నడక విసురులో ఆమె చీరకొంగు పర్రున చిరగడంగాని, అతగాడు గమనించే స్థితిలో లేక ముందుకు సాగిపోవడమే ఏకైకలక్ష్యంగా పెట్టుకొని వెళ్లిపోతున్నాడు.

ఆ జనసమ్మర్దంలో అతడా ప్రకారం ఎంత దూరం వెళ్ళాడో—ఒక అయిదు, పది నిముషాలలో ప్లాటుఫారం ఆ చివరినుండి ఇద్దరుమనుష్యులు మోసే ఒక స్ట్రెచ్చరూ, స్ట్రెచ్చరుమీద గుడ్డకప్పిన ఒక పేషెంటూ ఆ వెనక ఇద్దరుపోలీసులనడుమ ఆ యువకుడూ— జనంలో త్రోవచేసుకొంటూ వెనక్కి తిరిగివస్తున్నారు. అంగలు వేసుకుంటూ నిమిషాలమీద స్ట్రెచ్చరుమాత్రం జనరల్ ఆస్పత్రిలోకి వెళ్ళిపోయింది.

పోలీసుల నడుమనున్న ఆ యువకుడిచుట్టూ జనంపోగయి అతనిని తొందరగా సాగిపోనివ్వడం లేదు. గొడుగుపోగొట్టుకొన్న ఆంగ్లోఇండియన్ యువతీ, కాలివేలు నలిగిన అరవవిద్యార్థినీ, చీరచిరిగిన సినీమానటీ, ఆసంపు చించుకుని పళ్ళు పటపట కొరుకుతూ అతని ముఖంలోకి చూచి చక్కాపోతున్నారు. జనాన్ని పక్కలకు నెట్టుతూ, పోలీసులాతన్ని బయటికితీసుకొని పోయి ప్రక్కనే ఆఫీసులో ఉన్న పోలీసు అసిస్టెంటు కమీషనరు ఎదుట హాజరు పెట్టారు. జరిగిన విషయాలంతా పోలీసులు అసిస్టెంటు కమీషనరుతో మనవి చేశారు. అతడువిని,

"ఆడవాళ్ళంటే నీకింత ఆగ్రహం ఎందుకయ్యా?" అని ఆయువకుణ్ని అడిగాడు.

అతగాడు పలకలేదు. ఒక్కనిట్టూర్పుమాత్రం విడిచాడు.

"నీ పేరు—"అని అడిగాడు కమీషనరు.

"రాజగోపాల్"

"నీ ఊరు—"

"బందరు"—

"అక్కడేమి చేస్తున్నావు?"

"ప్రస్తుతం ఏమీ లేదు..."

"ఈ ఊరు ఏపనిమీద వచ్చావు?"

"'బుక్ మిలన్'కంపెనీలో పనిదొరికి వచ్చాను."

"అయితే ఆడవాళ్ళంటే నీకుగిట్టదా?"

రాజగోపాల్ బదులు చెప్పలేదు.

"వాళ్లమీద నీకేమైనా ప్రత్యేకమైన ఏవగింపు ఉన్నదా ?"

ఆడవాళ్ళంటే నాకేవిధమైన ఏవగింపూ లేదు, కిట్టకపోవడమూ లేదు. అంతేకాదు, వాళ్ళంటే నాకు ప్రత్యేకమైన అభిమానమూ, ఆదరణాకూడా ఉన్నవి."

"అట్లాగా?"

"పురుషులతోబాటు స్త్రీలకు అన్నివిషయాల లోను, సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలని ఘట్టిగా వాదించేవాళ్ళలో నేనొకణ్ణి."

"ఊ......"

"వొఠి శుష్కవాదాలేగాక, స్త్రీల పురోభివృద్ధికి కార్యరూపంగా కృషిచేసి కొంతత్యాగంకూడా చేసిన పురుషులలో నేనొకణ్ణి."

"........."

"స్త్రీలు పునర్వివాహాలకు ముందంజ వేస్తున్నారంటేవాళ్లకంటె నేనే వేయిరెట్లు ఉప్పొంగిపోయాను శారదాబిల్లు శిలాశాసనమైనందుకు నాకు కలిగిన ఆనందం వర్ణనాతీతం. హిందూసంఘంలో పురుషులతోబాటు స్త్రీలకు ఆస్తివిషయంలో సమానమైనహక్కులు సంక్రమింపబోతున్నాయని విని నావలే సంతోషించినవాడు ఆంధ్రదేశంలో మరొకడు ఉండడు."

"ఊఁ......"

"అవకాశమిచ్చినట్లయితే ఏ విషయంలోనూ స్త్రీలు పురుషుల కెంతమాత్రం తీసిపోరని నా విశ్వాసం."

"మంచిది—"

"స్త్రీలను అబలలని పిలవడం వారి గౌరవానికే గాక, పురుషుల గౌరవానికికూడా భంగకరమని నేను వాదించేవాణ్ణి."

"బాగుంది—"

"స్త్రీల పురోభివృద్ధికి పాటలు కట్టాను, పదాలు పాడాను, ఉపోద్ఘాతలు చేశాను."

"........."

"పురుషులతో సమానంగా స్త్రీలు సైకిళ్లు తొక్కుతున్నారంటే, సంతోషించాను; మోటార్లు నడుపుతున్నారంటే మురిసిపోయాను; గుర్రా లెక్కుతున్నారంటే విర్రవీగిపోయాను; తుదకు కత్తిగట్టి రణరంగంలోకి స్త్రీలు దూకుతున్నారంటే — విజయ భేరి మోగించాను."

"సంతోషం—"

"కాని, కాని—ప్రభూ—"

"ఏమి?—"

"ఒకానొక అనుభవంలో, ఒకానొక సంఘటనలో, ఈ జీవితానికి కొత్తభావాలు పొడకట్టినవి."

"........."

"పురుషులతోబాటు సమానత్వమే గాదు, పురుషులకంటె స్త్రీలు పైకి పెరిగిపోతున్నట్లు నా అనుభవం ప్రత్యక్షంగా నాకు ఋజువు చేసినట్లనిపించింది."

"........."

"స్త్రీలలో ఇటువంటి మార్పు కలుగుతుందని నేనెన్నడూ అనుకోలేదు."

"........."

"నేను వారివల్ల ప్రత్యుపకారం, పారితోషికం, తృణంకూడా ఆశించలేదు—"

"........."

"వాంఛ్ల పురోభివృద్ధికై ఇంకా సేవచేయడానికి సిద్ధపడి వున్నాను కాని..."

"..............."

"కాని, నేను కోరినది ఆడజాతి సానుభూతి ఒక్కటే—"

"సానుభూతా ?—"

"అది లోపించినట్టు నాకు గోచరించినపుడే నాకు తెలియకుండానే నాలో మార్పు వచ్చిందని ఇప్పుడు గ్రహించుకొంటున్నాను—"

"దాని ఫలితమేనా—ఈ నీ ప్రవర్తన ?—"

"క్షమించాలి..."

"నీవేమి చదువుకొన్నావు ?"

"బి. ఎ. బందరులో పాసయి, బి. ఎల్. మద్రాసులో నే పూర్తిచేసి ఏడేళ్ళయిందండి. ?

"..............."

"బి. ఎల్. పూర్తిచేసి బందరులో బోర్డుకట్టి రెండేళ్ళు గడచినా, తరచు నేను స్త్రీ సంఘోద్ధరణ

వ్యాపకంలోపడి ఉండడంచేత నాకు సంపాదన లేకుండా పోయింది."

"నీకేకాదు—ఈ కాలంలో చాలామంది అడ్వకేట్లకు అనిశ్చితంగానే ఉన్నది సంపాదన."

"మనవి చేసుకున్నాను:- ఈ వృత్తిలో అర్థశూన్యమైనందున కట్టినబోర్డు విప్పి, గవర్నమెంటు సర్వీసు బి. ఎల్., పాసయినవాళ్లకు లాభదాయకంగా ఉన్నదని తెలిసి, ఆ సంబంధమైన పరీక్షలు కూడా ఇచ్చి తాలూకా కచ్చేరిలో గుమాస్తాగా చేరాను."

"మంచిది—"

"కాని, ఒక హరిజన స్త్రీ కుటుంబానికి సర్కారు బంజరు భూమి దరఖాస్తు మీద మంజూరు చేసే విషయములో నాకూ, తహశీల్దారుకూ అభిప్రాయ భేదాలు కలిగి తగవులుగా పరిణమించినందువల్ల నౌకరీలో చేరిన ఏడెనిమిది నెలలకు నేనా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి బయటికి వచ్చేశాను—"

"తర్వాత—"

"తర్వాతనే జీవితం కొంత దుఃఖ భాజనమైపోయింది. పత్రికలకు కథలూ, పద్యాలూ వ్రాసి పంపితే వాళ్ళు వేసుకోలేదు సరికదా, నా కాగితాలు నాకు వాపసు అయినా పంపేవారు కారు—"

"పాపం."

"జీవనాధారానికి స్త్రీలపై ఆధారపడడం—నా కిష్టం లేకపోయినప్పటికీ, స్త్రీ సంఘం తరఫున వెలువడే పత్రిక నా చేతిమీదుగా నడుపుతాను—పర్మిషన్ ఇస్తారా, అని వళ్ళివాళ్ళని అడిగాను—"

'వాళ్ళు అంగీకరించలేదు."

"నేను వ్రాసిన కథలూ, పద్యాలూ, నాభార్య పేరుతో మీ పత్రికకు పంపుతాను—ప్రకటించి తృణమో పణమో దయచేస్తారా అని నేను స్త్రీసంఘాధ్యక్షురాలిని కోరినమీదట, ఆమె అంగీకరించింది గాని కొంతకాలం జరిగినపిదప, అటువంటి వృత్తిలో ద్రవ్యార్జనచేయడం నాకే చిన్నతనం అనిపించి నేనా పని విరమించుకొన్నాను."

"బాగుంది—"

"స్త్రీలంటే అప్పటికీ నా హృదయంలో ప్రేమే కాని అనాదరణ మందుకైనా లేదంటే నమ్మండి."

"మంచిది—"

"ఇటీవల 'బుక్ మిలన్' కంపెనీకి ఏజెంట్లు కావాలని పత్రికల్లో ప్రకటనపడితే—ఇంటివద్ద జరిగే విధం కనిపించక—నేను దరఖాస్తు పంపుకొన్నాను."

"నెలకు నూరు రూపాయల ఉద్యోగమిది—"

"మంచిది—"

"ఈ సాయంత్రం 3 గంటలకు నన్ను ఇంటర్వ్యూకు రమ్మని కంపెనీనుండి ఆహ్వానం వస్తే యీ ఉదయం మెయిలులో నేనిక్కడకు వచ్చాను."

"వచ్చిన పని అయిందా?"

"మనవిచేస్తున్నా మైలాపూర్‌లో నా స్నేహితుని ఇంట్లో బసచేశాను. నేను వెళ్లవలసిన కంపెనీ టౌన్‌లో ఉన్నది. దూరప్రయాణం—సరిగా వేళకందుకోవలసి యున్నందున, మధ్యాహ్నం 2 గంటలు కాకుండానే సూటు వేసుకొని, బూటు తొడుక్కొని, కాలర్, టై వగైరాలు వేసుకొని, కంపెనీకి బయల్దేరాను. బస్సుస్టాండుకు వచ్చాను."

"..............."

"నేను స్టాండుదగ్గరకువచ్చి రిస్టువాచీ చూచుకొనేసరికి సరిగా 2 గంటలయింది. స్టాండువగ్గర రెండుబస్సులకు సరిపడా జనం ఆడా, మొగా, నిలబడి ఉన్నారు. అంత జనసమ్మర్దం ఉండడానికి కారణమేమని విచారించగా మాటినీ సినిమాకు వేళ అయిందని తెలిసింది. ఆ జనాన్ని తోసుకొని బస్సులో పడడమెట్లా అని నాకు భయమంకురించింది. మొహమంతా కళ్లు చేసుకొని బస్సుకొరకు ఎదురు తెన్నులు చూస్తూ జనం తోసుకుంటున్నారు. ఇంతలో బర్రుమంటూ బస్సొకటి వచ్చి స్టాండుమీద నిలిచింది. బస్సు ఇంకా పూర్తిగా నిలబడకుండానే సమీపించే బస్సుకి ఎదురుగాపోయి కమ్మీలు పట్టుకొని చిన్నపిల్లలు వెంబడించినట్లు కూడా పరుగులు తీస్తున్నారు కొందరు పెద్దమనుష్యులు. దిగవలసిన జనాన్ని దిగనీయకుండా ఎక్కవలసిన జనం తోసుకుంటూ జంట

జంటలుగా లోపలకు దూరి కూర్చుంటున్నారు. నేను ఆలస్యంగా వెళ్ళినందువల్ల గుంపు చివరపడిపోయి ఎడంగా నిలబడి ఉన్నాను. ఆ త్రొక్కిడిలో లోపలకు పోలేని ఆడవాళ్ళు ముందుకువచ్చి కూడా, ఆతురపడే మొగవాళ్ళకు ఎడమిచ్చి వైదొలగి ఊరుకున్నారు. ఇక ఆ బస్సులో కాలిపెట్టగల ప్రాప్తం నాకులేదని నిరాశ చేసుకొని రిస్టువాచీ చూచుకొనేసరికి రెండుగంటల మీద అయిదు నిమిషాలయింది."

"ఈ బస్సుకదిలి జనసమ్మర్దం తగ్గితే రెండో బస్సులో పోదామనుకొని నేను ఎడంగా నిలబడి, చిటచిటలాడే ఎండ వేడిమికి ముఖాన్న లేచిన ఘర్మబిందువుల్ని చేతిరుమాలుతో అద్దుకొనే ఆడగుంపును జాలిగా చూస్తూ ఊరుకున్నాను—"

"కాని ఎంతసేపు అవిఘ్నంగా నిలబడడం 3 గంటలకల్లా కంపెనీదొర సముఖంలో నేనుండాలిగదా! ఇంకా రమారమి ఒక గంట వ్యవధి ఉన్నది. బస్సు అంటూవచ్చి, దానిలో పడితే ఎంతసేపు ప్రయాణం! రెండో బస్సుకోసరం ఎదురుచూస్తూ నిలబడిఉన్నాను. ఇంకో పదినిమిషాలకు రెండోబస్సు వస్తుందని చెప్పుకుంటున్నారు, అక్కడ నిలబడ్డ ఆడంగులు. రిస్టువాచీలో నిమిషాలూ, సెకండూ లెఖ్ఖపెట్టుకొంటూ నేనూ ఆ ఎండలో అట్లానే నిలబడిపోయాను.

ఒక పావుగంటకు రెండోబస్సు వచ్చి స్టాండు మీద్ధ నిలిచింది. మొదటిబస్సు కున్నంత త్రొక్కిడి రెండోబస్సుకు లేకపోయినా, ఈసారికూడా ఒక బస్సుకుమించిన జనమే పోగయారు ఆసమయానికి. మొదటి బస్సులో అందరూ మొగవాళ్ళే ఎక్కిపోయినందున రెండోబస్సుకి మిగిలిపోయిన వాళ్ళలో చాలా మంది ఆడవాళ్ళే నిలబడిపోయారు. అందువల రెండో బస్సు వచ్చీ రావడంతోటే ముందు ఎక్కువగా ఎక్కగలిగిన వాళ్లందరూ ఆడవాళ్ళే. ఈబస్సు దాటిపోకుండాలోపల దూరడానికి ప్రయత్నం చేద్దామని నేను దగ్గరకుపోయి బస్సు కమ్మీ పట్టుకున్నాను. కాని అప్పటికే బస్సు నిండిపోయినందున కండక్టరు లోపలకునల్లి లెక్కచూచుకుని ఇక ఖాళీలేదని అంటూ బస్సు డ్రయివరుకు బిగులు ఊదాడు."

"..............................."

ఇంతలో ఒక తెలుగు వితంతువు వచ్చి జనరల్ ఆస్పత్రిలో రోగిగా పడిఉన్న తన కొడుకు దగ్గరకు అర్జంటుగా పోవలసి వున్నదనీ, బస్సులో ఎక్కిన వారిలో ఎవరయినా ఒకరు దిగితనకు ఖాళీచేయవలసినదని బహుదీనంగా ప్రార్థించేసరికి బస్సులో కూర్చున్న ఒక లేడీ కనికరించి ఆవితంతువు నెక్కించింది.—

ఇక నేను ఎక్కడం ఎట్లా? నావిషయంలో కూడా ఏస్త్రీ అయినా కరుణించి ఖాళీ చేయవలసినదని ప్రార్థిద్దామని నోటి చివరిదాకా వచ్చింది, కాని ఇంతలో డ్రయివరు బ్రగున గేరుమార్చి, బంయి, బంయి మని హారన్ ఊదుకొంటూ బస్సు పోనిచ్చాడు.

నా చేతిలోని బస్సుకమ్మీపట్టుజారి, నేను ఎడమైపోయాను.

రిస్టువాచీలో రెండున్నరగంటలకీ ఇంకో అయిదు నిమిషాలు కొబోలు, కొరవ ఉన్నది.

కాలయాపన అయిపోతున్నందుకు నాగుండె కూడా పట్టు జారిపోవడం ఆరంభించింది.

భోజనం అయిన వెంటనే 12 గంటలకల్లా కంపెనీకివెళ్ళి కనిపెట్టుకొని ఉండకపోయినందుకు— అన్నా అని నాలుక కరచుకొన్నాను. టౌనుకి వెళ్ళడం ఎట్లాగో తోచలేదు. ఆపేటకి ట్రాంబండి కనెక్షన్ లేదు. సైకిలొకటి దొరికితే ఎట్లాగో తొక్కుకొని పోవచ్చుగాని, నాకప్పుడు సైకిలెవరిస్తారు? ఎంతసేపు చూచినా అతట్ట నాకు జట్కా అయినా కనిపించలేదు. రిక్షావాడికో ముప్పావులా పారేస్తే లాక్కొని పోతాడు గాని, ఇంతదూరం నడిచి పోయేవరకు వేళ మించి పోదూ?

"నాకాందోళన ఎక్కువైంది. పక్కకి తిరిగి చూచుకుంటే మళ్ళా ఒక బస్సుకు సరిపోయే జనం తయారయి పోతున్నారు. ఇందాక రెండో బస్సులో వితంతువుకి ఖాళీచేసి దిగిన లేడీ, ఎప్పుడెక్కుదామా బస్సు అని ఆతురపడుతున్నట్లు కనిపిస్తోంది. ఈ సారి ఆమె కంటె కూడా ముందెక్కి కూర్చోవాలని నాకూ జాస్తి అయింది ఆతురత. మూడోబస్సు వచ్చీ రావడంతోనే కమ్మీపట్టుకొని లోపలకు దూరి కూర్చోవాలని నేను నిశ్చయించుకున్నాను.

రిస్టువాచీ చూచుకుంటే రెండుగంటల మీద నలభై నిముషాలయి పోయింది. ఇంక ఆలస్యం ఎంతమాత్రమూ జరగడానికి వీల్లేదని నేను నిశ్చయ పరచు

కొంటూ ఉండగానే, బర్రుమంటూ మూడో బస్సు వచ్చి స్టాండుమీద నిలబడింది. అది ఇంకా పూర్తిగా నిలబడకుండానే నేను ఫుట్‌బోర్డుమీద కాలుపెట్టి, కమ్మీపట్టుకొని, గభాలున లోపలకు దూరి ఖాళీ అయిన ఒక సీటులో స్థిరంగా కూర్చున్నాను. గుండెలో ఆందోళన కొంత తగ్గింది. బస్సు బయల్దేరితే ఇంకో పావుగంటలో టౌన్‌కి వెళ్ళిపోవచ్చు. మనస్సు కుదుటపడింది—ఏదో పుస్తకంలో సంతకం పెట్టి రావడానికి గాబోలు కండక్టరు బస్సుదిగి వెళ్ళిపోయాడు. డ్రయివరు కూడా దిగి ఇంజన్ పక్క నిలబడి బీడీ కాల్చుకుంటున్నాడు. ఎక్కడనుండి ఎప్పుడు వచ్చారో పాసెంజర్లు ఇంకా ఎక్కుతూనే ఉన్నారు. సీట్లన్నీ భర్తీఅయిపోయి ఒకరిద్దరు పెద్ద మనుష్యులు టాపుకి తగిలించిన కమ్మీ పట్టుకొని నిలబడ్డారు.

ఎంత త్యాగమూర్తో, రెండో బస్సు నుండి దిగిన ఆ స్త్రీ ఆ తొక్కిడిలో ఎక్కకుండా మొగవాళ్ళందరూ ఎక్కే వరకూ అటనే నిలబడి, అందరూ ఎక్కిన తర్వాత ఎక్కి, లోపల సీట్లన్నీ భర్తీ అయిపోయినందు వల్ల నా ఎదురుగ్గానే టాపు కమ్మీపట్టుకొని నిలబడింది.

డ్రయివరింకా బీడీ కాలుస్తూనే ఉన్నాడు.
కండక్టరింకా రాలేదు.

నా వాచీలో 3 గంటలకు ఇంకో పదినిమిషాలు మాత్రమే కొరవ ఉన్నది. బస్సు తొందరగా బయల్దేరితే బాగుండునని నాకు తొంప రెక్కువైంది.

కాని—ఈ స్త్రీ—నా ఎదుట నిలబడే ఉన్నది. బస్సునిండా మొగవాళ్లు .తింగురంగా అని సీట్లు భర్తీ చేసుకొని కూర్చున్నవాళ్లేగాని, ఒక్కడూ లేచినిలబడి ఆమె కూర్చోవడానికి కాస్త ఖాళీ చేసినవాడు కనిపించడు. రెండోబస్సులో ఎక్కి కూర్చున్న మనిషి ఆమె. దిగి మరొక స్త్రీకి స్థలమిచ్చిన త్యాగమూర్తిఆమె. మూడోబస్సులోకూడా తొందరపడి మొగవాళ్ళ సందున నలిగి ఎక్కడాని కిష్టంలేక అందరూ లోపలకి వెళ్లేవరకూ తాను ఎడంగా నిలబడి ఆఖరున ఎక్కి, అంతమందిలోనూ నిలబడి ప్రయాణం చేయడానికి నిశ్చయించుకొన్న శీలవతి ఆ ఇల్లాలు! ఆ బస్సులో ఆమెతప్ప మరో స్త్రీ ఎవ్వరూ లేరు.

ఒక్క మొగపురుగయినా లేచి నిలబడి ఆమెను కూర్చోబెట్ట డెందువల్ల?

ఆమెను చూచి నాకు జాలివేసింది. గుండె కరిగింది. అమెను కూర్చోబెట్టి, మనమే నిలబడి ప్రయాణంచేద్దామని అనుకొని, వెంటనే నేను లేచి,

“మీరిట్లా కూర్చోండి” అని నాసీటు ఆమెకు చూపించాను.

“ఆమె నాసీటులో కూర్చుని, “థాంక్స్” అని చెప్పినట్టే, నా మనస్సుకు తట్టి, నేనూ తృప్తిపడి చిరునవ్వు నవ్వుతుండగనే,

“టిక్కెట్టు” అంటూ కండక్టరు లోపలకువచ్చి “స్టాండింగు కడియాదు, ఎల్లా రెరంగో” అని కేక పెట్టాడు.

“ఎవరి నీ కండక్టరు దిగమంటున్నాడు?” అని నేను తర్కించుకొనేలోపలనే, నాతో బాటు టాపు పట్టుకుని నిలబడ్డ ఇద్దరు పెద్దమనుష్యులూ దిగి చక్కాబోయారు—నేనొక్కణ్ణే టాపు పట్టుకొని అట్లానే నిలబడ్డాను.”

“స్టాండింగు కడియాదు. ఎరంగో సామీ” అని, నాతో ఘటిగా చెప్పాడు కండక్టరు.

“అర్జంటు పనిమీద నేను టౌన్‌కి వెళ్లాలి గంట నుంచి కాచుకొని ఉన్నాను—మిసర్ కండక్టర్” అన్నాను నేను.

“అదెల్లా ముడియాదు. ఎరంగో సామీ” అన్నాడు కండక్టరు.

“అందరికంటె ముందెక్కినయ్యా నేను బస్సూ. ఎలాగయ్యా దిగేది?” అన్నాను నేను.

“ముందెక్కితే సీటులో కూర్చోవాలిగాని, నిలబడ కూడ”దన్నాడు కండక్టరు.

“మరి ఇందాక రెండు బస్సుల్లోనూ జనం ఎక్కి నిలబడ్డారే” అన్నాను నేను.

“ఆ బస్సులో ముగ్గురు స్టాండింగు పాసెంజర్లకు లైసెన్సు ఉన్నది. ఈ బస్సుకు అటువంటి లైసెన్సు లేదన్నాడు”—కండక్టరు.

“ఎన్నా అయ్యా! శీఘ్రం ఎరంగయ్యా! రొంబ నేరం అయిపోచ్చీ” అని కేక పెట్టాడు—ముందునుండి డ్రయివరు.

"నా సీటులో కూర్చున్న ఆమె ముఖంలోకి జాలిగా చూశాను నేను."

బెల్లంకొట్టిన రాయిలా ఆమె అట్లనే కూర్చున్నది. అంతమంది మొగవాళ్ళలోనూ ఆమె ఒక్కతే ఆడమనిషి! ముందెక్కి కూర్చున్న నేను దిగవలసి, చివరఎక్కిన ఆ ఆడమనిషి కూర్చోవలసి వచ్చినప్పుడు ఒక్క మొగవాడుకూడా నా పక్షం న్యాయం చెప్పడానికి నోరు మెదపడే. ఆ ఆడమనిషిన్నీ చేతిరుమాలు నోటికడ్డంపెటుకొని, నా కడుపు దహించేలా చిరునవ్వు నవ్వుతుందిగాని, పలకదే! రెండోబస్సులో మరొక స్త్రీ విషయమై తాను చూపించిన త్యాగం ఇప్పుడు పురుషుడనైన నాయెడల ఆమె ఎందుకు చూపించకూడదు? నా విషయంలో ఆమె చేసేది త్యాగం కానేకాదు. అసలు ఆమె కూర్చున్న సీటు నాదే!

నాకు రోషంవచ్చింది. దుఃఖం వచ్చింది— నిట్టూర్పువిడిచి బస్సు దిగాను.

పొగలువిడుస్తూ బస్సు కదిలింది.

"...

"ఇంటిదగ్గర బయల్దేరిన వేళావిశేషం. ఒకమైలు నడచివెళ్ళితే ట్రాంఅయినా చిక్కి ఈపాటికి కంపెనీ చేరుకునేవాణ్ణి. ట్రాంలో వెళ్ళితే ఆలస్యం అవుతుంది. బస్సులో వెళ్ళమన్నాడు నా స్నేహితుడు—"

ఈ బస్సుని నమ్ముకొని బయల్దేరాను.

మూడుగంటలు కావస్తోంది. వేళమించి నేను వెళ్ళితే దొర నన్ను లోపలకు రానిస్తాడా?

దిక్కుతోచలేదు. ఇంత దూరదేశం వ్యయప్రయాసలకోర్చి వచ్చిన పనిఅంతా భగ్నంపాడయిపోయేటట్లు వున్నదే! మూడుగంటలకు ఇక పదినిముషాలే ఉన్నది!

విధిగతి భగవంతుడా!

అని నేనాందోళన పడుతుండగనే స్టాండుదగ్గర మూళ్ళా జనం కిటకిటలాడిపోతున్నారు.

3-15 గంటలకు మాటినీ సినీమా వేళ కాబోలు! సోల్జర్లు, ఆంగ్లోఇండియన్ యువతులు, స్టూడెంట్లు— సింగారించుకుని, హేరాయిలూ, సెంట్లూ రాచ్చుకుని ఘుమఘుములాడుతూ, సిగరెట్లు పీలుస్తూ తండాలు తండాలుగావచ్చి పోగయారు.

ఇక రాబోయేది నాలుగోబస్సు. ఈ బస్సు అయినా చిక్కితే ఇంటర్వ్యూవేళకి ఓఅయిదూ పది నిమిషాలు ఆలస్యంగా అందుకొని, ఆలస్యానికి క్షమాపణ చెప్పుకోవచ్చు. కాని ఈసారిమాత్రం బస్సెక్కడానికి నాకు వీలు చిక్కుతుందని ఏమి నమ్మకం! వీలు చిక్కకపోతే ఎట్లా?

నాకు ఖంగారెక్కువైంది. తల దిమ్మెక్కింది. దాహం నోరెండిపోతోంది. దగ్గరలో సోడా కొట్టుకయినా వెళ్ళి రావడానికి, బస్సు వచ్చి వెళ్ళిపోతుందేమోనని మనస్సుకు స్తిమితం చిక్కడంలేదు. నిలబడి వుండడానికి కాళ్ళాడడంలేదు.

ఈజనం ఇంతమంది ఇప్పుడు సినీమాలకు పోకపోతేనేం? యుద్ధపురోజుల్లో బియ్యమూ, పెట్రోలు, కిరసనాయిలూ సర్కారువారు రేషనింగుపెట్టి పంచినట్లు బస్సుల్లోను, రైళ్ళలోనూ స్థలంకూడా ప్రయాణీకుల అవసరంకొద్దీ రేషనింగుపెట్టి పంచితే ఎంతబాగుండేవో. సినీమాలకు పోయేవాళ్ళు ఏ రిక్షాలోనయినా పోగూడదూ—"

"ఇట్లా నేననుకొంటూ ఉండగా నాలుగో బస్సుకూడా వచ్చి స్టాండుమీద ఆగింది. నాకు వొళ్ళు తెలియలేదు. బస్సులోనుండి దిగేవాళ్ళెవరో ఎక్కేవారెవరో నాకు తెలియడంలేదు. బస్సుగేటుదగ్గర జనం మూగి మోచేతులతో పొడుచుకుంటున్నారు. శివం ఎత్తినట్లయి నేనాగుంపులో జొరబడ్డాను. బస్సు కమ్మీ పట్టుకొన్న ఒక చేతిక్రిందనుండి దూరి ఫుట్‌బోర్డుమీద కాలుపెట్టబోతున్నాను. కమ్మీపట్టుకొన్న చెయ్యి ఒక ఆంగ్లోఇండియన్ యువతిది. ఆమె నాకంటెముందు బస్సులో కాలుపెట్టి తన ఎడంచేతిలోని తోలుసంచీ నా సందున, నా ప్రక్కనే త్రోసుకొనిఎక్కే మరొకప్యాసెంజరు సందునాపడి ఊడిరానందున ఆమె వెనక్కితిరిగి నా వైపుచూచింది. నేను లోపలకిపోయే ప్రయత్నంలోనే ఉన్నాను కాని, ఆమె తోలుసంచీ విడిపించాలని నాకాలోచన తోచలేదు. ఆమెకు కోపం ఎక్కువైంది.

పైన నిలబడిన ఆమె తన కుడిచేత్తో నా గుండెలమీద ఘట్టిగా అదిమి వెనక్కినెట్టింది. నేను కమ్మీ పట్టుకొని కదలలేదు.

ఆమె తన బలంకొద్దీ నన్ను నెట్టుతోంది. నేను ముందుకు సాగుతున్నాను.

ఆమెచెయ్యి నా చొక్కాకు తగిలించిన క్రిమెంట్సు గుండీమీదపడి, నెట్టడంలో నా రొమ్మునకి గుండీ గుచ్చుకొని నాకు బాధకలిగింది. ఆమె ఇంగ్లీషులో ఏదో గొణుగుకొంటూ, పళ్ళు పటపట కొరికి నన్ను ఒక్కసారి వెనక్కి నెట్టింది.

నా వెనుక జనాన్ని చిందుకొంటూ నేను వెనక్కి వెల్లకిలాపడ్డాను. నడుము ఖరేలుమన్నది. తల పగిలిందనుకొన్నానుగాని, ఒక లేడీ కాళ్లకు తగిలించిన ఎత్తు మడిమలబూటు నా తల క్రిందపడి కొంత రక్షించింది.

ఆ స్థితిలోపడ్డ నేను ఎప్పుడు లేచానో, మిగిలి ఉన్న జనం ఎప్పుడు బస్సులోకి ఎక్కారో నాకు తెలియదుగాని నన్నక్కడ విడిచి బస్సు సాగి పోయింది."

"సరీ సారీ" అన్నాడు కమీషనరు.

"నేను వేసుకొన్న సూటు పాడయిపోయింది. నా జుట్టు చెరిగిపోయింది. నా గుండె చెదరిపోయింది.

రిస్టువాచీలో 3-10 నిముషాలయింది.

ఇంకెక్కడి కంపెనీ, ఇంకెక్కడి ఉద్యోగం! ఇంతదూరం వచ్చి దొరని చూడకుండా ఎట్లా?

నా మనస్సులో ఆలోచన ఏమీ తట్టలేదు. పిచ్చెత్తిన వాడిలా ఆ రోడ్డున ఒక అరమైలు పరుగు పెట్టాను. జట్కా ఒకటి కనిపించింది—ఒకరూపాయి ఇస్తానన్నాను. నన్ను ఫ్లాట్‌కి తీసుకొని వెళ్ళాడు.

"నా రిస్టువాచీలో నాలుగుగంటలు కావస్తోంది. కంపెనీకి వెళ్ళి జవానుచేత దొరకి చీటీ పంపించాను. అయిదు నిముషాలకు నాకు లోపలకు రమ్మని పర్మిషన్ వచ్చింది—

గుడ్డలు సవరించుకుంటూ లోపలకు వెళ్లాను. దొరగారి గదికి తగిలించిన వికెట్ గేటు తెరచుకొని నాకెదురుగా వస్తోంది. ఇందాక మూడో బస్సులో నేను చోటిచ్చిన స్త్రీ.

నేను తెల్లబోయి చూస్తుండగా ఆమె నా వైపు వికటంగా చూచి నవ్వుతూ నన్ను రాచుకొంటూ నే చక్కాపోయింది.

అడుగులు కొలుచుకుంటూ నేను దొరగారి గదిలోకి పోయి, "ఆలస్యానికి క్షమించండి" అన్నాను.

"నీవు పదినిముషాలు ముందు వచ్చి ఉంటే నీకే ఇచ్చేవాణ్ణి. నీ దరఖాస్తు పంపుకొన్న స్థానానికి ఇప్పుడే ఆ లేడీ గ్రాడ్యుయేటును వేశాను—ఇక ఇప్పుడు ఖాళీలులే"వన్నాడు దొర.

"నీవిక వెళ్ళవచ్చును." అని దొర అతనివద్ద శెలవు పుచ్చుకుని నేను బయటకు రావాలన్న సంగతి నాకు స్ఫురించలేదు.

ఎట్లా వెళ్లానో ఒకగంటలో నేను బసకు చేరుకున్నాను. నా పెట్టె సర్దుకున్నాను.

మద్రాసు నాపాలిట నిప్పుల గుండంలా కనిపించింది. నాఉద్యోగానికి అడ్డంతగిలిన ఆ స్త్రీ నా కళ్ళకు పెనుభూతంలా కనిపించింది. కనిపించితే ఆమెను నమిలి మింగివేయాలన్నంత ఆగ్రహం కలిగింది.

నా కళ్లకి స్త్రీ కనిపించినప్పుడల్లా కళ్లు మూసుకొన్నాను. నాలో ఏదో భరింపరాని బాధకలిగి ఏడ్చాను.

మెయిల్లో బందరు వెళ్లిపోవాలని, రిక్షా కట్టించుకొని సెంట్రల్‌కి వచ్చాను.

అక్కడి జనసమ్మర్దం నన్ను మరింత భయపెట్టింది. నా బస్సు ప్రయాణం అనుభవం తలలో మండిపోతోంది, టిక్కెట్టుకొనుక్కొని ప్లాటుఫారం మీదకి పోయాను. కాని, ఈరోజు రైలుకూడా ఎక్కలేనేమోనని భయం వేసింది. ఒక కారేజిదగ్గరకు వెళ్ళి తలుపు నెట్టాను—

"ఇది మిలిటరీకి రిజర్వ్‌డు, ఫో" అని లోపల నుండి నన్నెవరో నెట్టినట్టయింది. పరుగుమీద మరో పెట్టెదగ్గరకు వెళ్లాను. లోపలకు వెళ్లడానికి గేటుకమ్మీ పట్టుకొన్నాను. ఇంతలో ఒక స్త్రీ నాకడ్డం వచ్చి తన చేతిలోని పంప్లుబుట్ట గేటు కడ్డంగాపెట్టి ప్లాటుఫారంమీదనున్న తన ఇతరసామాను లోపల పెట్టబోతోంది. ఆమె ముఖంలోకి తేరిపార చూశాను.

ఇందాక నేను బస్సులో ఖాళీచేసి సీటు ఇచ్చినటువంటి, దొరదగ్గర నా ఉద్యోగానికి అడ్డం వచ్చినటువంటి స్త్రీ-ఆమే!

ఆ అడ్డాలు చాలక, ఇప్పుడు తిరిగి రైలుదగ్గర కూడా నా కడ్డం వచ్చిందీమె! అని నాకు వొళ్లు భగ్గున మండిపోయింది.—

నా కుడిచేత్తో ఆమెను ఒక్క నెట్టు నెట్టాను. నేను లోపలకెక్కి కూర్చున్నాను.

ఆమె తుళ్ళి వెనక ప్లాటుఫారముమీద కూలీలు లాగే ట్రాలీ చక్రంమీద పడి ఆమె తల భళ్ళున పగిలి నెత్తురు వరదలైంది.

ఇంతలో సైరిచ్చరు వచ్చి ఆమెనాసుపత్రికి తీసుకొనిపోయింది—

పోలీసులు పట్టుకొని నన్ను మీ దగ్గరకు తీసుకొని వచ్చారు."

అని రాజగోపాల్ చెప్పినదంతా విని "ఇతనిని రాత్రి లాకప్పులో ఉంచండని" అంటూ, అసిస్టెంటు కమీషనరు లేచి చక్కాపోయాడు.

# అణు ధూ

వాల్టర్ సి. బాయర్- -జాన్ యం. ఫౌలర్

గతంలో జరిగిన అణ్వస్త్రాల పరీక్షలవల్లనూ ముందు ముందు జరగబోతున్న పరీక్షలవల్లనూ వాతావరణంలో కలుగు మార్పుయొక్క ప్రభావం మానవారోగ్యంమీద యెలా వుంటుంది? అనే విషయమై ఇటీవల చాలా తీవ్రమైన ఆందోళన బయలుదేరింది.

* ఏప్రియల్ 24 వ తేదీన, ప్రసిద్ధ విజ్ఞానశాస్త్రవేత్త, మానవవాద ప్రబోధకుడు, డాక్టర్ స్క్వయిట్జర్, యిలా ఒక ప్రకటన చేశారు: 'అణ్వాయుధ పరీక్షలవల్ల యిప్పటికి యేర్పడిన ప్రమాదం మాట అటుంచి యీ చర్యలు ముందు యింకేమాత్రం కొనసాగినా ప్రపంచానికి వినాశం సంభవిస్తుంది.'

* ఏప్రియల్ 26 వ తేదీన, స్క్వయిట్జర్ కు సమాధానంగా 'అమెరికా అటామిక్ ఎనర్జి కమిషన్' సభ్యుడు డాక్టర్ విలర్డ్ యఫ్. లిబ్బీ ఇలా మరొక ప్రకటన చేశారు: 'ప్రజానీకంలో గమనార్హమైన మార్పు రావటానికి అవసరమైన ప్రసరణకంటే, అణ్వస్త్రవిసర్జితమైన అణుధూళి ప్రసరణ చాలా తక్కువగా వుంటుంది.'

* మే 15 వ తేదీన, పరమాణువ్యాధి నిదానంలో విశేషపాండిత్యం గలవాడు, రసాయనిక శాస్త్రంలో 1952 సంవత్సరంలో నోబెల్ బహూకృతి పొందిన మహాపురుషుడూ, అయిన డాక్టర్ లీనస్ పాలింగ్, వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో ఆనర్సు పట్టప్రదాన మహోత్సవ సందర్భంలో ప్రసంగించుతూ ఇలా అన్నారు:

“ఇప్పటికి జరిగిన అణ్వస్త్రపరీక్షల ఫలితంగా, పుట్టబోయే తరం మానవసంతానంలో 2,00,000 శల్యధాం గులు పుడతారనీ, ఈ తరంలో షుమారు 1,000,000 జనం చచ్చివుంటారనీ మనం అంచనా వెయ్యవచ్చు ”

* మే 10 వ తేదీన, అమెరికా రక్షణశాఖకు చెందిన అణ్వస్త్రశాస్త్రవేత్త డాక్టర్ ఫ్రాంక్ హెచ్. షెల్టన్ ఇలా అన్నారు:

“మానవ జాతికి ప్రమాదం లేకుండా, అణ్వస్త్ర పరీక్షలను ఇలా ఇంకా 40, 50 సంవత్సరాల వరకూ కొనసాగించవచ్చు.”

డాక్టర్ స్క్వయిట్జర్ అణుశాస్త్ర విజ్ఞానంలో నవీనంగా జరుగుతున్న పరిశోధనలకు కొంత దూరంగా వున్నవారు. పైపెచ్చు తీవ్రమానవవాది. అందుచేత ఆయన చేసిన హెచ్చరికయొక్క తీవ్రతకు కొంత పరిమితిని కల్పించుకొని మనం అవగతం చేసుకోవచ్చు: అలాగే షెల్టన్ ప్రవచనాలకు కూడా ఆయన రక్షణశాఖలో వుండి మాట్లాడుతున్నాడనే దృష్ట్యా, తగిన విలువను నిర్ణయించవచ్చు: వీరిద్దరి విషయం ఇలా వున్నా, ప్రసిద్ధులైన తక్కిన శాస్త్రవిజ్ఞాన వేత్తలలో కూడా మానవజాతికి జరిగిన, జరగబోయే ప్రమాదంయొక్క విస్తృతి యెంత అనే విషయంలో కొంత మతభేదం కనిపించుతున్నది.

ఈతర్జన భర్జనలమధ్య శాస్త్రవేత్తకాని మామూలు మనిషి స్థితి అయోమయంగా వుంటుంది. ఏమీ అర్థంలేని ఆ చిరాకులో, నైరాశ్యంపొంది యీ వ్యవహారాన్నంతా సాంకేతిక విద్యా నిపుణులకు వదిలేసి తాను మనశ్శాంతిగా నిద్రపోవటానికి చూస్తాడు. కాని ఇది అలా ఔదాసీన్యం వహించి నిద్రపోదగిన విషయం కాదు. ఇది ఈ తరం ప్రజలపైననే గాక

---

వాల్టర్ సి. బాయర్ (యం. డి.) వాషింగ్టన్ విశ్వవిద్యాలయ పర్యవేక్షణలోని సెయింట్ లూయీ వైద్య విద్యా కేంద్రంలో వ్యాధి నిదానశాఖ అధ్యాపకులుగా పని చేస్తున్నారు. జాన్ యం. ఫౌలర్ వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో భౌతిక విజ్ఞానశాఖలో అసిస్టెంట్ ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు.

కానున్న తరతరాల మానవజాతిపైనా విశేషప్రభావం చూపగల సమస్య. ఈ అణుపరిశోధన అనేది అనేక విస్తృతావధి అవాంతరాలను అధిగమించవలసివున్న రంగం. అందుచేత యిందులో పరిపూర్ణపాండిత్యమనేది ఊహాతీతమైన విషయం. అందుచేత 'నిపుణుల' ప్రసక్తికి ఆస్కారంలేదు. ఇలాంటి సందర్భంలో పరస్పర విరుద్ధములైన ఈ ప్రకటనలు చేస్తున్నవారు ఏ ప్రయోగాధారాల మీద చేస్తున్నారో, అణు ప్రసరణ ప్రమాణాలను నిర్ణయించేటప్పుడు "ప్రమాద రహిత పరిమాణం" ఇత్యాది ప్రమాణాలను ఏ ఆధారాలతో నిర్ణయిస్తున్నారో మనం తెలుసుకోవలసి వుంది.

ఆ యీ విషయాలను స్థూలంగా వివరించి, శాస్త్రవిజ్ఞాన పరిచయంలేని మామూలు మనిషికి కూడా కొన్ని ప్రాథమిక విషయాలు అర్థమయేలాగు చేయటానికి ప్రయత్నించుతాం. తద్వారా భవిష్యత్తులో ఈ శాస్త్రవిజ్ఞాన వేత్తలుచేయగల ప్రకటనల విలువలను కొంతకు కొంత అవగతం చేసుకోగల ఆస్కారం మామూలు మనిషికి కూడా కల్గించగలమని ఆశించుతున్నాం.

ఈ సమస్య తొలిసారిగా 1945 సం॥ 6 వతేదిన ఈ మానవలోకంలో అవతరించింది. ఆనాడు ఒక అణ్వస్త్రం ప్రళయసన్నిభమై ప్రేలి హిరోషిమానగర గగనపథాన వెలుగుతున్న సూర్యుణ్ణి ఆచ్ఛాదించి వేయటమేగాక, 70,000 జపానీయులను భస్మం చేసి వేసింది. ఆ అణ్వాయుధ విస్ఫోటిలో గగనపథాన విసర్జింపబడిన అణుధూళి, రోజులతరబడి వారాలతరబడి, గగనాన్నుంచి, భూమిమీదికి రాలింది. ఈ ధూళిలో రజతవర్ణంలో తళతళలాడుతున్న 'స్ట్రాన్షియం' అనే తెల్లటి లోహపదార్థమొకటి కనుపించింది. అయితే యిది మామూలుగా భూమిమీద అతఃపూర్వం కనుపించుతున్న 'స్ట్రాన్షియం' లాంటిది కాదు. ఇది రేడియో ధార్మిక స్వభావం కలది. ఈదుష్టపదార్థాన్ని "స్ట్రాన్షియం-90" అనే పేరున పిలుస్తున్నారు. కాని ఆనాటి అస్త్రం నుంచి రాలిన ఈ పదార్థంయొక్క పరిమాణం బహుస్వల్పం. దీన్ని చూసి ఆనాడే కొంత అలజడి కలిగింది. కాని ఆ ఆందోళన అంత తీవ్రరూపం దాల్చలేదు. తొమ్మిది సంవత్సరాల అనంతరం ఈ విచిత్ర లోహంయొక్క ఉనికి ప్రపంచం సర్వత్రా భయాందోళనలకూ, వాద ప్రతివాదాలకూ కారణభూతమై కూర్చుంది.

1954 మార్చిలో, అమెరికా శాస్త్రజ్ఞులు, ఒక హైడ్రోజెన్ బాంబు పేల్చి చూశారు. దీని ప్రేలుడు శక్తి తొలి అణ్వస్త్రానికి వెయ్యి రెట్లు. అదివరకు ఎవ్వరి దృష్టినీ ఆకర్షించని అణుధూళియొక్క ప్రమాదం, జగత్తునంతా ఆకర్షించింది. శాస్త్రజ్ఞులు ప్రమాద వలయంగా నిర్ణయించిన మేరకు ఆవలనే, కొందరు జపాన్ పల్లె కారులు ఒక చేపల పడవలో ఎక్కి సముద్రంలో చేపలుపడుతున్నారు. ఈ భయంకరాయుధం విసర్జించిన అణుధూళి వారి మీద రాలింది. ఈ బెస్తలకు సంభవించిన ప్రమాదంతో లోకానికి కనువిప్పు కలిగింది.

## సంఛేద, సంయోగ ప్రక్రియలు
## [Fission and Fusion]

తొలి అణ్వస్త్రాలకంటే యీ క్రొత్త అస్త్రం బలవత్తరం కావటానికి కారణం దీనికి 'సంఛేద' ప్రక్రియతో పాటు 'సంయోగ' ప్రక్రియనుకూడా చేర్చటం. అంటే ఏవిటో కొంత అవగతం చేసుకుందాం. ఈ రెండు ప్రక్రియల వల్లనే అణ్వస్త్రాలకు అలాంటి ప్రళయ సన్నిభమైన ప్రేలుడు శక్తి లభించుతుంది. తొలిఅణ్వస్త్రాలలో కేవలం 'సంఛేద' ప్రక్రియ నొక్కదాన్నే ప్రయోగించేవారు. హైడ్రోజన్ బాంబ్ అని పిలువబడుతున్న ఈ క్రొత్తరకం అణ్వస్త్రంలో అంతకంటే బలవత్తరమైన సంయోగ ప్రక్రియను కూడా వాడుతున్నారు. ఈ రెండు ప్రక్రియలు ఇంచుమించు ఒకే ఫలితాలు కలవి. పదార్థం శక్తిగా పరిణమింప చేయబడుతున్న కార్యక్రమంలో ఈ రెండు ప్రక్రియలూ ప్రేలుడు శక్తిని సంతరించుకుంటాయి. ఈ రెండు ప్రక్రియలూ కూడా అణువుయొక్క కేంద్రంలోనే (న్యూక్లియస్) జరుగుతాయి.

సంఛేదన ప్రక్రియ (Fission reaction) అనగా, కొంచెం పెద్దదిఅయిన యురేనియం అణువుయొక్క కేంద్రాన్ని బద్దలుకొడతారు. సంయోగ ప్రక్రియలో, హైడ్రోజన్‌కు మరొక రూపమైన 'డ్యూటేరియం' (Deuterium) అనే పదార్థం అణువులు రెండు చిన్నవి సేకరించి వాటి కేంద్రాలను రెండిటిని ఒకటిగా, పెద్దదిగా రూపొందించుతారు. సంఛేదన ప్రక్రియలో కేంద్ర విచ్ఛేదానంతరం మిగిలిన యురేనియం అణువు ఆదిలో సేకరించిన అణువుకంటే

బరువు తక్కువగా వుంటుంది. సంయోగ ప్రక్రియానంతరం క్రొత్తగా ఏర్పడిన 'డ్యూటేరియం' అణువు ఆదిలో సేకరించిన రెండు చిన్ని అణువులకంటే బరువు తక్కువగా వుంటుంది. ఈ రెండు ప్రక్రియలలోకూడా పదార్థం కొంత నశించిపోయిందని మనకు తెలుస్తున్నది. ఈ అదృశ్యమైన పదార్థమే శక్తిగా పరిణామంచెంది ప్రేలుడుకు కారణమౌతున్నదన్నమాట.

సంఛేదన ప్రక్రియలో యేర్పడుతున్న 'స్ట్రాన్‌టియం-90,' పరిమిత జీవితంకల యితర రేడియో ధార్మికశక్తిగల పదార్థాలూ ఏర్పడుతున్నాయి. ఇవి అంతి ప్రమాదకరమైనవి కావంటున్నారు. దురదృష్ట వశాత్తూ సంయోగ ప్రక్రియను సంఛేదన ప్రక్రియ అంత తేలికగా సాధించలేము. సంఛేదన ప్రక్రియకు కాస్మిక్-రే న్యూట్రాన్ ఒక్కటి చాలును. కాని సంయోగ ప్రక్రియకు అలాకాదు. అనంతమైన శక్తిగల న్యూట్రానులు అనేకం కావాలి. ఈ శక్తిని ఫారన్‌హీట్ డిగ్రీలలో కొలిస్తే 20 కోట్ల డిగ్రీలవేడి వుంటుంది—సూర్యగోళ అంతర్భాగానికి సరిసమానమైన వేడి. ఇంత ఉష్ణోగ్రతను సృష్టించటానికి మనిషి కనుక్కున్న సాధన ఒకటే: సంఛేదన ప్రక్రియ. ఆటంబాంబుయొక్క అంతర్భాగం సూర్యగోళం యొక్క ఉష్ణోగ్రతకు జ్వలించి, సంయోగ ప్రక్రియను సాధించటానికి సాధనమౌతుంది.

ప్రాథమిక విషయాలు యిప్పుడు కొన్ని మనం అర్థంచేసుకున్నాం కనుక హైడ్రోజెన్ బాంబును ఏరూపంలో తయారుచేస్తారో ఇప్పుడు మనం కొంత అవగతం చేసుకోవచ్చు.

ఈ హైడ్రోజన్ బాంబు గర్భంలో మధ్యగా ఆటంబాంబు వుంటుంది. ఈ ఆటంబాంబు హిరోషిమామీద వేసిన బాంబుకంటే చాలా పెద్దదిగానూ ఇంకా శక్తివంతంగానూ వుంటుందన్నమాట నిజం. ఈ ఆటంబాంబుచుట్టూ 'డ్యూటేరియం' వగైరా రూపాలలో వున్న ఏదో ఒకరకం బరువైన హైడ్రోజన్ (Heavy Hydrogen)తో—అనగా సంయోగ ప్రక్రియకు ఉపకరించగల యేదో పదార్థంతో ఆ ఆటంబాంబు చుట్టూ ఒక కవచాన్ని నిర్మించుతారు. ఈ కవచంలో సంయోగప్రక్రియ జరిగేటప్పుడు సహజముగా భూమిలో లభించే చవకపాటు యురేనియంలో తిరిగి సంఛేదన ప్రక్రియను రేకెత్తించ శక్తివంతములైన న్యూట్రానులు అనంతంగా ఉత్పత్తిఅవుతాయి గనుక ఈ హైడ్రోజన్ కవచంచుట్టూ తిరిగి యీ చవకపాటు యురేనియము ఒకపొర పూతపూస్తారు. ఇది మొత్తం ఇప్పుడు 'సంఛేద - సంయోగ - సంఛేద' ప్రక్రియా సంపన్నమైన అణ్వస్త్రంగా రూపొందింది. అమెరికా 1954 మార్చిలోనూ, రష్యా 1957 ఏప్రియల్‌లోనూ పేల్చి పరీక్షించినవి ఈరకం బాంబులే.

డాలర్‌కు ఒక టపాకాయ అన్నలెక్కను వీటిని చాలా చవకగా తయారుచేయవచ్చు. 'స్ట్రాన్షియం-90' అనే పిశాచపదార్థోత్పత్తి కారకములుగా ఇవి అత్యంత ప్రమాదకరమైనవి.

## అణుధూళి విసర్జన

ఈ అణ్వస్త్రాలు విసర్జించే ధూళి మూడు రకాలుగా జగత్తున వ్యాపించుతుంది.

1. ప్రేలుడు సంభవించగానే విసర్జితమయ్యే ధూళిలో కొంతభాగం ప్రేలుడువల్ల కల్పింపబడిన జ్వాలా గోళంలోకి లాగివేయబడుతుంది. ఈ ధూళి క్రింద పడటానికి కొన్నిరోజులు పడుతుంది. ఇది ప్రేలుడు జరిగినస్థానిక వలయంలో రాలే ధూళి. స్థానిక వలయమంటే 5000 మొదలు 10000 చదరపు మైళ్ళ వలయం అనుకోవచ్చు. జపాన్ జాలరులమీద పడ్డది ఇలాంటిధూళే.

(2) ప్రేలుడు జరిగినప్పుడు, వాయుగర్భంలో ఏర్పడే హఠాత్పీడనవల్ల కొంతధూళి గాలిలోకి సుదూరంగా విసరివేయబడి గాలిలో తేలుతూ వుంటుంది. ఇది ఏ ఎత్తున ప్రేలుడు జరిగిందో ఆయెత్తున ధూళిమబ్బుల మాలగా ఏర్పడి భూమిచుట్టూ అనేక పర్యాయములు ప్రదక్షిణాలు చేస్తూ వుండవచ్చు. ఈ రకం ధూళి దాని చిత్తం వచ్చినప్పుడు, వర్షం ద్వారానూ, మంచు ద్వారానూ భూమిమీదికి అవతరించుతుంది. నెవడాలో జరిగిన బాంబు పరీక్షల అనంతరం, తత్పరిసరమంతా వాయుగర్భంలో రేడియో ధార్మికశక్తి పెరిగినట్టు కనుపించటం ఈధూళి వల్లనే.

(3) ఇక మూడవరకం అణుధూళివుంది. ఇది ఇంతకంటే బ్రహ్మాండమైన మహామారణాయుధాలకు సంబంధించినది. ఈ ఆయుధాలు లక్షల టన్నుల ప్రేలుడుశక్తిని వెలార్చగల ఆయుధాలు. వీటిని

TNT ఆయుధాలంటారు. వీటిని పేల్చటం విసరటం ద్వారా కాక, యాంత్రిక సహాయంతో (Detonators) పేల్చుతారు. భయంకరమైన వీని ప్రేలుడు శక్తివల్ల, రేడియో ధార్మిక శక్తిగల ఈ అణుధూళి, మన వాతావరణపు అవధులను త్రోసిరాజని, భూభాగం మీద 20 మైళ్ళకు పైబడిన ఎత్తునవున్న విశ్వాంతరాళంలోకి (Stratosphere) విసరి వేయబడుతుంది. ఈధూళి ఆ అంతరాళంలో పదిపదిహేను ఏళ్ళవరకూ పరిక్రమించుతూ వుంటుంది. ఈలోగా పరిమిత జీవితం గల యితర రేడియో ధార్మికములు నశించుతాయి. స్ట్రాన్షియం-90, సేజియం (cesium) ఇవి మాత్రం మిగులుతాయి స్ట్రాన్షియం 90, యొక్క రేడియో ధార్మిక జీవితం అవధి 28 సంవత్సరాలు. సెజియంకు శల్యాన్వేషణ స్వభావం లేకపోయినా, ఇతర దుర్గుణాలలో స్ట్రాన్షియంతో తులదూగగలది. ఇవి విశ్వాంతరాళంలో వీచే ప్రభంజనాలలో కలసి, క్రమంగా భూమికి అవతరించి భూమిమీదకంటికి కనుపించని పొరగా ఏర్పడతాయి.

భూమిమీదికి అవతరించిన తరువాత, కాల్షియం గుణాలను పోలిన ఈ స్ట్రాన్షియం 90 కాల్షియం మాదిరిగా జీవజాలం మీద తన ప్రభావాన్ని చూపుతుంది. జీవజాలంయొక్క అభివృద్ధికి దోహదకారియైన కాల్షియం సజీవ పదార్థాలన్నిటిలోనూ విస్తృతావధిని కనుపించుతుంది. కాల్షియం ఉండే స్థానాలన్నిటిలోనూ ఇప్పుడు స్ట్రాన్షియం ఉనికికి ఆస్కారం యేర్పడుతుంది. భూమినుండి ఈ స్ట్రాన్షియంను గడ్డిమొక్కలు చెట్లూ గ్రహించుతాయి. మొక్కలనుంచీ నీళ్ళనుంచీ పసువులు గ్రహించుతాయి పసువులనుంచీ, మొక్కలనుంచీ, నీళ్లనుంచీ మానవ దేహాలు గ్రహించుతాయి. మనం సాధారణంగా పాలనుంచి ఎక్కువ కాల్షియంను గ్రహించుతాము.

మనం కాల్షియంగల ఆహారపానీయములను సేవించినప్పుడు, ఆ కాల్షియంతో కలసివున్న స్ట్రాన్షియం మన జీర్ణాశయం ద్వారా రక్తంలో ప్రవేశించుతుంది. రక్తవాహినులనుంచి దీల్లో కొంతభాగము మూత్రకోశము ద్వారా విసర్జింపబడుతుంది. మిగిలినది మన ఎముకలలో నిలువ చేయబడుతుంది.

అదృష్టవశాత్తూ జీవరాసులు కాల్షియంను సరఫరా చేసినంతగా స్ట్రాన్షియంను సరఫరా చేయవు. ఆవు తాను గ్రాసమునుంచి సేకరించిన స్ట్రాన్షియంలో 7 వ వంతు మాత్రమే సరఫరా చేస్తుంది. మానవదేహం తాను ఆహార పానీయముల ద్వారా సేకరించిన స్ట్రాన్షియంలో సగం భాగం మాత్రమే ఎముకలలో నిల్వవుంచుకుంటుంది. అయినప్పటికీ స్ట్రాన్షియం ఒకసారి ఎముకలలో ప్రవేశించిన తరువాత చుట్టూ వున్న సున్నితములైన కండరభాగాలన్నిటిలోకీ రేడియో ధార్మికశక్తిని ప్రసారం చేస్తూనే వుంటుంది.

స్ట్రాన్షియం సంచార విధానాన్ని మనం తెలుసుకున్నాం. గగనపథానికి బెలూను పంపించి తద్వారా అక్కడ దాని ఉనికిని మనం తెలుసుకోగలం. రసాయనిక ప్రక్రియలద్వారా మట్టినుంచి దాన్ని విడదీసి గమనించగలం. అట్లాగే, మనం త్రాగే పాలలోనూ, తినే మాంసంలోనూ, మానవశల్యాలలోనూ దాని ఉనికిని పసిగట్టగలం. దాని రేడియో ధార్మికశక్తి యెంతో మనకు తెలుసు; దాని రేడియో ధార్మిక జీవితం యెంతో మనకు తెలుసు. దాని కుటుంబానికి చెందిన యితర పదార్థాలమంచి చెడుగులన్నీ మనకి తెలుసు. ఇన్నీ మనకు తెలిసినా ఈ విజ్ఞానవేత్తలు వేస్తున్న ఎదురు సవాళ్లకు అర్థాంగా మాత్రమే మనం సమాధానం చెప్పగలుగుతున్నాం. రేడియో ధార్మికశక్తిని స్వీకరించటంలో "ప్రమాదరహిత ప్రమాణం ఎంత?", "మన ఎముకల్లో స్ట్రాన్షియం ఎంత కూడబెట్టబోతున్నాం?". అడుగుతున్నారు. అని ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే, రేడియో ధార్మిక చికిత్సావేత్తలయిన వైద్య శాస్త్రవేత్తల అనుభవం మనకు ఆధారం.

## జీవరాశిపై రేడియో ప్రసరణ ప్రభావం

ఒకవసువు రేడియోధార్మికశక్తికలది అని చెబుతున్నామంటే అదిఏదో రకమైన ప్రసరణను తనచుట్టూ వదులుతుందని అర్థం. స్ట్రాన్షియం-90 ఎలక్ట్రానును వదులుతుంది (బీటా రేణువు). ఇది మహత్తరమైన శక్తికలది. ఎందుచేతనంటే, ఏపదార్థంలోనుంచిగాని ప్రయాణం చేసేటప్పుడు ఇది అతిత్వరగా తనశక్తిని వెలార్చి హరించిపోతుంది. అనగా అంత త్వరితగతిని తనశక్తినంతా వినిమయానికి తెస్తుందన్న మాట. సజీవకండరంలో ప్రయాణం చేసేటప్పుడు ఇది అంగుళంలో ఎనిమిదవ వంతు ప్రయాణం చేసేలోపు హరించిపోతుంది. స్ట్రాన్షియం అణువుచుట్టూ, ఆ మేరలోవున్న

జీవకణాలకు ఈ విధ్వంసన పరిమితమౌతుంది. కాని 1/8 అంగుళం మేరలోనే ఎన్నో జీవకణాలుంటాయి. ఎలక్ట్రాన్, జీవకణంలోనుంచి ప్రసరించినప్పుడు ఆ జీవకణం నిర్మితమైవున్న పదార్థాలను ఢీకొంటుంది. ఈ దెబ్బతో ఆకణం గాయపడి తన సహజధర్మాన్ని నిర్వర్తించే శక్తిని కోల్పోతుంది. లేదా సాంతం చచ్చిపోతుంది. గాయపడిన ఇట్టి జీవకణాలు, వచ్చే తరాల సంతానంలో చాలాగుప్తమైన పరిణామాలకు కారణమౌతాయి. ఇలా దెబ్బతిన్నది సంతానోత్పత్తి బీజములైన కణములైతే ఇది ముమ్మాటికి నిజం. జననేంద్రియాలకు సంబంధించిన జీవకణకేంద్రంలో జననశక్తిగలప్రత్యేకపదార్థం వుంటుంది. దీనివల్లనే సంతానం యొక్క రూపగుణశక్తులు ఏర్పడతాయి. తల్లిచాలుపిల్ల తండ్రి చాలుపిల్ల అని అనటంమనకు విదితమే. ఈచాలు అనేది ఈ పదార్థంవల్లనే యేర్పడుతుంది.

జీవకణాలు ఒకొక్కటి రెండుగా విచ్చులుకుని అనంతసంఖ్యగా పెరుగుతూవుంటాయి. జననేంద్రియ కణాలలోవుండే జననశక్తిగలపదార్థం సన్నని దారాల వలె వుంటుంది. వీటిని 'క్రోమోజోము' లంటారు. సున్నితమైన వీటినిర్మాణం రేడియో ధార్మికశక్తివల్ల ఇట్టే దెబ్బతింటుంది. ఆ పోగులు తెగుతాయి. ఇలా తెగిన పోగులను తిరిగి బాగుచేసుకోవటానికి జీవకణానికి పరిమితమైన శక్తిమాత్రమే వుంటుంది. దెబ్బతిన్న లేదా విపర్యయంపొందిన క్రోమోజోములు గల ఈ కణం నుంచి ఉత్పత్తిఅయ్యే అన్నికణాలూ ఇదే రకం విపర్యయంపొందిన క్రోమోజోములను కలిగివుంటాయి. అనగా వాటి అనువంశికస్వభావానికే విపర్యయం వస్తోంది.

జననేంద్రియకణాలలో ఇట్టి విపర్యయం (Mutation) కలుగజేయటం ప్రమాదకరమని జనిశాస్త్రం చెబుతున్నది. ఇందువల్ల మృతశిశువులు కలగటం, కురూపులు మందబుద్ధులు కలగటం సాధ్యమంటున్నారు. ఈ రేడియో ధార్మికప్రమాదసమస్య జననేంద్రియాలకు దూరంగా ఎముకలలోవుండే స్ట్రాన్షియం ఒక్కదాని విషయమే కాదు. రేడియో ధార్మికశక్తి గల రేడియం, వైద్యచికిత్సకు ప్రయోగించుతున్న ఎక్స్-రే ఇలాంటివన్నీ అట్టివే.

జననేంద్రియాలకు సంబంధించని ఇతర జీవకణాలమీద దీని ప్రభావమేమిటి? సాంతం చనిపోకుండా దెబ్బతిన్న కణాలు ఏమవుతాయి. ఇవి సహజంగా జీవకణాలకువుండే శక్తిని కోల్పోయి కాన్సర్ (పుట్టవ్రణం) క్రింద తయారవుతాయి. స్ట్రాన్షియం-90 రేడియో ధార్మికప్రసరణవల్ల ఎముకలలో కాన్సర్ ఏర్పడుతుందని, జంతువులమీద జరిపిన ప్రయోగాల ద్వారా నిరూపించారు. ఎక్కువ పరిమాణంలో ప్రసరణ చేసినట్లయితే ఆ జంతువు అనతికాలంలోనే రుజాగ్రస్తమై చనిపోతుంది. మితపరిమాణంలో నిరంతరంగా ప్రసరణచేస్తే దాని బొమికలు ఛిద్రమైపోతాయి—ఇంకా కొంతకాలం అలానేచేస్తే ఎముకల కాన్సరు బయలుదేరి శరీరమంతా వ్యాపించుతుంది.

పెద్దవాళ్ళవిషయంలోకంటే, చిన్నపిల్లల విషయంలో మనం ఎక్కువ ఆందోళన చెందవలసిన అవసరం కనుపించుతున్నది. చిన్నపిల్లలలో త్వరితగతిని ఎముకలు పెంపొందవలసివుంది. అందుచేత స్ట్రాన్షియం-90 ని చిన్నపిల్లలు తమ తలిదండ్రులకంటే ఎక్కువగా సేకరించి ఎముకలలో నిలవచేసుకుంటారు. పెద్దవాళ్ళలోకూడా ఎప్పటికప్పుడు ఎముకలు కొన్నిభాగాలలో పరిణామం చెందుతూవుంటాయిగనుక ఆ భాగాలలో స్ట్రాన్షియంను నిలవచేస్తూనేవుంటారు.

మానవుడు ఈ స్ట్రాన్షియం-90 ప్రసరణకు గురి అవుతున్నది. ఈ మూడుసంవత్సరములనుంచే గనుక, స్ట్రాన్షియంవల్ల మానవునకు ఎముకల కాన్సర్ కలిగిన సంఘటన ఇంకా మన అనుభవానికి రాలేదు. కాని స్ట్రాన్షియం వలెనే కాల్షియంతో సమానధర్మములుగల రేడియం ఇట్టిది కలిగించటం మనకు తెలుసు. రేడియో ధార్మిక విషగుణాలచరిత్ర మనకు తెలిసింది బహుస్వల్పమే అయినా, రేడియో ధార్మికశాస్త్రవేత్తలు 'ప్రమాదరహిత పరిణామా'లని కొన్ని చెబుతున్నారు.

## ప్రమాదరహిత ప్రమాణాలు

రేడియోధార్మిక శక్తికి 'ప్రమాదరహిత ప్రమాణా'ను నిర్ణయించటమన్నది బహుజటిలమైన సమస్య. రేడియోధార్మికశక్తిగల పదార్థాలను జనానికి ఇంజక్షనుల ద్వారా ఎక్కించి దాని ఫలితాలను కనుగొనటం సాధ్యంకాదు. (కాని దురదృష్టవశాత్తూ, ప్రజల అనుమతితో నిమిత్తం లేకుండా ఈ ప్రయోగం ప్రపంచ ప్రజానీకం యావత్తు మీదా ఇప్పుడు జరుగుతోంది.) ఇక పోతే, 'అంతర్జాతీయ

రేడియోధార్మిక ప్రమాద పరిరక్షణ సంఘం (International Committee on Radiological Protection) నిర్ణయించిన 'ప్రమాదరహిత ప్రమాణం' మనకు విస్సన్న వేదం. ఈ సంఘంలో రేడియాలజీ చికిత్సకారులూ, రేడియోధార్మిక శాస్త్రవేత్తలూ వున్నారు. కాని వారి అనుభవం కేవలం వారివారి వృత్తుల నిర్వహణలలో తటస్థించిన సంఘటనలకు పరిమితమైనది మాత్రమే. చేతిగడియారాలకు అమర్చే రేడియం డయల్సు తయారుచేసే పరిశ్రమల అనుభవాలూ, వ్యాధిగ్రస్తులై రేడియం చికిత్స పొందటానికి డాక్టర్ల దగ్గిరకు వచ్చిన వారివల్ల కలిగిన అనుభవాలూ—వాటిని పురస్కరించుకుని జరిగిన నిర్ణయమది.

1920 ప్రాంతాలలో న్యూజర్సీలోని రేడియం డయల్సు తయారుచేసే కర్మాగారంలో రెండు మూడు వందలమంది స్త్రీలను పనికి యేర్పాటు చేశారు. పాపం వాళ్ళకేమీ తెలియదు. వారు రేడియం వున్న బ్రష్ కొనను సన్నబడ చేయటానికి పెదవులమధ్య నొక్కి లాగేవారు. వీరిలో కొంతమంది రేడియేషన్ వ్యాధిగ్రస్తులై ఒకటి రెండు సంవత్సరాలలో చనిపోయారు. మరికొంతమంది ఎముకల కాన్సర్ కలిగి పది సంవత్సరాలలో చచ్చారు. ఇదే తరుణంలో, ఇలినాయ్ ఎల్జిన్ ప్రభుత్వ హాస్పిటల్ లో చికిత్సకోసం రేడియం ఎక్కించిన పిచ్చివాళ్ళకు ఇదే దుర్గతి పట్టింది. ఈ రెండు పద్ధతులనూ ఇప్పుడు బహిష్కరించారు, ఈనిర్ణయం జేయుటానికి అనుసరించిన పద్ధతి చిత్రమైనది. ఎముకల కాన్సర్ కు గురి అయిన ఈ దురదృష్టవంతులను జాగ్రత్తగా పరిశీలన చేసి, వారిలో తన ఎముకలలో అతి స్వల్పప్రమాణం రేడియంగల వ్యాధిగ్రస్తుని తీసుకుని ఆ ఉజ్జాయింపుని, ఈ రక్షణసంఘం ఈ 'ప్రమాద రహితప్రమాణా'న్ని నిర్ణయించారు. రేడియోధార్మికశక్తిలో రేడియం 226 కూ, స్ట్రాన్షియం-90 కి గల తేడానుబట్టి—స్ట్రాన్షియం డోసు నిర్ణయించారు. ఈ ప్రమాణాన్నే అమెరికా 'ఎటామిక్ ఎనర్జీ కమిటీ' (AEC) సేకరించి తమ కార్మికుల పరిరక్షణలో అమలుజరుపుతున్నారు.

ఇటీవలదాకా ఈవిసన్న వేదాన్నే పరమ ప్రమాణంగా శిరసావహించుతూ వచ్చారు. కాని పైన చెప్పిన రేడియండయల్ స్త్రీ కార్మికుల వ్యాధి చరిత్రలను, రేడియం చికిత్సపొందిన పిచ్చివాళ్ల వ్యాధి చరిత్రలనూ జాగ్రత్తగా పరిశీలించారు. (ఈ రికార్డులు సమగ్రంగా లభించాయి.) వీరు మొత్తం 47 మంది వ్యాధిగ్రస్తులు. వీరిలో సగంమంది తమకున్న శారీరక బాధలను గురించి చెబుతూనే వచ్చారు. ఇవి నిజానికి వాళ్ళ ఎముకలలో రేడియం ఉన్నదని తెలుసుకోగల చిహ్నాలే. ఈ బాధల అవధి ఎముకలలో పోట్లదగ్గరనుంచి, ఎముకలు విరగటం, ఎముక కాన్సరు ఆరంభం కావటం దాకా వున్నాయి. ఇప్పుడు 'ప్రమాద రహిత ప్రమాణం' అని చెప్పబడుతున్న డోసుకు ఎనిమిదిరెట్ల డోసుతో ఇందులో ఒకడు ఎముక-కాన్సర్ కు గురి అయినాడు.

అంత స్వల్పసంఖ్య వ్యక్తులలోనే ఒక వ్యక్తి ఎముకల కాన్సర్ కు గురిఅయినాడంటే - అదీ 'ప్రమాదరహిత ప్రమాణా'నికి కేవలం ఎనిమిదిరెట్ల డోసుతో — ఈ 'ప్రమాదరహితప్రమాణం' లో భద్రత వున్నదనటానికి విలులేదు ఇది ఇలా వుండగా రేడియంయొక్క 'ప్రమాదరహిత ప్రమాణం' అంచనా వేసి తద్వారా స్ట్రాన్టియం డోసు నిర్ణయించారు. అందుచేత మొదటిదాన్ని అంచనావెయ్యటంలో ఎలాంటి అవకతవకవున్నా స్ట్రాన్టియం అంచనా అంతకంటే అధ్వాన్నంగా తయారు కావటానికి ఆస్కారమున్నది.

పై రక్షణసంఘం ఈ నిర్ణయంచేసింది ఆబాలగోపాలం జనబాహుళ్య మంతటికీ వర్తింపచెయ్యటానికి కాదు. వయోజనులు కొలదిమంది మాత్రం పనిచేసే పరిశ్రమలలోనూ హాస్పిటల్స్ లోనూ వర్తింపచేయటానికి మాత్రమే. ఇది విస్పష్టంగా ఆ సంఘం నొక్కి వక్కాణించింది. అలాంటిచోట కూడా వైద్యుల పర్యవేక్షణ వుండాలన్నది. ప్రమాద రక్షణకు పరికరాలు సిద్ధంగా వుండాలన్నది. అవసరమని తోచగానే రేడియోధార్మిక ప్రసరణ అవధులనుంచి జనాన్ని వెంటనే అవతలకు తరలించే ఏర్పాట్లుండాలన్నది.

ఈ విషయాలు పరిశీలించితే, హైడ్రోజన్ బాంబులనుంచి రాలుతున్న స్ట్రాన్టియంనుంచి రక్షణ వుండటానికి ఆస్కారమేమీలేదని మనకు స్పష్టంగా బోధపడుతుంది. ఈ స్ట్రాన్టియం విశ్వవ్యాప్తంగా వాతావరణాన్ని కల్మషం మొనరించుతున్నది. ఈ భూగోళంమీదనుంచి యీ జనాన్ని ఎక్కడికి తరలించగలం? బాలవృద్ధాది ఈ ప్రపంచ ప్రజానీకాని కంతకూ

సన్నిహితమైన వైద్యపర్యవేక్షణ కలుగజేయటం భగవంతుడికిమాత్రం సాధ్యమా?

ఈ విషయాలు ఆలోచించి ఆ సంఘంవారు జన బాహుళ్యంమీద లెక్కచూచినప్పుడు ఈ డోసును 10 వ వంతుకు తగ్గించి లెక్కచూడాలన్నారు. పర్యవేక్షణవున్న పరిశ్రమలకూ, హాస్పిటల్సుకూ నిర్ణయించిన ప్రమాణం 1.0 మైక్రోక్యూరి, అనగా జన బాహుళ్యానికి నిర్ణయించవలసిన ప్రమాణం 0.1 మైక్రోక్యూరీ అన్నమాట. (వేడియొక్క ప్రమాణాన్ని కాలరీలలోనూ, విద్యుచ్ఛక్తియొక్క ప్రమాణాన్ని వోల్టులలోనూ చెప్పినట్లే, రేడియో ధార్మికశక్తిని మైక్రోక్యూరీలలో చెబుతారు.)

ఈ విషయంలో ఎక్స్-రే మొదలైన వైద్యవృత్తుల క్రమానుభవమేమిటో మనం కొంత గమనించవలసి వుంది. సర్వావయవ ప్రసరణకు ఆస్కారమున్న రేడియాలజిస్టుల విషయంలో రక్షణసంఘం నిర్ణయించిన రక్షణప్రమాణాన్ని జీవశాస్త్రంలో రేడియంశాఖ పరిశోధనలు అభివృద్ధిచెంది క్రొత్తక్రొత్త విషయాలు బయటపడినకొద్దీ – క్రమేపీ తగ్గించి వేయవలసివచ్చింది. పూర్వం 1931 లో నిర్ణయించిన ప్రమాణాన్ని, 1.2 రెం. (రెంటన్‌జన్—వైద్య పరిభాషలో ఉపయోగించే రేడియో ధార్మిక కొలమానం.) నుంచి 0.6 రెం. కు తగ్గించారు 1936 లో, 1949 లో 0.3 రెం. కు తగ్గించారు. ఈ 0 3 కూడా ఇంకా సంస్కరణ జరుగవలసి వుంది. జననేంద్రియాలకు కలిగే ప్రమాదం దృష్ట్యా ఈ పరిమితిని 0.1 కు తగ్గించివేయాలని 1956 లో రక్షణ సంఘం సిఫారసు చేసింది.

తక్కువ ప్రమాణం ప్రసరణ కొంతకాలం వరుసగా సాగితే ఇలాంటి ప్రమాదమున్నదనే విజ్ఞానం మనకు తేలికగా దానంతటికది లభించలేదు. ఇందుకు ఆ వృత్తిలో వున్నవారు కొంతమంది అనుభవించవలసినంతా అనుభవించారు. రేడియోలజిస్టుల జీవితం సగటున 5.6 సంవత్సరాలవరకూ తగ్గుతుందని తేల్చారు. రక్తపాండువు (Leukemia) వచ్చే అవకాశాలు ఇతరులకంటే 5 రెట్లు అధికం అన్నారు. తరచుగా చేతులు తినిపోతాయి. చర్మసంబంధమైన కాన్సరుకు లోనౌతారు. 1955 లో జరిగిన పరిశోధన ఫలితంగా, జననేంద్రియాలకు కలిగే ప్రమాదాన్ని గురించిన ఆందోళన బయలుదేరింది. అమెరికా ఆరోగ్యశాఖలోని లారెన్సు, మాకెట్ అనే డాక్టర్లు ఈ పరిశోధన చేశారు. రేడియోలజిస్టులకు కలిగిన సంతానాన్ని, ఇతర డాక్టర్లకు కలిగిన సంతానాన్ని గురించి వివరాలు పోగుచేశారు. రేడియోలజిస్టుల సంతానంలో, యితర డాక్టర్ల సంతానంలోకంటె ఎక్కువమంది కురూపులు వున్నట్టు తేలింది. వారు తయారుచేసిన నివేదికలో యిలా అన్నారు:

"తక్కువ ప్రమాణంలో ఎక్కువ దినాలు రేడియో ప్రసరణకు గురికావటంవల్ల ఆవ్యక్తిలో గమనించదగిన మార్పులు రాకపోవచ్చు. కాని తత్సంతానంలో దీని కిరాతకం విస్పష్టమౌతుంది. ఈ సంతానంలో కనుపించే నష్టంకంటే రానున్న తరాలకు కలిగేనష్టం అపారమని మనం తెలుసుకోవలసి వుంటుంది."

పై అనుభవాలవల్లనూ, ఈ రంగంలో ప్రయోగాత్మకంగా లభించిన నిర్ణీతవిషయాలు బహు స్వల్పముగా ఉండటంచేతనూ, వీళ్ళు చెబుతున్న 'ప్రమాదరహిత ప్రమాణ' అవధుల దరిదాపులకు రాకుండా మన్ని మనం కాపాడుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

ఈ ప్రమాణాలనుగురించి ఆలోచించేటప్పుడు మరో విషయంకూడా మనం గమనించవలసి వుంది. సృష్టిలో సహజంగావున్న రేడియో ప్రసరణవల్లనే ఎముకల కాన్సర్. రక్తపాండువు రావటానికి ఆస్కారముందని అంగీకరించినప్పుడు ఈ 'ప్రమాదరహిత' ప్రమాణాలకు ఆస్కారంలేదు. రేడియో ధార్మికమైన రేణువు ఏ ఒక్కటి మన జీవకణాలలో నుంచి గమనంచేసినా అది, ఎముక కాన్సర్ కలిగే ప్రమాదాన్నీ, రక్తపాండువు కలిగే ప్రమాదాన్ని కొంత లోపలకు చేర్చిందనే గ్రహించాలి.

సృష్టిలో ప్రసారితమయ్యే నైసర్గికమైన రేడియో ధార్మికప్రసరణ అనేకవిధాలుగా వుంటుంది, విశ్వాంతరాళంలో కాస్మిక్ కిరణముల ప్రసరణ కొంత వుంటుంది. కొండలనుండీ. గుట్టలనుంచీ భూమినుంచి కొంతవుంటుంది, పరిసరంలో వున్న యితర పదార్థాల ప్రసరణ కొంతవుంటుంది. ఇవన్నీకాక మనదేహంలో నేవున్న, పొటాసియం, రేడియం ప్రసరణ కొంత వుంటుంది. ఈ శతాబ్దారంభంనుంచీ ఎక్స్-రే ప్రసరణ ఒకటి వైద్యాది కార్యాలకు ఉపయోగించుతున్నాం.

ఎముకల కాన్సరుకుగాని, రక్తపాండువుకుగాని చాలావరకో మొత్తంగానో, నైసర్గికమైన ఈ ప్రస

రణే కారణమైనట్లయితే, ఈ నైసర్గిక ప్రసరణను ఏ రేఖామాత్రం అదనంగా పెంచినా ఆ అవధికి అది జగత్తులో ఈ రెండు వ్యాధులనూ పెంచుతుంది.

కాలిఫోర్నియా సాంకేతిక విద్యాలయానికి చెందిన డాక్టర్ ఇ. బి. లూయిస్, తాము, నైసర్గిక రేడియో ధార్మిక ప్రసరణవల్ల కలిగే రక్తపాండువు విషయమై జరిపిన పరిశోధనల ఫలితాలను 'సైన్సు' పత్రికలో వివరించుచూ, "రక్తపాండువు కలగటానికి నూటికి 20 వంతులు ఈ నైసర్గిక ప్రసరణే కారణ" మన్నారు అమెరికాలో ఈ వ్యాధివల్ల యేటా చస్తున్న 10,500 మందిలో 2,100 మంది ఈ నైసర్గిక ప్రసరణవల్లనే చస్తున్నట్టు. బాంబుల ధూళివల్ల అదనంగా వచ్చే రేడియేషన్‌వల్ల ఈ నైసర్గిక ప్రసరణ నూటికి పదివంతుల చొప్పున పెరిగితే, యేటా మరో 200 మంది అదనంగా చచ్చిపోతారు.

ప్రపంచ జనాభాలో అమెరికా జనాభా 20వ వంతు మాత్రమే. ఈ లెక్కను ప్రపంచ జనాభాకు కలిగే అపాయం లెక్కజూస్తే, యిదివరకు నైసర్గిక ప్రసరణవల్ల చనిపోతున్న జనంకంటే, ఇప్పుడు ఏటా మరో 4,000 అదనంగా చస్తారని తేలుతుంది.

## ప్రస్తుత ప్రమాణాలు

"మన ఎముకలలో ఎంత నిలువ చేయబోతున్నాము?"- అన్నది వెంటనే జవాబు చెప్పటానికి వీలులేని జటిలమైన సమస్య. పోస్ట్‌మోర్టమ్‌కు వచ్చిన శిశువుల కళేబరాలనుంచీ, వయోజనుల కళేబరాలనుంచీ యెముకలనుతీసి వాటిని కాల్చి బూడిదచేసి ఆ బూడిదలోవుండే రేడియోధార్మిక శక్తిని కనుగొని అందు వున్న స్ట్రాన్షియంను అంచనా వేయాలి. ఈ ప్రయోగానికి రెండు బాధలువున్నాయి. ఇలాంటి కళేబరాలు మనకు ఎక్కువ లభించవు. పరిమితసంఖ్య మానవదేహాలను పరీక్ష చేసినవారమవుతాము. ఇట్టి అంచనాలు సమగ్రమైన అంచనాలనటానికి వీల్లేదు. అలా అంగీకరించినా ఈ లెక్కలు మన ఎముకలలో ఇప్పుడు వున్న స్ట్రాన్షియం ప్రమాణాన్నే తెలుపుతవి. మనము, మనకంటే ముఖ్యంగా చిన్నపిల్లలు, 1970, 1980 సంవత్సరాలు వచ్చేటప్పటికి—అనగా విశ్వాంతరంలో ఇప్పుడు ఈ బాంబులవల్ల యేర్పడిన స్ట్రాన్షియం – 90 క్రిందికి దిగిన అనంతరం—బొమికలలో ఎంత స్ట్రాన్షియంనుకూడబెడతామన్నది తేలవలసివుంది.

మనం అనేకవిధాల ఈ లెక్కలు తయారుచేయవచ్చు. అవన్నీ కచ్చితమైన వనటానికి వీలులేదు. కొలంబియా విశ్వవిద్యాలయంలోని డాక్టర్లు కల్ప్, ఎకెల్ మాన్, మ్యాకల్బ్ అనేవారు కొన్నిలెక్కలు ప్రకటించారు. వీరు 62రు పిల్లలను పరీక్షించి, సగటున వారి ఎముకలలోవున్న స్ట్రాన్షియం ప్రమాణాన్ని లెక్కగట్టారు. వారు సేకరించిన లెక్కలనుబట్టి మరొకటి తేల్చారు 'పదిమంది పిల్లలలో 4 గురు పిల్లలు ఈ సరాసరి ప్రమాణానికి పదిరెట్ల స్ట్రాన్షియంను కలిగి వున్నారన్నారు.'

ఈస్ట్రాన్షియం నిలవ సర్వదేహాలలోనూ, సర్వత్రా ఒకేమాదిరిగా వుండదు. ఒకదేహానికీ ఒకదేహానికీ చాలా తేడాలుంటాయి, పైపెచ్చు, ఆజీవినివసించేపరిసరాలను బట్టి, అక్కడ భూమిలోనూ వాతావరణంలో వ్యాపించివున్న స్ట్రాన్షియం ప్రమాణాన్నిబట్టి కూడా మార్పువుంటుంది. ఉదాహరణకు భూమిలో కాల్షియం తక్కువగా వుండే వేల్సు ప్రాంతంలో గొర్రెలను పరీక్షించితే ఆ గొర్రెలలో మామూలుగా యితర ప్రాంతాలలో వుండే గొర్రెలలో కంటె అయిదు, పది రెట్లు ఎక్కువ స్ట్రాన్షియం కనుపించింది.

ఈ విషయాలన్నీ ముందు వుంచుకుని ఆలోచించితే ఈ బాంబుల పరీక్షలవల్ల యెంతప్రమాదమున్నదో మనం తేలికగా గ్రహించవచ్చు. ప్రస్తుతమున్న ప్రమాణంలో గత 60 సంవత్సరాలుగా కృత్రిమంగా నిర్మించుకున్న ఎక్స్-రే మొదలైన రేడియో ధార్మిక ప్రభావాలకు గురియైవున్నాము. ఈ అణుధూళి ప్రమాదానికి మూడు నాలుగు సంవత్సరాలుగా గురి అవుతున్నాం. సృష్టిపరిణామంలో మానవుడు తన కిప్పుడు వున్న నిర్దుష్టమైన జననేంద్రియజీవకణ నిర్మాణాన్ని రూపొందించుకోవటానికి, లక్షలాది సంవత్సరాలూ యుగాలూ పట్టింది. ఇది మహత్తరమైన నిర్మాణం. జననేంద్రియ జీవకణాలను పరిశీలించితే ఈ అద్భుత నిర్మాణం చూచి విభ్రాంతి కలుగుతుంది. ఇలాంటి నిర్మాణాన్ని చేచేతులా ధ్వంసం చేసుకోవటానికి పూనుకోవటం ఎంత అవివేకం!! ఎలాంటి ఆటవిక మృగలక్షణం? దీనికి తోడు ప్రపంచంలో, కాన్సర్, రక్తపాండువు మొదలైన భీభత్స వ్యాధులను పెంచుతున్నారు. ఇదంతా యుద్ధానికి పనికి వచ్చే తీవ్రతరాయుధాలను తయారు చేయటానికంటున్నారు. ఎంత అజ్ఞానం!!!

సృష్టి క్రమంలోని లక్షలాది సంవత్సరాల పరిణామంగా మానవ పరంపరనుంచి సంక్రమించిన అమూల్య జననేంద్రియ జీవకణ నిర్మాణాన్ని నిర్దుష్ట స్థితిలో వచ్చే తరం సంతానానికి అందజేయటానికి మించిన విజ్ఞానం లోకంలో మరొకటేదీ లేదు.

అయినా, యిది ఇప్పుడు సైంటిస్టులూ, రాజకీయవేత్తలూ కూర్చుని కబుర్లు చెప్పవలసిన సమస్యగాదు. ప్రపంచ జనబాహుళ్యం ఎదుర్కోవలసిన సమస్య, అలాంటి ప్రజానిర్ణయం వెంటనే జరుగవలసిన తరుణమాసన్నమైంది.

* న్యూలీడర్ పత్రిక సౌజన్యంతో

# నిద్రాళువు

## శ్రీ పురాణం సూర్యప్రకాశరావు

* గత సంచిక తరువాయి

### 7

ఇంకా పూర్తిగా శీతాకాలం వెనకబట్టకుండానే ఎండలు ముదరనారంభించాయి. రాత్రి చలి ఎముకలు కొరికేస్తున్నా పగలు ఎండలు నిలిచి మండుతున్నాయి. గాలికూడా రానురాను వెచ్చబడసాగింది.

ప్రకృతిలో ఈ విపరీతానికి కారణం వీరభద్రం గారు ఇవాళ సాయంత్రం ఆరు గంటలకే ఇంటికి రావటం. ఆయన ఒక చంకలో పెద్ద పొట్లం, రెండో చంకలో పెద్ద సంచీ, రెండు చేతుల్లోనూ రబ్బరు బెలూన్లు, గాలిపటాలు, ఇత్యాది చిల్లర ఆటవస్తువులతో రథంలాగ ఇంట్లో ప్రవేశించగానే చంద్రుడు ముందు ఆయన కాళ్ళావేళ్ళాపడి ఆయన్ని అడుగు ముందుకు వెయ్యనియ్యలేదు. అనూరాధ గదిలోనుంచి ఇవతలికి వచ్చింది. నారాయణి చేతిలో గరిటతోసహా గుమ్మంలోనే నిలబడిపోయింది. భర్త ఇవాళ ఇంత పెందరాళే ఇంటికి రావటం అన్నది ఆమెకి వంటినిండా నగలు తొడుక్కున్నంత సంబరంగా వుంది. ఆ సంతృప్తి ముఖంమీద వ్యక్తం అవుతూనే వుంది.

ఆయన చంద్రుణ్ణి చాపమీద కూర్చోబెట్టుకుని తెచ్చిన వస్తువులన్నీ ఒక్కటొక్కటే వాడి చేతిలో పెడుతూ వాడిని ఆడిస్తూ తన్మయులైపోయారు. "అనూ! నీకు మంచి చీరా, రవికలగుడ్డా తెచ్చాను చూడు. చంద్రుడికి మంచిలాగూ చొక్కా తెచ్చాను" అన్నారాయన.

"మరి నాకేమిటే పట్టుకురాలేదేమిటి?" అంది నారాయణి ముడికట్టుకున్నందువల్ల దగ్గరికి రాకుండా దూరంగా నిలబడే.

"నీకూ నాకూ ఇంకా సరదాలేమిటి. పెద్దవాళ్ళమయిపోతున్నాం."

"అవునులెండి. మీ మాటెల్లాగున్నా నేను ముసలమ్మనైపోతున్నాను.'

"ఉత్తినే అన్నారే. నీకూ తెచ్చారు" అంది అనూరాధ రెండు చీరలూ విడివిడిగా చాపమీద పరుస్తూను.

చంద్రుడు వాడి చొక్కా లాగూ తీసుకుని గది లోకి పరుగెత్తాడు.

"నలభైరూపాయిలయాయి. మా స్నేహితుడు కొంటుంటే నేనూ కొనేశాను. ఏం? బాగున్నాయా బట్టలు?"

నారాయణి మనసులోనే కాస్త బాధపడింది. నిన్ననే పెళ్ళిచూపులకంటూ అమ్మాయికి చీర తెచ్చారు. మళ్ళీ ఇవాళ ఎందుకు తీసుకొచ్చినట్టు? అని మనసులోనే అనుకుంది. వీరభద్రం గారు ప్రతి నెలా ఇలా ఏదో ఒకవిధంగా ఖర్చుచేస్తూనే వుంటారు.

"అమ్మాయికీ, అబ్బాయికీ తెచ్చారు. చాలదూ? నాకుకూడా దేనికి?" అంది నారాయణి.

"అదేమిటే అలాగంటావు. ఇప్పుడేగా 'నాకు తెచ్చారా?' అని అడిగావు. ఇప్పుడలాగంటావేం?"

"ఊరికే అన్నాను. నాకు బోలెడన్ని చీరలున్నాయి. రోజుకో చీరచొప్పున కట్టినా తరిగేట్టు లేవు" అంటూ ఆమె లోపల వంటపని చూసుకుందుకు వెళ్ళిపోయింది. ఇంతవరకూ ఆమె మనసులో అడగాలనుకుంటున్న విషయం అడగలేకపోయింది. ఆయనంతట ఆయన ఎత్తరు. తను అడుగుతే విసుక్కుంటారేమోనని భయం. చివరికామె ధైర్యంచేసి ఇవతలికి వచ్చి "అలా వెళ్ళి కనుక్కొచ్చారా?" అంది.

ఆయన ముఖం పైకెత్తి 'అలా అంటే ఎలా? ఎక్కడికి?' అన్నారు.

"అదేనండీ. నిన్న పిల్లని చూట్టానికి వచ్చినవాళ్ళ దగ్గరికి."

"వెళ్లి లేదు."

"ఇప్పుడేం మారు వెళ్లి రారాదూ."

ఆయన చేతిలో రబ్బరుబంతి చిరాగ్గా లోకి నడిచారు.

నారాయణి నిట్టూరుస్తూ లోపలికి వెళ్లిపోయింది. అనూరాధ తలవంచుకునే ఎన్నడూ ఊహించనివిధంగా ఈ ఇంట్లో తనొక సమస్యగా పరిణమించటం అన్నది గ్రహించి ఆ ఆలోచనలతో తల పాడుచేసుకుంటూంది.

తిరిగి ఆయన వచ్చేలోపున నారాయణి లక్షుమార్లు పూజావిగ్రహానికి మొక్కింది. కాని దేముడు ఆమెకు అనుకూలించలేదు. ఆయన తీసుకువచ్చినవార్త ఆమెను చాలా కృంగదీసింది. కాని అనూరాధ మనసు తెరిపిన పడినట్టుగా తేలికపడింది.

"వాళ్లకి పిల్ల నచ్చలేదుట" అన్నారాయన.

నారాయణి ఆ కోపాన్నంతా అనూరాధమీద వెళ్లగక్కింది. "నేననుకుంటూనే వున్నాను. వాళ్ళు అడిగిందానికి నోరు మెదిపి సమాధానం చెబితేనా? పిల్ల నచ్చలేదని వారన్నారంటే స్వభావం గురించి వాళ్లు అపోహపడ్డారు. అంతే జరిగింది. అయినా పెద్దవాళ్లు చెప్పటం చిన్నవాళ్లు వినటం, అన్నది మా కాలంలో ఎరుగుదుంగాని ఈ పెంకితనాలు ఎరగం. వెనకనించి ఎంతచెప్పినా ససేమీ వినుగాక వినవంటే ఇంకేం చేసేది? నిక్షేపంలాంటి సంబంధం చేసేతులా పాడు చేసుకున్నాం. అయినా అమ్మాయ్ నువ్విలాగుంటే నీజన్మలో నీకు పెళ్ళికాదు. నే చెబుతున్నా ఏమనుకున్నావో. నీకు రూపం తక్కువనా వాళ్ళునచ్చిదంట. లక్ష్మిలాంటి పిల్లవు రూపంలో వంక పెట్టగలరా? నీ పెంకితనం చూసి వాళ్ళు వదులుకున్నారు." అని నారాయణి విసురుగా అక్కడ్నించి కదిలి పెరటిలోకి వెళ్ళిపోయింది.

అనూరాధ మనసు చిన్నబుచ్చుకుని వీధి వరండాలోకి నడిచి అక్కడ కూర్చుని పార్వతమ్మ ఒకప్పుడు అన్నమాటలను స్ఫురణకు తెచ్చుకుని వాటిని తనకి అన్వయించుకుంటూ, ఆమెస్మృతి రేకెత్తించిన దిగులుతో మనసంతా నీరుచేసుకుంది.

చీకటి అలుముకుంటోంది. "అలా కూర్చోక పోతే కాస్త దీపం వెలిగించకూడదూ. అదికూడా ఒకళ్ళు చెప్పాలన్నమాట" అంది నారాయణి.

అనూరాధ లేచి ఆపనిలో నిమగ్నురాలైంది. వీరభద్రంగారు గదిలోంచి "దీపం ఇంకా వెలిగించలేదూ?" అంటూ కేకేసారు.

అనూరాధ చేతిలో దీపంతో లోపలకి ప్రవేశించగానే "పోనీలేవే అమ్మాయ్! దీని తలదన్నిన సంబంధం తీసుకొస్తాను. ఇది పోతేపోయిందిలే." అన్నారాయన ఓదారుస్తున్నట్టుగా.

"లేకపోతే నాకిదే దిగులనుకున్నారేవిఁటి?" అంది అనూరాధ.

"అవును నీ కెందుకుంటుందే దిగులు, పడేవాళ్ళం మాకుంటుంది బాధ!" అంటూ నారాయణి అరిచింది గదిలోనుంచి.

"నువ్వూరుకో అమ్మా. నన్నేం చెయ్యమంటావు. వాళ్ళు పిల్ల నచ్చలేదంటే మధ్యని నన్ను తిడతావు దేనికి? నేనొకత్తెను తేరగా దొరికాను నీకు" అని అనూరాధ సమాధానం ఇచ్చింది. అనూరాధ మాట పూర్తి కాగానే వీరభద్రంగారు కూతురు తరఫున వకాల్తా పుచ్చుకుని "అవునే దాన్ని పట్టుకుని సతాయిస్తావు దేనికి. నీకేమైనా మతిపోయిందేవిఁటి? వాళ్ళకి పొగరెక్కి నోటికేదితోస్తే అది వాగుతే అది పుచ్చుకుని దానిమీద ఎగురుతావేవిటి? ఇంక వూరుకో. ఆకలేస్తోంది. ముందు వంట ప్రయత్నం చూడు. ఆ తర్వాత నీ తెలివి చూపిద్దువుగాని" అని కూతురు ముఖంలోకి చూసి "చాలా! ఇంకా కేక లెట్టమంటావా?" అన్నట్టుగా సాభిప్రాయంగా చూసారు.

నారాయణి గొంతు ఇక వినిపించలేదు. భర్త జోక్యంతో ఆమె పూర్తిగా చల్లారి పోయింది.

ఇవాళ ఒకళ్ళిద్దరు ఆడవాళ్ళు వచ్చారుగాని నారాయణి భర్త ఇంట్లోనే వున్నాడని తెలవగానే వాళ్ళు వెళ్ళిపోయారు. ఆ వచ్చినవారిలో ఒకామె అనూరాధకి తగిన వరుడంటూ ఒక సంబంధం గురించి చెప్పింది. వాళ్ళకి ఏవో సంబంధాలు వస్తున్నాయిట. త్వరపడకపోతే చెయ్యిజారిపోతుందంటూ ఆమె పదే పదే హెచ్చరించింది. నారాయణి ఆ సంబంధం గురించి ఆమె చెప్పిన వివరాలన్నీ శ్రద్ధగా విని మనసులో పెట్టుకుని భోజనందగ్గర భర్తతో చెప్పింది.

ఆయన "అలాగే చూద్దాం. మీ అన్నయ్యను రమ్మనమని రాయి" అన్నారు.

"వాడెందుకు?"

"కాస్త వాళ్ళని తీసుకురావటానికి దానికీ..."

"తపవతిపవకీ వాడెలా వస్తాడండీ. మనమే చూసకోవాలిగాని. ఓమారు తీరిక చేసుకుని వెళ్ళిరండి. ఈవూరేగా. రేపు వెళ్ళండి."

"సరే చూద్దాంలే"

మర్నాడు వాళ్ళు పిల్లని చూట్టానికి వచ్చారు. పిల్ల నచ్చిందనే అభిప్రాయం వాళ్లు వ్యక్తంచేసారు. అయితే కట్న కానుకల విషయం వచ్చేసరికి నారాయణి గుండెలు అవిసిపోయాయి. వీరభద్రంగారి ముఖం వెల వెలబోతూ భార్యవైపు తిరిగింది. ఆమె ధైర్యంచేసి ముందుకువచ్చి "అదే ఆఖరి మాటంటారా? మా మాట కాస్త వినేదిలేదా?" అంది ప్రాధేయపూర్వకంగా.

"అయిదు వేలకి తక్కువయితే వప్పుకునేది లేదండీ" అని ఖచ్చితంగా చెప్పేశాడు పిల్లవాడి తండ్రి.

నారాయణి మరోమార్గం చెప్పిచూసింది. "మూడు వేలవరకూ మేం భరించగలం. తతిమ్మా లాంఛనాలన్నీ జరుపుతాం. ఇక అంతకుమించి తూగటం మా అంతస్తుకు మించినపని. మీరు కాస్త దయదలచి..." భార్య ఇలా దీనంగా వేడుకోవటం వీరభద్రంగారికి మహా చిన్నతనంగావుంది. అనూరాధ ఏకంగా కన్నీరే కార్చింది.

"మా అంతస్థుకి మేము చాలా తగ్గించే చెప్పాం. పిల్లవాడుకూడా తక్కువేమీ చదవలేదు. బి. ఏ. చది వాడు. అపాటి కట్నం ఇవ్వటం అన్నది ఆలోచించ వలసిన విషయంకాదు" అన్నాడాయన.

నారాయణి నిస్పృహగా "ఇక అంతే నంటారా?" అంది.

ఆయన చిరాకు వ్యక్తంఅయే స్వరంతో "పదిమాట లెందుకు. అంతకు దమ్మిడీ తగ్గేది లేదు. ఇక పైగా పట్టు తాపితాలు, వెండికంచం, చెంబూ, ఆడబడుచు లాంఛ నాలూ ఇత్యాది చిల్లర లాంఛనాలన్నీ మీరు వేరుగా జరపాల్సిందే. ఏమంటారు? మేం మళ్లీ వెళ్ళిపోవాలి" అన్నారు అదే ఆఖరి మాటగా.

నారాయణి "మా పరిస్థితి కాస్త అర్థంచేసుకుని..."

"అయితేపదండి. ఇక ఇది తేలేవ్యవహారంకాదు వస్తాం" అంటూ ఆ పెళ్ళివారు వెళ్ళిపోయారు.

నారాయణి హతాశురాలై అనూరాధని హృద యానికి హత్తుకొని తలుపువార కూర్చుండిపోయింది.

## 8

తరుచుగా అనూరాధ మనోరమ ఇంటికి వెళ్లటం, సరదాగా కాసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పు కోవటంతో తన అమ్మమ్మ లేనిలోటు భర్తీచేసుకో గలిగింది. ప్రపంచంలో నిత్యం జరిగే అనేక వింత వింత విషయాల నెన్నిటినో మనోరమ అనూరాధ చెవిని వేస్తూంటుంది. ఆ విచిత్రాల గురించి తను వ్యాఖ్యానిస్తూంటుంది కూడాను.

కాని ఈ పరిచయం ఇలా వృద్ధి కాకుండా అర్థాంతరంగా తెగిపోయే విషమ పరిస్థితులు వచ్చి పడ్డాయి. నారాయణిచెవిలో లేనిపోని అభూత కల్పనలు ఎవరు వూదారో తెలియదు కాని అనూరాధ ఆ మాటలు విని సహించలేకపోయింది. వచ్చిన అమ్మ లక్కలలో ఒకామె అడిగిన ప్రశ్నకు నారాయణి ముఖముంతా చెండుకుని గొంతుచించుకుని "కట్టుకున్న వాణ్ణి వదిలిపెట్టి దేశాలమీదపడి చదువులు వెలగబెట్టే వారి యింట్లో నా పిల్లను చస్తే పడెయ్యను. అంత ప్రాలబ్ధం మాకేమీ పట్టలేదు. అయినా రోజూ పిల్లని ఇంటికి రమ్మనటంలోవుద్దేశం ఇదన్నమాట! నా ముఖం మండ! అంత దూరం నేను ఆలోచించనే లేదు. మనుష్యుల్లో ఇంత కుచ్చితాలు వుంటాయని నేననుకో లేదు. అవునులే కట్టుకున్నవాణ్ణి కన్నవాణ్ణి వదులుకుని హాయిగా తిరిగే ఆడదానికి అపాటి కులింత్రాలు తెలియవూ? డబ్బు లేకపోయినా మటుకు, మర్యాదా వున్న వంశంలోగాని నా కూతుర్ని అడుగు పెట నివ్వను, దానికేం లక్ష్మిలాంటి పిల్ల. దీని సాహసం మండ! ఎంత బరితెగించింది" అంటూ నారాయణి నోరు ఒక హద్దూ పద్దూ లేకుండా సాగిపోయింది.

అనూరాధ రెండు చెవులూ మూసుకుని ఆ మాటలు వినబడనంత దూరం పెరటిలోకి వెళ్ళిపోయింది. నిష్కారణంగా ఒకవ్యక్తి గురించి ఇలాంటి అభియోగం తేవటం ఆమె సహించలేకపోయింది. తను మనోరమ ఇంటికి వెళ్ళటంలో ఎలాంటి వుద్దేశాలు ఎవరికీ లేవు. కానీ ఇప్పుడీతల్లి అన్నమాటలు

మనోరమకు తెలుస్తే ఎంత బాధపడుతుందో! ఆమెకీవిషయాలు తప్పకుండా తెలుస్తాయి. ఇక ఆమె ముఖం తనెలా చూడగలదు? ఇంతటి నింద భరించి మనోరమ తన్ని క్షమిస్తుందా?

వాళ్ళంతా వెళ్ళిపోయింతర్వాత నారాయణి "అనూరాధా" అని పిలిచింది కఠినంగా. అనూరాధ భయపడుతూనే ఆమె ముందుకు వచ్చి నిలబడింది.

"రేపట్నించి అక్కడికి వెళ్లటం మానెయ్యి"

"ఎందుకని?"

"అది నీకనవసరం. నేను మానమంటున్నాను. మానెయ్యి"

అనూరాధ పరుషంగా "అదే ఎందుకు మానాలి? అంటున్నాను" అంది.

"ఎందుకో నే చెప్పాలన్నమాట. నీకు తెలియదా?"

"తెలియదు."

"ఆ టక్కులాడి మనోరమ ఆవిడగారి తమ్ముణ్ణి ఈ ఇంటి అల్లుణ్ణి చెయ్యాలని చూస్తోంది."

"అదంతా అబద్ధం. ఎవరో గిట్టనివాళ్లు లేనిపోనివన్నీ నీ చెవిని వేసారు. మనోరమకి అలాంటి వుద్దేశాలు వుండవు. ఆమె అలాంటి మనిషి కాదు."

"కాదు పాపం! నక్క పుట్టి నాలుగు వారాలు కాలేదుగాని నా జన్మలో ఇంత గాలివాన ఎరగనందట. అలాగుంది నీ మాట. ప్రపంచమంటే నీకేం అనుభవం వుంది? పరువూ మర్యాదా వున్నవాళ్ళెవరూ ఆ అబ్బాయికి పిల్లనిస్తారని నేననుకోను. రెండు వందలు కాదు మూడు వేలు జీతం తెచ్చుకోనీ ఒక గుట్టులేని ఆడదాని తమ్ముడనే అపవాదు అతడు జన్మలో మాపుకోలేడు. అంతవరకూ నే చెప్పగలను."

"అసలు ఏమీలేనిదే కేవలం గాలి మాటలు పట్టుకుని ఇంత రాద్ధాంతం చెయ్యటం బాగులేదమ్మా. వాళ్ళు అలాంటివాళ్ళు కారు."

"వాళ్ళెలాంటివాళ్లో నీకంటె నాకు బాగా తెలుసు. నువ్వు నోరు మూసుకుని చెప్పినట్టు విను."

ఇలాంటి తల్లితో వాదించటం తన నీడతో తను కుస్తీ పట్టటంలాంటిదని అనూరాధ ఇక వాదన పెంచకుండా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత నారాయణి ఏదో సణుగుతూనే వుంది చాలాసేపు. ఆమె కొన్ని ముఖ్య విషయాల్లో ఎంత స్తబ్ధగా, నిర్లిప్తతగా వుంటుందో, కేవలం అర్థం లేని చిల్లర విషయాలపట్ల అంతటి తీవ్రవైఖరి అవలంబిస్తుంది.

సరిగ్గా ఈ సంఘటన జరిగిన వారంరోజులకి దేవాలయం దగ్గర అనూరాధకి మనోరమ తారసపడటం జరిగింది. ఆమె ఎదటపడగానే అనూరాధ నిలువంతా జలదరించినట్టయింది. గుండె గతుక్కుమంది. తలయెత్తి పలకరించటానికి ముఖం చెల్లలేదు.

మనోరమ ఆమె భుజంమీద చేతులు వేసి "మా యింటికి రావటం పూర్తిగా మానేసావేందుకని?" అని పలకరించింది.

ఏమని సమాధానం చెప్పాలో అనూరాధకి పాలుపోలేదు. తలవంచుకునే ఆమె బొటనవ్రేలితో నేలమీద గీతలు వేస్తూ "నీకు తెలియదా మనోరమా?" అంది.

"అదంతా విన్నాను. కాని అందుకని నువ్వు నన్ను అపార్థం చేసుకున్నావా" అంది మనోరమ.

"లేదు. లేదు. నిన్నెప్పుడూ అపార్థం చేసుకోను. నీ సంగతి నాకు బాగా తెలుసు. నాకే ముఖం చెల్లక..."

నువ్వు చేసిందేముంది? పెద్దవాళ్ళు ఏవో తొందరపడితే దానికోసం నేనదే మనసులో పెట్టుకున్నాననుకున్నావా? ఇలాంటి అభియోగాలను ఎన్నిటిని భరించి ఇలా తిరుగుతున్నానో నీకు తెలియదు. అవన్నీ ఇలా విని అలా వదిలేస్తూంటాను. అందుకోసం నువ్వు మా యింటికి రావటం మానొద్దు."

"వద్దు మనోరమా. ఇలాగే వుందాం. మళ్ళీ నేను నీదగ్గరకు వస్తున్నానని తెలిస్తే ఇంకా గొడవలు పెరుగుతాయి."

"మన మనసులు నిర్మలంగా ఉండాలిగాని ఇలాంటివి మన్నేమీ చెయ్యలేవు. వస్తాను. తమ్ముడికి రెండురోజుల నించీ వంట్లో బాగుండటంలేదు. ఒక్కడూ వుంటాడు."

"ఎందుకని?" అని అడగకుండా వుండలేకపోయింది అనూరాధ.

"జ్వరం వస్తోంది. ఇవాళ కాస్తతగ్గింది."

"నా మనసుకూడా ఏమీ తేరిపిగాలేదు మనోరమా. పుట్టి బుద్ధెరిగింతర్వాత ఇలాంటి అనుభవాలని ఎదుర్కోవటం ఇదే మొదలు. మనసంతా గుబులు గుబులుగా వుంటోంది. అంతా గజిబిజిగా వుంది" అంది అనూరాధ దృష్టి నేలమీదకు మళ్లించి.

"అవును. విన్నాను. కట్నాలదగ్గర పేచీవచ్చి వాళ్ళు వదులుకున్నారటగా. మరోసంబంధం ఏదైనా చూస్తున్నారా?"

"ఏదో చూస్తున్నారు. కాని ఎక్కడా కలిసి రావటం లేదు."

"అదే కుదురుతుంది. నువ్వు మటుకు మనసు పాడుచేసుకోకు."

"వచ్చిన ప్రతివాళ్ళ ముందూ వెళ్ళి కూచుని వాళ్లు వేసే ప్రశ్నలకి సమాధానాలు చెప్పేటప్పటికి నాకు ఏడుపువచ్చినంత పనవుతోంది. అదంతా చాలా అవమానకరంగా కూడా వుంది. నాకు వచ్చేఅభిమానం వేస్తోంది."

"ఆడవాళ్ళు జీవితంలో ఎన్నో అవమానాలనూ, అనాదరణలనూ అగౌరవాన్ని తట్టుకోవాల్సి వుంటుంది. అందుకు ఇప్పట్నుంచీ శిక్షణ అవసరం. అందుకని మన సమాజం ఇలాంటి ఆచారాలని నిలబెట్టు కొంటోంది."

"అయితే దీనికి విరుగుడు లేదంటావా?"

"ఏమీలేదు. గప్ చిప్ గా పడివుండటం. లేదంటే ఫలితం నీకు తెలుసు. మా అమ్మ నన్నుగురించి అన్న మాటలు నువ్వు విన్నావుగా. అంతే అవుతుంది."

ఈ మనోరమ మాటల్లో అమ్మమ్మ హృదయం ధ్వనిస్తుంది. ఒకప్పుడు అమ్మమ్మ అన్న మాటలు అనూరాధకు స్ఫురణకు వచ్చాయి. తన స్నేహితురాలి పెళ్ళిప్రస్తావన వచ్చినప్పుడు "ముగవాడంటూ ఒకడు తన మెళ్ళో పుస్తెకడితేచాలు" అనే స్థితికి తాను వచ్చానని అమ్మమ్మ అంది. ఆమాటల్ని తనతో అన్వయించుకుని తన పరిస్థితి అందుకు ఏవిధంగానూ భిన్నంగా లేదు అని అనుకుంది అనూరాధ...

మనోరమ ఆప్యాయంగా ఓమారు అనూరాధ శిరస్సు తడిమి వెళ్ళిపోయింతర్వాత గుడిమండపంలో కూచుని అనూరాధ తల్లి రాకకు ఎదురు చూడసాగింది. బాగా చీకటిపడింతర్వాత చేతిలో కొబ్బరికాయలు, పసుపు కుంకుమతోవున్న పళ్ళెంతో దేవాలయానికి వచ్చింది. దేవాలయంలో పూజాపురస్కారాలు ముగిసేసరికి గంట తక్కువ పట్టలేదు. ఇదంతా అనూరాధ వివాహంకోసం పడే తాపత్రయంలో ఒకభాగం అన్నమాట. ఎరిగున్నవాళ్ళు ఇద్దరు తటస్థపడితే వారితో కబుర్లలోకి దిగింది నారాయణి.

అనూరాధ తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుని కొంచెం అవతలగా కూచుంది. దేవాలయమంతా అధునాతనమైన అలంకరణలతో కళకళలాడుతోంది. విద్యుద్దీపాలు అమర్చబడ్డాయి. పందులుకూడా ఏర్పాటు చేసారు. భక్తులకు ఇబ్బందిలేకుండా ప్రతివారికి భగవద్దర్శనం అయేందుకు వీలుగా ఒక మనిషిమాత్రమే ముందుకు వెళ్ళగలిగేట్టుగా దారికట్టారు. తోక్కిసలాటకు అవకాశం లేకుండా.

నిరంతరంగా మ్రోగే గుడిగంటలతో, భక్తుల స్తోత్ర పాఠాలతో, హరిభజనలతో ఆలయం కోలాహలంగా, తొడతొక్కిడిగా వుంది.

ఇంతలో రొప్పుకుంటూ కొంపలు మునిగిపోయినట్టుగా నారాయణిస్నేహబృందంలో సభ్యురాలైన వనజమ్మ నారాయణిని సమీపించి "ఇది విన్నావా పిన్నీ" అంది.

"ఏమిటది?"

"మనోరమ నిన్నుగురించి అన్నమాటలు."

"నాకు తెలియదే"

"సరి! సరి! వెంకాయమ్మ నాకు చెప్పింది. ఆనాడు నువ్వన్నమాటలు ఆవిడ చెవిని ఎవరు వూదారో నిన్నుగురించి ఎన్నికూతలుకూసిందనుకున్నావు. రామ! రామ! ఈ దేవాలయంలో అలాంటిమాటలు చెప్పలేను" అని వనజమ్మ చెవులు మూసుకుంది.

"ఏమంది?" అని ఆత్రుతగా ముందుకు జరిగింది నారాయణి.

"తన తమ్ముడికి ఇంతకంటె లక్షరెట్లు యెక్కువయిన సంబంధాలు వస్తాయిట. వేలకివేలు సమర్పించేవారు వస్తారుట. తమ అంతస్థుకి నువ్వు ఏవిధంగానూ తగినదానివి కావుట. ఇంకా చాలా అంది నారాయణీ! ఆ మాటలు నే చెప్పలేను. నువ్వు వినలేవు."

"చెప్పు! చెప్పు!" అంటూ రొక్కించింది నారాయణి. ఈమె చెప్పే ప్రతిమాటకీ క్రమక్రమంగా ఆమె ఉద్రిక్తురాలు కాసాగింది.

ఇది గమనించి అనూరాధ "నీ కెవరు చెప్పా రమ్మా ఇవన్నీను" అంది.

వనజమ్మ "నాకు వెంకాయమ్మ చెప్పింది" అంది.

"అయితే ఆమెని అడుగుదామా?" అంది అనూరాధ.

"ఆమె ఇక్కడెక్కడుంది?"

"ఇక్కడేవుంది. శివాలయం ముందు చూసాను. ఆమెను పిలుచుకురానా?"

వనజమ్మ జంకకుండా "పిలుచుకురా! నే నేమీ అబద్ధం ఆడేదాన్ని కాను. ఇందులో ప్రతిముక్కా ఆ మనోరమ నోటినించి వచ్చినవే. అందులో సందేహం లేదు" అంది.

వెంకాయమ్మ వచ్చి "నాకు కామేశ్వరి చెప్పింది" అంది.

"ఇది విన్నావా అమ్మా. ఇలా లేనిపోని గాలి మాటలన్నీ పోగేసుకుని అనవసరంగా ఒక మనిషిని అల్లరి చెయ్యటానికి మనం తెగబడకూడదు. వీళ్లకి పనీ పాటా లేదు. వాళ్ళకీ, వీళ్ళకీ లేనిపోని మాటలు చెప్పి తగూలు, తంపులూ తీసుకుంటవటమే వీళ్లపని. పద పోదాం." అంది అనూరాధ తీవ్రంగా.

వనజమ్మ పాలిపోయిన ముఖంతో నారాయణి వైపుచూసి "విన్నావా అమ్మా ఈ చిన్నదాని మాటలు! మేమూ గౌరవం, సభ్యత తెలిసినవాళ్లమే. అల్లరి చిల్లరవాళ్లం కాము. తగూలు పెట్టటానికి మేం మర్యాద లేనివాళ్లం కాదు. నీ కూతురన్న మాటలు ఏమీ బాగా లేవు నారాయణి. నీమీద అభిమానంకొద్దీ నిన్నెవరన్నా ఏమన్నా అంటే నా మనసు బాధపడుతుంది గనక చెప్పాను." అంది ఆమె కొరకొర అనూరాధ వైపు చూస్తూను.

అనూరాధ ఏదో చెప్పబోతుండగానే "ఏవే నీకేమైనా పొగరెక్కిందటే? అనే మాటా అనకూడనిమాట తెలుసుకోవద్దూ? నోటికి ఎంత మాటవస్తే అంతా అనెయ్యటమే? నిప్పులేందే పొగపుట్టదు. మనోరమ ఎవర్తోనూ అనకపోతే వా దగ్గరికి వచ్చి చెప్పటానికి ం పట్టింది. అందువల్ల వీళ్లకి ఒరిగేదేముంది? మనోరమ అలా అనదని నువ్వనుకుంటున్నావు కాబోలు! ఆవిడేమీ తక్కువదికాదు. ఎంతకైనా తెగించిన ఆడది. ఆఁ! ఇంకా ఏముంది వెంకాయమ్మా! చెప్పు! చెప్పు!" అంది నారాయణి.

"ఆవిడేమీ చెప్పనక్కర్లేదు. నువ్వు లేముందు. ఇంటికిపోదాం" అంది అనూరాధ చిరాకు పడుతూను.

"నీకంత తొందరైతే నువ్వుపో. నేను కాసేపుండి వస్తాను." అంది నారాయణి.

అనూరాధ తమ్ముణ్ణి తీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

రాత్రి ఎనిమిదింటివరకూ నారాయణి ఇంటికి రాలేదు. అంతవరకూ ఆమె దేవాలయంలోనే కూర్చుని ఆధారంలేని గాలికబుర్లన్నీ వింటూ అవన్నీ నిజమని నమ్మి మనోరమమీద అణువణువునా ద్వేషం పెంచుకుని గాని ఇంటికి రాలేదు.

ఆమె దారి పొడుగూతా తనలోతానే మనోరమని తిట్టుకుంటూ శాపనార్థాలు కురిపిస్తూ అలిసి, ఇంటికి వచ్చింది. వాకిట్లో ఎదురుచూస్తున్న అనూరాధ తల్లి ముఖం చూసి మాట్లాడకుండా లోపలికి వచ్చేసింది.

"నువ్వు కొంపతీసి ఆమెయింటికి వెళ్ళి దెబ్బలాడలేదుగదా?"

"దానికొంపకు పోవల్సిన అవసరం నాకేముంది? నా కంఠంలో ప్రాణం వుండగా దానితో నేను మాట్లాడేదిలేదు."

ఆడవాళ్ళమధ్య అభిప్రాయభేదాలంటూ వుండటానికి పెద్ద కారణాలు అవసరం లేదు. చాలా చిన్న చిన్న విషయాలలోనే వాళ్ళు అమితమైన పట్టుదల పెంచుకుంటారు. ఇందుకు కారణం వాళ్ళ ప్రపంచం చాలా పరిమితమైంది కావటమే. అందువలనే వాళ్ళకి సుఖసంతోషాలు, స్పర్థలు, కలిగించే మూల విషయాలు చాలా స్వల్పమైనవిగా, సంకుచితమైనవిగావుంటాయి. భర్త చిన్న గాజిస్తే తన్మయులై జన్మ తరించినట్టు మనసులో అమృతాన్ని నింపుకుంటారు. కేవలం సమ్మంలో ముగ్గు వెయ్యటందగ్గర ఇరుగు పొరుగు కాపరాలవాళ్ళతో పెద్ద పెద్ద ఘర్షణలు పెంచుకుంటారు. నారాయణి ఇంతగా మనోరమ విషయంలో స్పర్థపూనటానికి బలమైన కారణంఅంటూ

ఏమీలేదు. కేవలం ఆమె భర్తను వదిలి తమ్ముణ్ణిపంచని చదువుకోవటమన్నది స్త్రీజాతికంతా కళంకం అని ఆమె అభిప్రాయపడింది. ఆమె ఇటువంటితప్పిదాలని సనేమీ క్షమించలేదు. "భర్తమీద విశ్వాసం సడలించుకున్న స్త్రీకి ఈ ప్రపంచంలో స్థానం లేదు. అందుకు వారు ఇహలోకంలో మాట ఎలాగున్నా పరలోకంలో నైనా భగవంతునిముందు సమాధానం చెప్పాల్సి వుంటుంది. అప్పుడిక కలిసివచ్చేదేమీ లేదు." అని ఆమె మనోరమవిషయంలో ఓమారు అంది.

## 9

ఎండలు బాగా ముదిరి కొండలమీదినించి వీచే గాలులు, పొగలూ, సెగలూ కక్కుతున్నాయి. తెల్లవారుఝామున నాలుగింటివరకూ నేల చల్లబడటం లేదు. అవకాశాలు వున్నవారు పట్నం వదిలి చల్లటి దూరస్థప్రాంతాలకు తరలి వెళ్ళిపోతున్నారు. ఉద్యోగస్తులు, కూలీ, నాలీ చేసుకుని బ్రతికేవాళ్ళు మహాయాతన పడుతున్నారు. వడదెబ్బ తగిలి ప్రాణాలు పోయినవారి సంఖ్య అప్పుడే పదికి మించింది. వయస్సు మళ్ళినవాళ్ళు వీథిముఖం చూడటానికి సాహసించటం లేదు. పిల్లలను కటిపడేసినట్టుగా ఇళ్ళల్లోనుంచి బయటికి రానివ్వటం లేదు పెద్దవాళ్ళు. ఇళ్ళు వదిలి ఆఫీసులకు పోయిన మగవాళ్ళు సాయంత్రం ఇంటికి చేరేవరకూ ఆడవాళ్ళు మనసు మనసులో లేకుండా ఆదుర్దా పడుతూంటారు.

విజయవాడలో వేసంగి భీబత్సమైన ఋతువు. తల్చుకుంటే గుండెలు అవిసిపోతాయి...పిల్లలు చదువుకుందుకు రాకపోవటంతో చిన్న చిన్న వీథిబడులన్నీ మూతలుపడ్డాయి.

సరిగా ఇటువంటిగుర్తివాలలో నే వీరభద్రంగారు మంచాన పడ్డారు. నారాయణి అణువణువునా కంపించిపోయింది. ఆమె అన్నగారికి కబురు పంపింది. ఆయన వచ్చారు. చెల్లెలికి ధైర్యం చెప్పి రెండు రోజులుండి మంచి డాక్టర్ని కుదిర్చి ఆయన వెళ్ళిపోయారు. నారాయణి కన్నీరు గ్రుక్కుకుంటూ పెదవులు కదల్చలేక వణుకుతూ డాక్టరుముందు నిలిచి ఏదో అడగబోయింది. ఆయన గ్రహించి "ఫర్వాలేదు. తగ్గిపోతుంది. మీరు ధైర్యంగా వుండాలి" అన్నారు.

ఆమె భర్త మంచం వదిలి ఇవతలికి రావటం లేదు. ఇంటి పనంతా అనూరాధ నెట్టుకొస్తోంది.

వీరభద్రంగారు కళ్ళు తెరిచి భార్యతో "క్లబ్బునించి నా కోసం ఎవరైనా వచ్చారా?" అన్నారు.

"లేదు"

"ఇంకా పాతికనుంచిదాకా చందాలు కట్టవల్సినవాళ్ళున్నారు. వాళ్ళు కబురైనా లేదా?"

"మీరు ఆ చింత మానండి. ఎవరెలా పోతే మనకెందుకు?"

అనూరాధ తల్లిని భోజనానికి లెమ్మంది.

"నాకు ఆకలిలేదె అమ్మాయ్! నువ్వు తిను"

"నువ్వు ప్రతిరోజూ ఇలాగే అంటున్నావు. అలా వీల్లేదు" అంది అనూరాధ.

"నన్ను బలవంత పెట్టకే. నువ్వు పోయి తిను. తమ్ముడు తిన్నాడా?"

"వాడు తిన్నాడు. నువ్వు తినందే నేనూ భోజనం చెయ్యను".

"పోయి అన్నంతిను. నీ తెలివి బాగానే వుంది, ఉపవాసాలు చేస్తావా?" అంటూ మందలించారు వీరభద్రంగారు.

నారాయణి లేచి భోజనానికి వెళ్ళింది.

ఫర్వాలేదు, వారం రోజుల్లో నయంఅవుతుందనుకున్న జ్వరం నెల్లాళ్ళయినా తగ్గుముఖం పట్టలేదు. మనిషి బాగా నీరసించిపోయారు. చిదకదివసలు పడ్డాయి. మెడకొంకులు బయటపడ్డాయి. మాటకూడా బాగా సన్నగిలిపోయింది.

మందులూ, మాకులూ, మరోక చెంప సంసారమూ, వీటన్నిటికి వచ్చే ఆదా చాలటం లేదు. ముందుగా నారాయణి చేతిగాజులు తాకట్టునుంచి అమ్మకానికి పోయాయి.

నారాయణమ్మ మనసులో నిరంతరం కృశించిన భర్త అస్థిపంజరమే మెదుల్తోంది. దేముడిమీద భక్తిప్రపత్తులు బాగా పెరిగిపోయాయి. కనిపించిన ప్రతిరాయికీ, చెట్టుకూ ఆమె భర్తఆరోగ్యం గురించి మొక్కింది. ప్రతి రోజూ శివాలయంచుట్టూ ప్రదక్షిణాలు చెయ్యటం దినచర్యలో ఓభాగం చేసుకొంది. కాని ఫలితం ఆమె కూడా బాగా నీరసించిపోయింది, అంతకు తప్పించి మరేమీ కనిపించలేదు. వీరభద్రంగారి ఆరోగ్యం పిసమెత్తుకూడా కోలుకోలేదు. ఆయన నానాటికీ కృశించిపోతున్నారు.

రాత్రి ఒంటిగంట కొట్టింది గడియారం. అనూరాధ నిద్ర మెలకువవచ్చి చూస్తే తల్లి తండ్రిమంచం వార కోడుకు తల ఆనించి కునికిపాట్లు పడుతోంది. తండ్రి గోడకి అంటిపెట్టుకున్న బల్లిలా మంచంమీద నిద్రపోతున్నాడు.

"అమ్మా!"

నారాయణి మెల్లగా కళ్ళు తెరిచి "ఎందుకమ్మా" అంది. గదిలో ఒక మూలగా హరికేన్ లాంతరు మినుకు మినుకు మంటోంది. గాలి ఇంకా వేడిగా వీస్తూంది.

"వేళకి నిద్ర, తిండి వదులుకుంటే ఆరోగ్యం చెడిపోదూ?"

"ఈ పాడుశరీరం అంత త్యాగం చెయ్యగలదా? అన్నం తినకుండా, నిద్రపోకుండా ఎలా వుండగలను. సుష్టుగా తింటున్నాను. తిరుగుతున్నాను. నా గురించి నువ్వు దిగులుపడకు పడుకో" అంది నారాయణి.

అనూరాధ ఇంకేమీ ప్రశ్నించకుండా నారాయణి పొంజతో వారిస్తూ "నువ్వు పడుకో. వారికి మెలకువ వస్తుంది" అంది.

వీధిలో కుక్కలు అరుస్తున్నాయి. నారాయణి లేచి అనూరాధని వెంటబెట్టుకుని వీధిలోకి వెళ్ళి వాటిని తోలేసి వచ్చింది.

అనూరాధ నిద్రపోయింది. నారాయణికి తెల్లవారే వరకూ మెలుకువగానే వుంది. భర్త మెలుకువవచ్చి చూసేసరికి తెల్లవారుఝాము. నారాయణి మంచంవార కూర్చుని వుండటం గమనించాడు.

"నిద్రపోలేదూ?" అన్నారాయన నూతిలోనుంచి మాట్లాడినట్టుగా.

"అబ్బే! ఇప్పుడే లేచాను. పనిమనిషి వచ్చి లేపింది" అని అబద్ధం ఆడింది నారాయణి.

ఇవాళ ప్లీడరు గారివద్ద నుంచి మనిషి వచ్చాడు.

నారాయణి ఆయన్ని కూచోమని "ఎందుకు వచ్చారు?" అంది.

ఆ వచ్చినాయన "ప్లీడరుగారు పంపించారు" అన్నాడు.

"జీతం పంపారా?"

"అవును" అని ఆయన మొలలోంచి అరవై రూపాయలుతీసి అనూరాధచేతికిచ్చాడు.

"ఆయనకి నా నమస్కారాలు అందజెయ్యండి. ఇంకా వారు పూర్తిగా కోలుకోలేదు." అంది నారాయణి.

"అది సరే. వారు మరోకమాట కూడా చెప్పమన్నారు" అన్నారాయన సందేహిస్తూను.

"ఏమిటది?"

"ఇప్పటికి మూడు మాసాలనుంచీ వీరభద్రంగారు జబ్బుగావున్నారు. పదిహేను సంవత్సరాలు పని చేయించుకున్న అభిమానంమీద అయ్యగారు ఈ మూడుమాసాలు జీతం ఇవ్వగలిగారు. ఇవాళనుంచీ వారు మరొక గుమాస్తాని కుదుర్చుకున్నారు. ఇక ఈ

"రాదంటారా?" అంది నారాయణి గొంతు పెగల్చుకుని.

అవునన్నట్లుగా ఆయన తలవూపారు.

"అయితే వుద్యోగం వదులుకోమనే చెప్పారా?"

"అలా చెప్పలేదు. వారి ఆరోగ్యం ఎప్పుడు కుదుటపడితే ఆనాటినుంచీ మళ్ళీ చేర్చుకుంటామన్నారు. నన్ను ఇలా చెప్పమన్నారు."

నారాయణి పాలిపోయిన ముఖంలో ఏభావాలనో రేఖామాత్రంగా ఆశ పొడచూపింది. అంతమాత్రాన ఈ దెబ్బనించి ఆమె పూర్తిగా కోలుకుందని చెప్పటానికి వీల్లేదు.

ఆయన వెళ్ళిపోయారు.

నారాయణి అనూరాధని దగ్గరికి రమ్మని పిలచి "ఈ విషయం ఆయనకు తెలియకూడదు సుమా. జాగ్రత్త. ఎవరిదగ్గరా అనకు" అంది.

"ఎవరు వచ్చారు?" అన్నారు లోపల్నించి వీరభద్రంగారు.

"మీకోసం కాదు."

"మూడు మాసాలనుంచీ ఇలా మంచంమీద పడివున్నానుగదా జబ్బునించి ఒక్కమూండాకోడుకు చూడటానికి వచ్చాడూ?" అన్నారాయన.

"అవును. వాళ్ళకెందుకుంటుంది అభిమానం! ఒంట్లో శక్తివున్నన్నాళ్ళూ చాకిరీ చేయించుకున్నారు" అంది అనూరాధ.

రోజులుగడవటం చాలా కష్టంగావుంది. డాక్టరు ఫీజుకయితేనేం మందులకయితేనేం ఈ జబ్బుకింద ఇంతవరకూ రెండు వందలవరకూ అయిపోయింది. కాని గుణంమటుకు అణుమాత్రమైనా కనబట్టంలేదు.

“కొట్టువాడు అరువు ఇవ్వనన్నాడండీ” అంటూ పనిమనిషి వచ్చింది వట్టిచేతుల్తో.

నారాయణి కేవీఁ పాలుపోలేదు. “పక్కింటికెళ్ళి ఓ శేరుబియ్యం పట్టుకురా అనూరాధా?” అంది.

కాని అనూరాధ, “నే వెళ్ళను. తమ్ముణ్ణి పంపించు” అనటంతో నారాయణి చిరాకుపడుతూ “అందరికీ అభిమానమైతే నేనువెళ్లి తెస్తాను” అంటూ బయల్దేరింది. కాని అనూరాధ ఎందుకు వెళ్ళనందో ఆమెకి అర్ధం అయింది. ఆమె తనకి అభిమానులు, ఆప్తులు అనుకున్నవాళ్ళంతా ఏవో కారణాలుచెప్పి ఒక్కగింజయినా రాల్చలేదు. చివరికి ఎలాగయితేనేం చాటలో బియ్యంతో ఆమె ఇంటికి వచ్చింది.

వీరభద్రంగారు పదిహేను సంవత్సరాలనుంచీ చేసిన ప్లీడరుగుమాస్తా ఉద్యోగంలో ఆయన వెనక వేసింది దమ్మిడీ లేదు. సాధారణంగా ఆ ఉద్యోగం చేసినవాళ్ళెవరూ మేడలూ మిద్దెలూ కట్టకుండా పోలేదు. జీతం రూపంలో వచ్చేదానికి పైనవచ్చే ఆదాయం ఎంతలేదన్నా రెండు మూడు రెట్లు వుంటుంది. వీరభద్రంగారుకూడా ఈ విషయంలో మడికట్టుకుని కూర్చున్నారనటానికి వీల్లేదు. అయితే వచ్చిందాల్లో మూడువంతులు ఆయన ఖర్చుకే సరిపోయేది. కాఫీహోటలు బిల్లు ముప్పయి, రిక్షాలకి, బళ్ళకి, అయే ఖర్చుకింద పాతికో, ఇవికాకుండా సినిమాలు, నాటకాలు, క్లబ్‌లో పేకాటల్లో పోగొట్టుకొనేదీ, ఇవన్నీ కలిసి ఆయన జీతంలో సగం మింగేవి. ఆ మిగతా సగంమాత్రం ఆయన ఇంటికి తెచ్చి ఇస్తూంటారు. నారాయణి అదేమని అడిగేమనిషి కాదు. ఆ వచ్చినదేదో కటాకటిగా ఇంటిక్రింద సరిపోయేది. కాని ఇలాంటి ఇబ్బందులు వస్తాయనిగాని, పెళ్ళికెదిగిన పిల్ల, పిల్లవాడి చదువు వీటినిగురించి ఆ దంపతులు ఆలోచించలేదంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. వారి వారి అభిప్రాయాలు, స్వభావాలు అలాంటివి.

నారాయణి ప్రయత్నంమీద గుండె రాయి చేసుకుని తిరుగుతోంది. కాని ఆమె మనసు ఏక్షణాన ఎలా పరిణమిస్తుందో ఎవరూ వూహించటం కష్టం.

ఇంతవరకూ జబ్బేమిటో చెప్పకుండా వైద్యం చేసిన డాక్టరు తనకు కొరుకుబడని ఈ రోగిని వదుల్చుకోవాలనే అభిప్రాయంతో రెండు మూడు రోజుల్నుంచీ రావటం మానేసాడు.

నారాయణి కుర్రవాణ్ణి ఆసుపత్రికి పంపిస్తే ఆయన ఇచ్చిన సమాధానం “మరొక డాక్టర్ని కుదుర్చుకోమని.”

నారాయణి గాభరాపడి ఆనాడే పక్కింటాయనతో చెప్పి మరో డాక్టర్ను ఏర్పాటుచేయించింది. ఆయనవస్తూనే ఇల్లంతా ఓమారు పరిశీలించి ఇంగ్లీషులో “రోగిని అంత ఇరుకుగదిలో కాకుండా ఇలా విశాలమైనచోట పడుకోబెట్టలేకపోయారా?” అన్నాడు. తను చెప్పింది ఇక్కడ ఎవరికీ అర్థంకాలేదని గ్రహించి ఆయనే తెలుగులోకి అనువదించి చెప్పారు.

అనూరాధ వెనకనుంచి తల్లితో “కొరువాడు రూపాయి యిమ్మంటున్నాడు” అంది. పక్కింటాయనతో ఈ విషయం చెప్పితే “అలా ఇచ్చుకోవాలమ్మా” అన్నాడాయన.

డాక్టరయితే మారాడుగాని గుణంమటుకు కనబడలేదు.

మళ్ళీ మొదటితారీఖు వచ్చేసరికి నారాయణి మెళ్ళోవున్న ఒక్కగానొక్క ఒంటిపేట బంగారు గొలుసు అమ్మకానికి వెళ్ళిపోయింది. ఇంట్లో చిల్లరమల్లర వెండిసామానంతా ఇదివరకే ఖాళీ చేసేశారు.

## 10

వీరభద్రంగారి జబ్బుతో అనూరాధ వివాహ ప్రసక్తి వెనకబడిపోయింది. అసలా విషయం గురించి ఆలోచించే అవకాశమే ఎవరికీ లేదు. నిత్యం మందులూ, మాకులూ, జ్వరం హెచ్చుతగ్గులూ - ఒక చెంప సంసారంలో ఖర్చులు-ఈవిధమైన విషమ పరిధుల్లో సతమతమవుతున్నారు.

ఇదివరకు ప్రతినిత్యం వచ్చే అమ్మలక్కలెవరూ ఇప్పుడు రావటంలేదు. ఎన్నడూ అనుకోని పరిస్థితులు వచ్చి పడడంతో నారాయణికి వుక్కిరిబిక్కిరిగా వుంది. ఇంతటి ఒత్తిడిలో కూడా నారాయణి పూర్తిగా హతాశురాలు కాలేదు. ఆమెకు ఒక ఆశ అంటూ వుంది. భర్త ఆరోగ్యం కుదుటపడితే ఈసంసారం దివ్యంగా నడుస్తుంది” అనే ఆమె ఆశించింది.

ఇవాళ ఇంట్లో పరిస్థితి అనూరాధకి మనసులో ఏదో ఆవేశం చొప్పించింది. ఆమె వెనకాముందూ చూడకుండానే నేరుగా మనోరమ ఇంటికి వెళ్ళిపోయింది. కాని లోపలికివెళ్ళిం తర్వాత ఆమెలో ఉద్రేకం చప్పగా చల్లారిపోయింది. మనసులో అడగాలనుకున్నది అడగలేక మనోరమ వేసిన ప్రశ్నకు "వూరికేనే వచ్చాను" అంది.

పని మనిషికి అంట్లువేసి—"ఇవాళ తెల్లవారకుండానే వచ్చావు, ఈ మిత్రురాలిమీద ఇంత దయ కలిగిం దేమిటివిశేషం?" అంది మనోరమ.

కాని అనూరాధ ముఖం ప్రఫుల్లం కాకపోవడంతో ఆమె "అలాగున్నావేం అనూరాధా?" అంది.

"నీకు తెలియదా మనోరమా"

"ఏమిటది?"

"మా నాన్న జబ్బుసంగతి"

మనోరమ చేతిలో పుస్తకం జారవిడిచి "తెలియనే. నువ్వు కనబడి మూడు మాసాలయింది. లేనిపోని అబద్ధాలు చెప్పి స్పర్థలుపుట్టించే ఈఆడవాళ్ళనెవర్నీ నేను చేరదియ్యటం లేదు. ళ్ళని రావద్దని ఖచ్చితంగా చెప్పేసాను. ఆ తర్వాత మీయింటి విషయాలు నాకు బొత్తిగా తెలియవు." అంది మనోరమ వ్యాకులితమైన కంఠంతో.

"మూడు మాసాలయింది మంచం పట్టి"

"ఆఁ!" అనే ఆశ్చర్యార్థకం తర్వాత మనోరమ మాట్లాడటానికి వ్యవధి తీసుకుంది. "అసలు జబ్బేమిటి? ఇప్పు డెలాగుంది? డాక్టరు సరిగ్గా చూస్తున్నాడా? ఆయ నేమన్నాడు?" అంటూ ఆమె ప్రశ్నల మీద ప్రశ్నలు కురిపించింది.

"అసలు జబ్బేమిటో ఎవరూ చెప్పటంలేదు. మనిషి బాగా నీరసించిపోయాడు. ఏమీ తోచటం లేదు. ఇంట్లో ఎవరికీ మనసు మనసులో వుండటం లేదు" అంది అనూరాధ.

మనోరమ ఆమెవెన్ను నిమురుతూ "అదే తగ్గుతుందిలే. ధైర్యంగా వుండాలి" అంది.

"అదే ఆశలో మేమూ వున్నాము."

"ఇలాంటి సమయాల్లో మనం ధైర్యం కోల్పోకుండా వుండటం తప్పించి ఏమీ చెయ్యలేము. అలాంటి అనుభవం మా కుటుంబం ఎదుర్కొంది."

అనూరాధ సాభిప్రాయంగా మనోరమ ముఖంలోకి చూసింది.

"మా నాన్నకి జబ్బుచేసింది. నెలల తరబడి తీసుకున్నాడు. భర్తని గౌరవించటంలో, అభిమానించటంలో అమ్మకున్న పట్టుదల, దీక్ష, చాలా ఆశ్చర్యకరంగా వుండేది. చివరికి ఆయనకి బాగా విషమించింది. ఇక బ్రతకరని తోచగానే మా అమ్మ ఆత్మహత్య చేసుకుంది." అని మూడు ముక్కల్లో తేల్చేసింది మనోరమ.

అనూరాధ కళ్ళు జలదరించింది. ఆమె అయోమయంగా "ఎందుకు?" అంది.

భర్తకన్న ఒక్క నిమిషమైనా ముందు చనిపోయి ఐదోతనంతో స్వర్గంలో అడుగు పెట్టాలని ఆమె తరుచు అంటూ వుండేది. ఒకొక్క నమ్మకం మనిషిని ఎంతటి సాహసానికైనా తీసుకెళ్తుంది. ఆమె పోవటంతో సంసారంలో అనేక చిక్కులు బయల్దేరాయి. ఆ తరాఁ కొద్దిరోజులకే నాన్న చనిపోయాడు. మేమంతా చిన్నపిల్లలం. మా రెండేళ్ళవాడు. వాణ్ణి సాకి పెద్దచేసాను నేను.

"కేవలం మూర్ఖం!" అంది అనూరాధ ముఖం చిట్లించి.

"దాన్ని మనం ఏమని పేరుపెట్టినా పెట్టవచ్చు. కాని ఈ నమ్మకాలను మనం వదిలిపెట్టలేకపోతున్నాం. శ్మశానవైరాగ్యంలాగ ఇలాంటివి విన్నప్పుడూ, కన్నప్పుడూ కొత్త మనసు బెంబేలుపడి కొద్దిసేపు విశాలహృదయులమౌతాం. కాని మరునిముషంలో మామూలుగా అయిపోతాం. దాలిగుంటలో కుక్కలతెంతు మనది" అంది మనోరమ.

అనూరాధకు ఇలాంటి విషయాలు అర్థంచేసుకునే అనుభవంలేదు. ఆమె అమాయికంగా "చచ్చిపోవటం అన్నమాట వింటే గుండెలు గుభిల్లుమంటాయి. అలాంటిది ఆత్మహత్య ఎలా చేసుకోగలిగిందమ్మా?" అంది.

"మనదేశంలో తరతరాలుగా పెంచి తమ తమ సంతానాలకికూడా పంచిపెట్టే మహా ప్రసాదం ఈ బానిసత్వం. ఇది స్త్రీ వరవరానికి జీర్ణంచేసుకుని దాన్ని ఘనమైన పేరుతో పిలుచుకుని ఆరాధిస్తూంటుంది. సంసారబాధ్యతలు సమంగా పంచుకుని ఒకర్ని ఒకరు పరస్పరం అభిమానించుకుంటూ, అర్థం

చేసుకుంటూ, సర్దుబాటు చేసుకుంటూ సంసారం నడుపుకోవాలనే వారితో ఏకీభవించేవారిలో నేను మొదటిదాన్ని. అంతేకాదు. చదువుకున్న ప్రతి ఆడది విధిగా వుద్యోగం చేసితీరాలనే అభిప్రాయంకూడా నేను వ్యతిరేకిస్తాను. ఇంట్లో వంటచెయ్యటం, పిల్లల్ని సాకటం, ఇల్లు చక్కబెట్టుకోవటం అన్నది ఒక బాధ్యత. ఆఫీసులో వుద్యోగంచేసి సంసారానికి అవసరమైనడబ్బు తీసుకురావటమున్నది మరొక బాధ్యత. ఇందులో మొదటి బాధ్యతకంటె రెండవ బాధ్యత ఘనమైనదని, గౌరవప్రదమైనదనీ భావించే స్త్రీలతో నేను అనేకమార్లు వాదించాను. ఒక బాధ్యత స్త్రీ నిర్వహిస్తే మరో బాధ్యత పురుషుడు నిర్వహిస్తాడు. ఇందులో హెచ్చుతగ్గులకి స్థానం లేదు. కాని నేను చెప్పేదల్లా స్త్రీ తన ప్రపంచాన్ని మరింత విస్తృతం చేసుకోవాలనే. భర్తని ఆరాధించే ఆడదానికన్న అభిమానించే ఆడదాన్ని నేను ఎక్కువ గౌరవిస్తాను. ఆరాధనలో భావదాస్యం వుంది. అదొక మత్తుమందు లాంటిది. ప్రతి స్త్రీ వీధినిపడే పరిస్థితులు రాకుండా తన కాళ్ళమీద తను నిలబడగలిగే అర్హత సంపాదించుకోవాలి. అవసరమైతేనే ఆ అర్హత వినియోగించుకోవాలి. అంతేగాని వుద్యోగాలు చెయ్యటమే ఘనమైన గౌరవంగా భావించటం నాకు రుచించదు.

"అయితే నేను చదువుకోలేదుగా" అంది అనూరాధ.

"కాని చదువుకుని వుండాల్సింది. ఈపాటికి చాలావరకూ పూర్తయేది."

"మా అమ్మకి ఇలాంటివంటే గిట్టవని నీకు తెలుసుగా "

"ఆ విషయం నీకంటె బాగా తెలుసు."

తను వచ్చింది ఒకందుకైతే అది వదిలిపెట్టి తక్కినవన్నీ మాట్లాడి అనూరాధ 'నేను వస్తాను' అని లేవబోయింది. అడగాలని ప్రయత్నించింది. నోటి చివరివరకూ వచ్చింది. కాని నోరుతెరచి 'ఓ అర్థశేరు బియ్యం అప్పుఇవ్వు" అని అడగటానికి ఆమెచేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయిపోయాయి.

"నేను సాయంత్రం మీ ఇంటికివస్తాను. మీ నాన్నగారిని చూడటానికి," అంది మనోరమ అనూరాధని సాగనంపుతూను.

అనూరాధ చప్పున వెనక్కితిరిగి మనోరమ రెండుచేతులూ పట్టుకుని "నీకు దణ్ణం పెడతాను మనోరమా! నామాట అపార్థంచేసుకోకుండావుంటే ఒక మాట చెబుతాను" అంది.

"నేను నిన్ను ఎప్పుడు అపార్థంచేసుకున్నాను అనూరాధా! అదేమిటో చెప్పు."

తడబడుతున్న స్వరంతో "నువ్వు మాయింటికి రావద్దు మనోరమా" అంది అనూరాధ.

మనోరమ విస్మయంతో తేరుకుని" అదేమిటి అనూరాధా!" అంది.

"అంతా నీకు తెలుసు మనోరమా. మన పరిచయం ఇలా నిలిచివుండాలంటేమటుకు ఆ పని చెయ్యకు."

"అవును. నాకు తెలుసు. కాని నేను నిగ్రహం గల మనిషిని అనూ."

"అవును ఆవిషయం నాకు తెలుసు. మనోరమా నువ్వు నన్ను మరోకలా భావించవనే అనుకుంటున్నాను. నాపరిస్థితి నీకు తెలుసు. కన్నకూతురుగా తల్లిమీద అభిమానం చంపుకోలేను. కాని ఆమెను నేను సమర్థించనూలేను. నీ స్నేహాన్ని అంతకంటె వదులుకోలేను."

"అది సహజం అనూరాధా. నాకది అర్థం అయింది."

"మరొకమాటకూడా చెప్పాలనుకున్నాను."

"ఏమిటది?"

"మాఅమ్మ కేవలం అజ్ఞానురాలు. ఆమె ధోరణి చాలా దుర్భరంగా, దురన్యాయంగా వుంటుంది. ఎప్పుడయినా ఎదటపడి ఏమైనా అన్నా నువ్వు లక్ష్యపెట్టవద్దని కోరుతున్నాను."

మనోరమ ఆమె భుజంమీద చేతులువేసి "నాకు అన్నీ తెలుసునమ్మా. నువ్వు నిశ్చింతగా వెళ్ళు. కాని మీ నాన్న ఆరోగ్యం గురించి నాకు తరుచుగా తెలుస్తూండాలి. నన్ను రావద్దన్నావు కాబట్టి నువ్వయినా చెప్పిపోవాలి' అని అనూరాధ నాలుగు అడుగులు వేసేవరకూ ఆగి లోపలికి వచ్చేసింది.

అనూరాధ ఇంటికివెళ్ళగానే తల్లి వేసినప్రశ్నకు స్నేహితురాలింటికి వెళ్ళాను అని సమాధానం చెప్పింది.

నారాయణి భర్త గదిలోకి వెళ్ళి మందు కలిపి ఇచ్చి "ఎలాగుంది?"

వీరభద్రంగారు లోతుకుపోయిన కళ్ళు నిలబెట్టి నీరసంగా మూలిగారు. తల బాధగా అటూ ఇటూ తిప్పారు. లేవబోయి తూలి మంచంమీద పడిపోయారు. నారాయణి చప్పున అదుకుంటూ "ఏం కావాలి? నాతో చెబితే నేచేయనూ? లేవకండి" అంది.

ఆయనకు ఏదో చెప్పాలని మనసులో వుందిగాని మాట బైటికిరావటంలేదు. అతి నీరసంగా సన్నగా "ఇలాకూర్చో" అన్నారాయన.

జీవితంలో మొదటిసారిగా ఆయన ఈ సంసారం గురించిన ప్రసక్తి తీసుకువచ్చారిప్పుడు. "ఈజబ్బులో అమ్మాయి గురించి ఆలోచించటానికే వీల్లేకపోయింది. భగవంతుడి దయవల్ల కుదుటపడితే త్వరలో పెళ్ళి చేసెయ్యాలి" అన్నారు.

"దాన్ని గురించి మీరు బాధపడకండి" అయినా దాని వయసెంత? పదహారేగా. ఇంకా కావలసినంత వ్యవధివుంది. నిదానంగా మంచిసంబంధం చూద్దాం. మీరు ఆదిగులు పెట్టుకోవద్దు."

"మరి కట్నానికి డబ్బు కావద్దూ?"

"అదేవస్తుంది. ఆచింత నాకెప్పుడూ లేదు. అన్నిటికి కాలం కలిసిరావాలి."

"పనిచెయ్యకుండా ప్లీడరుగారిదగ్గర జీతం తీసుకోవటం సిగ్గుగావుంది."

దీనికి సమాధానం చెప్పటానికి నారాయణి కాస్త తటపటాయించింది. ఆమె కళ్ళు నీటిపొరలు క్రమ్మటంతో ఆమె ఒకమారు బైటికి వెళ్లి వచ్చి "ఫర్వాలేదు. ఇన్నాళ్లు చాకిరీ చేశారు. ఆపాటి సహాయంచెయ్యటం వాళ్ళ విధ్యుక్తధర్మం" అంది.

"అబ్బాయిని అప్పుడప్పుడు పంపి నా ఆరోగ్యం గురించి వారికి తెలియబరుస్తూండు. లేకపోతే బాగుండదు."

"అలాగే"

ఆ తర్వాత ఆయన భార్య ముఖంవైపు చూసి "నువ్వు పూర్తిగా నిద్రాహారాలు వదిలిపెట్టినట్టున్నావే" అన్నారు.

"అని మీతో అనూరాధ చెప్పిందా?"

"ఎవరూ చెప్పనక్కర్లేదు. నీరూపు చూస్తే నే తెలుస్తోంది. నాకంటే నీరసించిపోయావు."

"ఏమీలేదు. మీకంటె కలా కనబడుతున్నానంతే. కడుపునిండా తిని కంటినిండా నిద్రపోతున్నాను. దిగులుపడవలసింది మిమ్మల్ని గురించి మేము గాని మాగురించి మీరు కాదు. కళ్లు మూసుకుని పడుకోండి."

అయినా ఆయన ప్రశ్నలు ఆగలేదు. "నేను ఎంత దురదృష్టవంతుణ్ణంటే జీవితంలో కాస్త చేదోడువాదోడుగా వుండే అన్నగాని, తమ్ముడుగాని లేకుండా ఏకాకిగా పెరిగాను. అవునంటావా?"

"నేను వప్పుకోనండీ, ఇప్పుడు మనకి వచ్చిన లోటేముంది?" అంటూ అనూరాధ లోపలికి ప్రవేశించింది.

"అవును. అమ్మాయి చెప్పింది నిజం" అంది నారాయణి.

"తమ్ముడు ఏంచేస్తున్నాడమ్మా. ఓమారు తీసుకురా."

అనూరాధ బైటికివెళ్లి దుమ్ములో ఆడి దుమ్ము కొట్టుకుపోయిన చంద్రుణ్ని పెరటిలోకి తీసుకువెళ్ళి వళ్ళంతా కడిగి మంచి బట్టలు వేసి తండ్రివద్దకు తీసు ంది.

ఆయన వాణ్ని దగ్గరకిరమ్మని సౌంజ్ఞచేసి వాణ్ణి దగ్గర కూర్చోబెట్టుకుని "అక్క చెప్పినట్టు, అమ్మ చెప్పినట్టు వింటున్నావా? అల్లరి చేస్తున్నావా?" అన్నారు.

వాడు లేదని సమాధానం చెప్పాడు.

ఆయన వాడి తలలోకి వేళ్ళు పోనిచ్చి "ఇసకలో దొర్లివచ్చావా? ఇలా తలంతా గరగరలాడుతోందేం." అన్నారు.

నారాయణికి కన్నీరు ఆపుకుందామన్నా ఆగలేదు. భర్త నోటివెంట ఇలాంటి బాధ్యతాయుతమైన మాటలు ఆమె ఈ ఇరవై సంవత్సరాలలోనూ ఇదే ప్రథమంగా వినటం. ఎన్నడూ శ్రమ అన్నది ఎరగని వారు ఏపాటి చిన్నపాటుపడినా ఎదుటివారి సానుభూతి ఏ విధంగా చూరగొంటారో! నారాయణిలో అనిర్వచనీయమైన జాలి, సానుభూతి వీరభద్రంగారు పొందగలిగారు. ఆమెముఖం పక్కకుతిప్పుకుని కన్నీరు తుడుచుకుని అనూరాధ నుద్దేశించి "వాణ్ణి తీసుకుపోయి దుమ్ముదులిపి స్నానం చేయించు" అంది.

వాడు లేవబోతుంటే ఆయన పట్టుకుని “పంతులు దగ్గర చదువుకుంటావా?” అన్నారు.

వాడు తల వూపాడు.

“వీడికి మంచి మాష్టారుని చూసి ఏర్పాటు చేయించు. చదువుకుంటాడు” అన్నారు భార్యతో.

ఈ మూడు మాసాల్లోనూ ఇంతిసేపు మాట్లాడటమన్నది జరగలేదు. ఇవాళ ఆయన వోపికచేసుకుని మాట్లాడారు.

ఆ సాయంత్రానికి ఆరోగ్యం మరీ క్షీణించిపోయినట్టు డాక్టరు గ్రహించి వెనకనించి నారాయణి అడిగినదానికి నసుగుతూ ఏమీ చెప్పకుండానే వెళ్ళిపోయారు.

## 11

ఆ మర్నాడు తెల్లవారకుండానే ఆ వీధి వాళ్ళంతా హృదయవిదారకమైన ఆక్రందనలు విన్నారు. ఆతృతగా బయటికివచ్చి ఆక్రందన వినవచ్చిన ఇంటివైపు నడిచారు. ఇంటిముందు జనం గుంపులుగా చేరసాగారు.

నారాయణి భర్త శవంమీదపడి తల బాదుకుంటూంది. అనూరాధ తల్లిమీదికి వరిగి జుట్టుపీక్కుని విలపిస్తూంది. నలుగురూ చేరి వారిని ఓదార్చసాగారు. ఎవరి అనునయవాక్యాలూ వారికి దుఃఖోపశమనం కలిగించలేకపోయాయి. మసక చీకటిలో నారాయణి జుట్టు విరబోసుకుని పెద్ద కేక పెట్టి నేలని పడిపోయింది. ఆమె చైతన్యం కోల్పోయింది. అదేమీ అనూరాధ గమనించేస్థితిలో లేదు. ఆమె దుఃఖతీవ్రతలో ఆమె లీనమైపోయింది.

“ఇప్పుడిక మనం చెయ్యగలిగిం దేముందమ్మా. మనసు నిబ్బరంచేసుకోవాలి” అంటూ ఇంటాయన ఓదార్చబోయాడు. కాని ఆ మాటలు వారిరోదనలతో కలిసిపోయాయి. ఆయనే ఆమె అన్నగారిపేర టెలిగ్రాం ఇప్పించాడు.

సూర్యుడు కరకరమంటూ తొంగిచూచాడు. నారాయణి స్మృతితెచ్చుకుని తిరిగి విలపించసాగింది. అనూరాధ అలసి అలసి గొంతు బొంగురుపోయి నిశ్చేష్టురాలై చూస్తూ కూచుండిపోయింది. చంద్రుడు ఆమె ఒడిలో తలపెట్టి నిద్రపోతున్నాడు.

ఉన్నట్టుండి మనోరమ అనునయంతో అనూరాధలోని దుఃఖం తిరిగి పైకివచ్చింది. ఆమె రెండుచేతుల్లోనూ ముఖం కప్పుకుని మనోరమ మీదపడి భోరుమని ఏడ్చింది.

ఇలాంటి పరిస్థితుల్లో ఎవరూ ఏమీ చెయ్యలేరు. చెయ్యగలిగిందల్లా ప్రయోజనం లేదని తెలిసికూడా చెప్పినమాటలే చెబుతూ చవకరకం వేదాంతంతో ఓదార్చటంవరకే. మనోరమ అనూరాధని హృదయానికి హత్తుకుని “అమ్మను చూడు అనూరాధా! చిన్నదానివి నువ్వు ధైర్యంగా వుండాలి; అమ్మకు ధైర్యం చెప్పాలి. అంతే గాని నువ్వూ ఇలాగయిపోతే ఎలాగ?” అంది.

అనూరాధ ఏడుస్తూనే “ఇంత ఘోరం జరుగుతుందనుకోలేదు మనోరమా. ఇలా నిలువునా మమ్మల్ని నట్టేట ముంచుతాడనుకోలేదమ్మా” అంది.

మనోరమ అలా ఆమెని పొదివిపట్టుకునే మరోకచేత్తో చంద్రుడితల నిమురుతూ కన్నీరు పెట్టుకొంది. ఈశోకపూరిత వాతావరణంలో ఆమె కరిగిపోయింది. ఆమె చెంపలవెంట కారే కన్నీరు అనూరాధ నుదుటిమీద పడగానే అనూరాధ తలెత్తిచూసి మరింత గాఢంగా ఆమెని హత్తుకొంది.

చివరికి శవస్నానాదికాలు ముగిసి పాడె లేచేసమయానికి నారాయణి అన్నగారు బండి దిగారు. ఆయన నేరుగా వచ్చి చెల్లెల్ని హత్తుకుని ఆమెకంటే ఎక్కువగా బావురుమన్నాడు. మరోక్కమారు అందరి గొంతులూ ఉచ్చైస్వరంలో ఆక్రందించాయి. ఆ రోదన విన్నవారికి కన్నవారికీ కూడా గుండెలు కరిగిపోయాయి.

అవతల పెద్దలు తొందరచెయ్యసాగారు. నారాయణి దుఃఖంతో శవంమీదనించి లేవటంలేదు. చివరికి బలవంతాన ఆమెను ఇవతలికి లాగింతర్వాతగాని శవాన్ని కదిలించలేకపోయారు.

పొద్దువాటారింది. ఇంకా రెండు మూడు గంటల తతంగం తర్వాతగాని కడుపులో ఆహారంవెయ్యటానికి వీల్లేదు. ఎండ మిటమిటలాడి పోతూంది.

ఎవరు ఎంత ఆక్రోశించినా జరిగేదేమీ లేదు. ఆగేదీ ఏమీ వుండదు.

మనోరమ చొరవతీసుకుని లోపలికివెళ్ళి పొయ్యి రాజేసింది. కాని ఇంట్లో బియ్యం లేవనే సంగతి

ఆమెకు ఆతర్వాత తెలిసింది. అప్పుడామె ఇంటికి వెళ్ళి బియ్యం తీసుకువచ్చి వంటచేసి, పిల్లల్ని బుజ్జగించి, బ్రతిమాలి, నచ్చచెప్పి నాలుగు మెతుకులు తినిపించింది

నారాయణి ఒక్క మెతుకుకూడా ముట్టలేదు. మనోరమ కలగజేసుకుని "మీకు నేను చెప్పవలసిందాన్ని కాను. కాని ఇలా నిరాహారంగా వుండటం బాగుండలేదు" అంది.

"నేను బ్రతికి ఏమిటి సాధించాలి?"

"పరిస్థితిని బట్టి మీరలాగంటున్నారు. ఈ ఇద్దరి పిల్లల గతి ఏమికాను?"

నారాయణి అనూరాధని దగ్గరగా తీసుకుంది.

"వారికోసమైనా మీరు ధైర్యంగా వుండాలి. చిన్నపిల్లలు. మీరు దిగులుతో వుంటే వారూ నీరు కారిపోతారు."

అనూరాధ లేచి పెరటిలోకి వెళ్ళింది.

నారాయణి మనోరమ రెండు పాదాలూ గట్టిగా పట్టుకుని "నేనింతకన్నా ఏమీ చెప్పలేను మనోరమా. నీ రెండు పాదాలూ పట్టుకుని క్షమించమంటున్నాను. ఒకప్పుడు నువ్వన్నమాటలు నాకప్పుడు అర్ధంకాలేదు తల్లీ. ఇప్పుడు బాగా బోధపడింది. ఈ ప్రపంచంలో ఎలాంటి పరిస్థితుల్లోనైనా గౌరవంగా బ్రతికే అర్హత నీకుంది. నీకు ఈ ప్రపంచం ఎక్కడో ఒకచోట చోటు చూపిస్తుంది. జీవితం ఎదురు తిరిగి ప్రశ్నించటం అంటే ఏమిటో నాకిప్పుడు అర్థం అయింది. ఇప్పుడు అనుభవమైంది. నీముందు నిజం చెబుతున్నాను మనోరమా. మా సంసారం వీధిని పడింది. నేను తలదాచుకుందుకు జానెడుచోటు లేదు. నా అన్న దరిద్రుడు. వాడే ఒక పూట తింటే ఒక పూట పస్తులు పడుకుంటాడు. పిల్లా జల్లా వున్నవాడు. నా పిల్లలగతేంగాను! చేతిలో దమ్మిడీ లేదు. ఏమి చెయ్యను మనోరమా. నిన్ను అనరాని మాటలన్నాను. కాని దెబ్బతిన్నది నేను. నాకిప్పుడు అంతా అర్థం అయింది మనోరమా. పార్వతమ్మ ఏ స్థితిలో మా యింట అడుగుపెట్టిందో ఇప్పుడు నాకు అర్థంఅయింది" అంటూ ఆమె అక్కడే నేలమీదకు వొరిగిపోయింది.

నారాయణి శిరస్సుమీద చేతులు వుంచి "మీరు మిమ్మల్ని ఇలా తక్కువచేసుకుని ఇంత దీనంగా మాట్లాడటం నాకు బాధగా వుంది. మీకంటె చిన్నదాన్ని నా పాదాలు పట్టుకోవటం అంతకంటె బాధగా వుంది. నేను చెయ్యగలిగిన సహాయం అంతా చేస్తాను. మీరు దిగులుపడకండి" అంది మనోరమ.

"నాది ఒక్కటే ఒక్క కోరికమ్మా."

"అది నేను తీర్చగలనా?"

"అనూరాధని నీకు అప్పచెబుతున్నాను ఆమెను నీ యింటికి..."

మనోరమ అడ్డుపడుతూ "మీ వుద్దేశం నాకు అర్థం అయింది" అంది.

నారాయణి ఆత్రుతగా మనోరమ ముఖంలోకి చూసింది. పాతవన్నీ మర్చిపొమ్మని కోరుతున్నాను."

మనోరమ నారాయణి రెండు చేతులూ పుచ్చుకుని "ఇంతవరకూ నాకలాంటి వుద్దేశంలేదు. ఆ విషయం గురించి ఇప్పుడే ఆలోచిస్తున్నాను" అని ఆమె క్షణం మౌనంవహించి తర్వాత "నా మాట తమ్ముడు కాదనడు. ఆ నమ్మకం నాకుంది. అనూరాధ మా యింట మసలటం మా అదృష్టం. నాకు సమ్మతమేనమ్మా" అంది.

నారాయణి కళ్ళ వెంట అశ్రువులు జలజల రాలాయి.

కాని ఆ తెల్లవారుఝామునే ఎవరితో చెప్పి పెట్టకుండా చేతిలో దమ్మిడీఅయినా లేకుండానే ఆమె యిల్లు విడిచి వెళ్ళిపోయింది.

ఏడ్చి ఏడ్చి మనసు రాయిచేసుకుంది అనూరాధ. వారు ఆమె ఎక్కడ వున్నదీ తెలుసుకోవటంకోసం చేయవలసిందంతా చేసారు. కాని ఆమె జాడ ఎవరికీ తెలియలేదు. ఆమె ఏమయిందో వూహించటం కూడా చాలా కష్టం. పార్వతమ్మ ఏమయిందో ఎవరూ చెప్పలేనట్టే నారాయణి గురించీ అంతే.

"వెళ్ళిపోతూ ఆమె చిన్న చీటీ ముక్కయినా రాసిపోలేదు" అని శేఖరం అన్న మాటకి అనూరాధ అస్వస్థత రేకెత్తించిన దుఃఖంతో భర్త వక్షంమీద తల ఆనించి "మా అమ్మకి ఆపాటి భాష రాదు. చదవటం రాదు. రాయటం అంతకంటె రాదు. మీ కీ విషయం తెలియదా?" అంది.

# శ్రీ శాంతిదేవి విచిత్ర జాతకములు

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఒకవిధముగా చూచినచో, పూర్వజన్మము కూడా ఒక స్వప్నమువంటిదే. కొంత భేదము లేక పోలేదు. ఇంద్రియములు ఏ క్షణమున తమ పనుల మానుకొనునో, అపుడు పూర్వజన్మము అంతమొందు చున్నది. ఇంద్రియములు తమ కార్యముల నారంభించిన క్షణమందే, స్వప్నము అంతమొందును. స్వప్నము నిద్రలో వచ్చును. పూర్వజన్మము దీర్ఘనిద్రతో ముగియును. ఇది తారతమ్యము.

సాధారణముగా, అనేక దినములలో మనకు స్వప్నములు వచ్చుచున్నవి. కాని, మెలకువ వచ్చినంతనే, ఇంద్రజాలమునందలి దృశ్యములవలే, ఆస్వప్నరంగములు మాయమగుచున్నవి. తరువాత ఆ స్వప్నములందలి కథలు మనకేమియు స్ఫురణకు రావు. ఇది సామాన్యానుభవము. అయినా, ఏవో కొన్ని స్వప్నానుభవములు మాత్రము చాలకాలము జ్ఞప్తిలో నుండుట కలదు. అందలి రంగముల స్వరూపములు, సన్నివేశములు, వ్యక్తుల చేష్టలు, సంభాషణములు, మున్నగునవి స్పష్టముగా మనస్సున నిలిచి, ఒక్కొకమారు అవి స్వప్నకథలుకాక వాస్తవానుభవములేమో, అని తోచుట పయితము సంభవించుచుండును.

కాని, పూర్వజన్మవృత్తాంతము ఏ కొంచెమైనా మనకు జ్ఞాపకముండదు. ఎందుకో మరి! ఒక్కొకమారు, మనము ఈ జన్మములో చూచియుండని స్థలములు, పరిచయములేని వ్యక్తులు, ఎరుగని సన్నివేశములు స్వప్నములలో చూచుచుందుముకదా! ఒకవేళ, అవి పూర్వజన్మానుభవమునకు సంబంధించినవేమో? ఏల కారాదు? కాని, తెలుసుకొనుమార్గము లేదు. మహానుభావులకు యోగులకు పూర్వజన్మజ్ఞానము సాధ్యముకావచ్చునందురు. మనబోటి సామాన్యులకు అది అందరానిపండు. అయినా, పూర్వజన్మజ్ఞానము కలవారు, ఏ కోటికొక్కరో, అందందు పుట్టుచుందురట! అట్టి అపూర్వమేధాప్రభావము కలది శ్రీ శాంతిదేవి.

ఈమె దేహళీనగరమునందలి ఒకానొక వ్యాపారి కూతురు. 18-1-1902 నాడు, 9-53 Am (IST) కాలములో, ఈమె జనించుట. విశేషమేమియు లేక, సామాన్య శిశువులవలెనే ఈమె పెరుగుచు వచ్చినది. కాని, మూడునాలుగు సంవత్సరముల వయస్సులో, తోడిపిల్లలతో ఆడుకొను వేళలలో, తన కుమారుడు మథురానగరమునందున్నాడని, వానిని చూచుటకు పోవలెనని, అపుడపుడు చెప్పుచుండెడిది. ఆ మాటలు పిల్లతనంపు పిచ్చి చేష్టలుగా, విన్నవారు భావించెడివారు. కొందరికి ఇది మంచి వినోదము. ఇది ఆమె పూర్వజన్మవృత్తాంతమని ఊహించినవారు లేరు.

శాంతిదేవికి ఎనిమిది సంవత్సరముల వయస్సు వచ్చినది. మథురానగరమును, తనకుమారుని ఆమె మరచిపోలేదు. నవ్వులాటకు నీ భర్త ఎవరని ప్రశ్నించగా, సిగ్గుపడుచు మెల్లగ, మథురలో శ్రీ పండిత కేదారనాథుడని ఆ అనాయకురాలు ప్రతివచ్చెడిదట! ఆమె చినతాతగారగు శ్రీ ఆచార్య కిషన్‌చంద్ ఈ విచిత్రమును గమనించి, దీని తత్త్వమును పరిశోధింపగోరి, ఆమె చెప్పిన గుర్తుల ఆధారముపైన మథురకు ఒక లేఖ వ్రాసినాడు. శాంతిదేవి చెప్పుచున్న విషయములు అందు వ్రాయబడినవి. మథురలో పండిత కేదారనాథునికి ఆ లేఖ చేరగా, అతడాశ్చర్యపడినాడు. అతని భార్య 25-9-1925 నాడు ఉదయము 10 గంటలకు కుమారుని ప్రసవించి, 9 దినములకే 4-10-1925 వ తేదిన ఈ లోకమును చాలించుకొని యుండినది. మాతృహీనుడైన కుమారుని కేదారనాథుడు సంరక్షించుచుండెను. ఆ చిన్నవానికి ఇపుడు పది సంవత్సరముల వయస్సు.

ఢిల్లీనుండివచ్చిన లేఖయందలి విషయముల నతడు నమ్మలేదు. ఏదో మోసమో, కుతంత్రమో కావచ్చునని భావించి, ప్రత్యక్షముగా చూచి వాస్తవస్థితిని తెలుపుమని, ఢిల్లీలోనున్న తనస్నేహితునికి కేదార

నాథుడు వ్రాసెను. ఆ మిత్రుడు శాంతిదేవి ఇంటికి పోయి, ఆమెతో మాటలాడి, పెద్దలను విచారించి, అంతా సత్యమే అని ప్రతివ్రాసినాడు. ఈ వింతను చూడవలెనని పండిత కేదారనాథుడు కుతూహలపడి, తనకుమారుని తోడ్కొని ఢిల్లీకివచ్చి, శాంతిదేవి ఇంటికిపోయి చూడగా, అచటి దృశ్యమునకు అతడు స్తంభించిపోయినాడు. కుమారుని చూచినదే తడవుగ తటాలున శాంతిదేవి వానియొద్దకు పరుగెత్తి, అతనిని పొదివి కౌగలించుకొని, వెక్కి వెక్కి ఏడ్చుచు, మాతృవాత్సల్యముట్టిపడు ముగ్ధమధుర వాక్యములతో గద్గద స్వరమున అతనిని లాలించసాగినదట! తన భార్య పురుటింటిలో శిశువును లాలించినపుడు ఆమె ఉపయోగించిన పదములే శాంతిదేవి ఉచ్చరించుట విని అతడు భ్రాంతుడైనాడు. తరువాత కేదారనాథునివైపు తిరిగి అతనిని చూచినపుడు, శాంతిదేవి లజ్జావనతవదనయై తనురీతి అవకుంఠనమును సవరించుకొని భయభక్తులతో అతని పాదములకు నమస్కరించి కొంతమాటున నిలిచినది. ముక్కుపచ్చలారని కన్యక, మునుపెన్నడు గాని తన్ను చూచి ఎరుగనిది, ఆకస్మికదర్శన సమయమున, తొల్లి తన భార్య చూపుచుండిన పద్ధతిలో తన్ను గౌరవించుట చూచి కేదారనాథుడు ముగ్ధుడైనాడు. అప్పటి అతని భావములు వర్ణింప నలవిగానివి.

కాని, కేదారనాథునికి గొప్ప చిక్కు వచ్చినది. అతడు నివసించుచుండుట స్వప్నప్రపంచములో కాదు. కుమారుడు తనయొద్దనే నిలువవలెనని శాంతిదేవి కోరినది. సాంఘిక నైతికాదికారణములవలన అది సాధ్యము కానిపని. ఏదో ప్రయాసపడి మరుదిన మతడు తన కుమారుని తోడ్కొని మధురాపురి చేరుకొనెను.

ఇది అంతా గ్రహచేష్ట అన్నవారు కొందరు; ఉత్పాతమని భయపడినవారు కొందరు; పిల్లతనపు కొంటె చేష్ట అని నవ్వుకొన్నవారు మరికొందరు. కాని, దీని లోతుపాతులు పరిశోధించవలెనని కొందరు విద్యాధికులు పూనుకొన్నారు. శాసనసభ్యుడు కీ. శే. దేశబంధుగుప్త, ప్రసిద్ధ న్యాయవాది శ్రీ తారాచంద్, ప్రముఖులు కొందరు కలియపలుకుకొని, శాంతిదేవిని రైలుబండిలో మధురకు కొనిపోయిరి. ఆ నగరపు రైలుస్టేషన్ సమీపించగా, మధురానాథ దేవాలయపు గోపురమును ఆమె గుర్తించి చేతులు మోడ్చినది. టాంగాలో కూర్చుండబెట్టగా, ఈజన్మములో కని, విని, ఎరుగనట్టి బాటలలో, సందులలో, టాంగా నడుపు వానికి త్రోవ చెప్పుచు, తుదకు ఒక యింటిముందు నిలిపి, "ఇదే నేనుండిన ఇల్లు." అని శాంతిదేవి టాంగా దిగినది. ఎన్నాళ్ళనుగానో కోరుచుండినది నేటికి ఫలించినందుకు కలిగిన సంతోషముతో ఆమె ముఖము అపూర్వశోభతో వికసించినది. కాని, "నేనుండినపుడు ఇంటికి పసుపురంగు పూసి యుండిరి. ఇప్పటివలె తెల్లరంగు కాదు." అని ఆమె ఆశ్చర్యమును ప్రకటించెనట! విచారించగా, ఆ ఇంటిలో అపుడితరు లెవరో కాపురము చేరియుండిరనియు, కేదారనాథుడు వేరొక ఇంటిలో నివసించుచుండెననియు తేలినది. ప్రేక్షకులలోనున్న కేదారనాథుడు తాను మునుపు కాపురముండిన ఇంటిని, ప్రసవగృహమును, ఇతరు లెరుగని మరికొన్ని గురుతులను సహా, ఏ సందేహముకాని లేక, శాంతిదేవి స్పష్టముగా చూపగల్గుటకు మహాశ్చర్యము పాలయినాడు. ఆ పట్టణమందే శాంతిదేవి పుట్టినిల్లు. ఆమె అచటికివెళ్ళి, వార్ధకములో వంగియుండిన తన పూర్వజన్మపు తల్లికి నమస్కరించి 'అమ్మా' అని కుశలప్రశ్న చేసినపుడు ఆ వృద్ధురాలిముఖమున విషాద, వాత్సల్య, సంతోష, సంభ్రమాది భావపరంపరలు చిందులు ద్రొక్కినవి. ఆ దృశ్యము మరువరానిది.

శాంతిదేవి చెప్పెడి కథ అంతా సత్యమని పరిశోధక సంఘమువారు తగినంత సాక్ష్యమువలన నిర్ధరించి, ఆ మరుదినము ఆమెను ఢిల్లీలో స్వస్థానము చేర్చిరి. ఈ కథ అంతయు వారు చిన్న పుస్తక రూపమున, ఆమె ఛాయాచిత్రములతోసహా, ప్రకటించినారు.

అత్యాశ్చర్యకరమైన ఈ కథ త్వరలో దేశమున వ్యాపించినది. అనేకులు శాంతిదేవిని చూచుటకు రానారంభించిరి. ఆమె తల్లితండ్రుల కిది రుచించలేదు. ఆమె పూర్వజన్మ చరిత్రమునకు హెచ్చుప్రాచుర్యము వచ్చినచో, సాంఘిక కారణములవలన, శాంతిదేవి పెరిగి పెద్దదయిన తరువాత చిక్కులు సంభవించగలవని వా రూహించుట తప్పుకాదు. ఆ కారణమున చాల వరకు ఆమె ప్రాచుర్యమును తప్పించుకొని యుండ సాగెను. పూర్వజన్మానుభవముల జ్ఞాపకశక్తి నశించి పోయినదనుమాటసహా పుట్టినది. క్రమముగా, జనులిది మరచిపోయిరి. తగిన వయస్సులో శాంతిదేవికి వివాహమైనది. ఈ జన్మపు భర్తతో ప్రశాంతముగా, సంతోషముగా ఆమె ఇప్పుడు కాపురము సాగించుచున్నది.

# శ్రీ శాంతిదేవి విచిత్రజాతకములు

శాంతిదేవి ఇప్పుడు 32 సంవత్సరముల ప్రాయము గల గృహిణి. నాలుగేండ్లనాడు శ్రీ టి. యం. తాల్గిరి ఎం. ఏ., అను విద్యాధికుడు ఆమెను చూచి పూర్వజన్మ చరిత్రము జ్ఞాపకమున్నదా యని ప్రశ్నించెను. తోడనే ఆమె దృష్టి బాహ్యప్రపంచ జ్ఞానశూన్యతను చూపసాగెనట.

"నా పూర్వజన్మపు చరిత్రము, ఏడాది క్రిందనో పదిసంవత్సరముల పూర్వమో జరిగిన విషయములు జ్ఞప్తిలో నున్నట్లు నాకు జ్ఞాపకమున్నవి. అప్పటి దృశ్యములు, రుచులు, వాసనలు, శబ్దములు, అన్నియు నా అంతరంగములో నిలిచి ఊడలుబారుకొన్నవి. నేటికి కూడా అల్లేయున్నవి" అని ఆమె ప్రతి ఇచ్చినదట?

"అప్పటి భర్తతో, కుమారునితో, కలిసి యుండు కోరిక లేదా?" అని అతడు, కొంత కొంటెగా అడిగినాడు. ఆమె చిరునవ్వుతో ఇట్లు చెప్పినది.

"లేదు. నా ఇప్పటి పరిస్థితులతో నా భావములను సమన్వయపరచుకొన్నాను. నా మనస్సు సంపూర్ణముగా సమాధానపడి యున్నది."

శాంతిదేవి సాధించిన మనశ్శాంతి అనన్యసామాన్యము. యోగులు సైతము సాధించగలరో లేదో? ఆమె మనోనిగ్రహమునకు విలువ కట్టజాలము. ఆమె పూర్వజన్మ సుకృత ఫలమది. (*)

అది యట్లుండె. గతించిన వ్యక్తి స్వప్నములో చూపట్టి, తానొక స్త్రీకి సంతానముగా జనింతునని చెప్పుటయు, ఆప్రకారము ఆమె కట్లు సంతానము కల్గుటయు, అందందు వినుచున్నాము. కాని, ఆ గతించిన వ్యక్తియే ఆశిశువుగా అవతరించినదనుటకు మనకు ఇతర సాక్ష్యము కానరాదు. ఆశిశువునకు పూర్వజన్మ జ్ఞానము ఉండదు. శాంతిదేవి కథ అట్టిది కాదు. పూర్వజన్మ పునర్జన్మములకు తగినంత సాక్ష్యమున్నది కదా? ఇదె ఇందలి వైశిష్ట్యము.

ఇట్టి దృష్టాంతము చాలా అపురూపమైనది. జ్యోతిశ్శాస్త్ర దృష్టితో దీనికి గొప్పవిలువ కలదు. పూర్వజన్మపు జాతకమునకు పునర్జన్మజాతకముతో ఏమైనా సంబంధము కలదా? ఉన్నచో, ఎట్టిది? జన్మావసానముతో జాతకపు విలువ ముగియుచున్నదా? లేక, పునర్జన్మము వచ్చువరకు దాని దశలకు ఫలసూచకత్వము నిలిచియుండునా? ఇత్యాదిగా అనేక విషయములను గూర్చి పరిశోధన చేయగోరువారికి ఈ దృష్టాంతము అతి ముఖ్యమైనదని వేరుగా విన్నవించుట అనవసరము. కనుక శాంతిదేవి జన్మద్వయముయొక్క జాతకములను చూపి, వానినుండి మనకు పై ప్రశ్నలకు ఎట్టి సమాధానము లభించగలదో, ఆంధ్ర మహాజనులకు విన్నవించుటకు ప్రయత్నించెదను.

1902 జనవరి, 18 తేదీన మధురలో 9-53 A. M. (I. S. T.) కాలములో ఆమెకు పూర్వజన్మముకల్గుట. ఇదే అప్పటికి సాయన జాతకచక్రము.

| | | | |
|---|---|---|---|
| I 16-15<br>ప్రసవ 4-17<br>శు 2-23 | | చ 8-58<br>కే 9-54 | య 16-56(వ)<br>పుణ్య 28-3<br>మృత్యు 28-36<br>ఇంద్ర 29-21 |
| కు 12-47<br>బు 7-26 | సాయనము<br>—<br>శ్రీ శాంతిదేవి<br>పూర్వజన్మ<br>జాతకము<br>— | | |
| ర 27-10-1<br>గు 25-26 | | | |
| X 21-1<br>వరుణ 19-23 | రా 9-34 | | |

కేంద్రములలో శుభగ్రహములులేవు. శుక్రుడు తనుభావములో ప్రవేశించుచున్నాడు, వాస్తవమే. కాని, అష్టమ (మృత్యు) స్థానాధిపత్యమువలన అతని నుండి సత్ఫలములురాదు. వరుణుని సమసప్తక వేధలో క్రూరుడగు యముడు చతుర్థభావములో నుండుట. పుణ్యసహమము మృత్యు సహమముతో ఐక్యమగు

---

(*) శ్రీ తాల్గిరిగారు శ్రీ శాంతిదేవిని చూచి మాటలాడిన విషయములు వివరముగా ఒక వ్యాసరూపమున ప్రకటించినాడు. బెంగుళూరులో ప్రకటించబడుచున్న "అస్ట్రాలాజికల్ మ్యాగజైన్" అనబడు జ్యోతిష మాసపత్రికలో 1957 జనవరి నెల సంచికలోని 85 వ పుటలో ఆవ్యాసముకలదు. దానినుండి పై విషయములు కృతజ్ఞతతో స్వీకరించబడినవి.

చున్నది. ఈ రెండును మాయదారి ఇంద్రుని కుట్రకు లోబడినవే. పంచమ (సంతాన) స్థానాధిపతిచంద్రుడు మోక్షకారకుడగు కేతువుతో చేరుకొని వ్యయస్థానము నందున్న కుజుని క్రూరకేంద్రదృష్టిని అభిలషించు చున్నాడు. ఇది అల్పాయుర్దాయజాతకమని, పుట్టుడు వచ్చినప్పుడే ప్రమాదమున్నదని, యీ యోగములు చాటుచున్నవి. పంచమభావముమీద శనియొక్క విషమదృష్టిగలదు. ప్రసవసహముము ఆ శనితోనే అర్ధ కేంద్రము. పై యోగములకు ఇవి చేయూత.

1925 సెప్టెంబరు 25 వ తేదీనాడు పగలు 10 గంటలకు జాతకురాలు కుమారుని ప్రసవించెననియు, 9 దినములకే (4 10-1925) ఆమె అకాలమృత్యువు పాలయ్యెననియు విన్నాము. జాతకయోగములకు తగి నట్లే యున్నది కథ.

జన్మనక్షత్రము భరణి: పుట్టినప్పుడు శుక్రమహా దశ! కాని, అయనాంశల విషయమునకల అవ్యవస్థవలన దశాశేషమింతేఅని నికరముగా చెప్పుట కష్టము. మర ణము చంద్రదశలో జరిగినది. కాని శని అంతరములో అని కొందరు, రాహ్వంతరములో అని మరికొందరు. చంద్రాంతరములోనే అని వేరుకొందరు వాదింతురు. ఏది సత్యమో, ఆ పరాశరునికే ఎరుక.

పోనిత్తురు. దేవసూనదశలో ఇట్టి అవ్యవస్థా ప్రసంగమునకు అవకాశము లేదు. అప్పటి చలితకుండలి ఇది:—

| | | | |
|---|---|---|---|
| చ 20-0<br>బు 5-22 (వ)<br>కు 1-28 | I 19-30 | కే 8-21 | యమ 16-42 |
| శు 27-52 (వ)<br>ర 21-10<br>గు 0-56 | సాయనము<br>—<br>శాంతి దేవి<br>పూర్వజన్మపు<br>చలిత జాతకము<br>—<br>(1925 అక్టోబరుకు)<br>— | | పుణ్య 19-15<br>మృత్యు 19-30 |
| శ 22 28<br>X 12-45 | | | |
| వరుణ 20-27 | రా 8-21 | | |

ఇందలిదశావిశేషముల సూచనలు చిత్తగింపుడు:

(i) వరుణుని త్రికోణదృష్టిలోనున్న చలిత లగ్నము జన్మశని కేంద్రవేధపాలయినది;

(ii) చలిత చంద్రునికి భయంకరమైన వరుణుని కేంద్రవేధ;

(iii) చలితచతుర్థ భావమునకు (పర్యవసానము) అష్టమాధిపతి శుక్రుని చలితస్థానమునుండి సార్ధకేంద్ర క్రూరదృష్టి;

(iv) ఒకవైపున శనిపై, మరియొక్కవైపున చలిత పుణ్యసహముములపై, చలితలగ్నము తులా భారము తూగుచున్నది;

(v) రోగస్థానాధిపతి రవికిని, మృత్యుస్థానాధి పతి శుక్రునికిని, సరిసరిగా చలిత పంచమభావము తట పటాయించుచుండుట;

(vi) చతుర్థాధిపతి బుధుడు చలించి మీన రాశిలో 5°-21′ లో అప్పుడే వక్రించినాడు. ప్రసవ సహముమును అంగుకొనబోవుచు, ఆ బుధుడు శనితో అర్ధకేంద్రస్థితిని, మృత్యుసహముములతో సార్ధకేంద్ర స్థితినిసహా, సంపాదించుకొన్నాడు;

(vii) బుధునికి ఏమిగతిపట్టెనో, కనుగొంటిమి! ఆ బుధుని జన్మస్థానమునకు, చలితస్థితికిని, నికరముగా, సరిసరిగా నే చలితరవి యుండుట దైవదుర్విపాకము!

ఉదయ, రవి, శశాంకులనబడు ఆయువుపట్లు మూడును వేధపాలయినవి. ఇతర చలితదశలు పరిస్థితు లను సమకూర్చినవి. ఇంకేమి కావలయును? సందేహ మునకు అవకాశమునీయని దశలుకాదా ఇవి? వింశోత్తరీ దశలోనున్న అవ్యవస్థ ఇచట లేదు.

జాతకురాలి అవతారసమాప్తికాలము తెలియ లేదు. అది లభించియుండినచో, ఎంతో పనికివచ్చి యుండెడిది. పోనిండు. 4-10-1925 నాటికి గుణించిన దినజాతకము గమనింతము. ఏమివిశేషములు చూపట్ట గలవో?

[దినజాతకకుండలి—చూ. 51 పేజీ 1 వ కాలం]

దశలో బుధుడు చెడి చేతాకులపాలయి యుండుట కనుగొంటిమి. ఆ బుధునికే ఇచటి లగ్నాధి పత్యము వచ్చుట విధి. మృత్యు (viii) స్థానాధిపతి యైన కుజునిచుట్టి, వ్యయాధిపతియగు పరమనీచరవి పాలికే ఈ బుధుడు పోవుచుండుట! రక్తదోషమువలన, పురిటింటిలో మరణమును ఈ యోగము ప్రేలితో

| | | | |
|---|---|---|---|
| వరుణ 22-50 | VIII 5-30<br>చ 29-21 | | X 4-41 |
| కే 1-3 | సాయనము<br>—<br>శాంతిదేవి<br>పూర్వ జన్మావసానమునకు<br>దిన జాతకము<br>—<br>తేదీ:—4-10-1925<br>దినారంభ కాలము:—<br>3-41-46 A.M. (I.S.T) | | యము 14-41 |
| గు 13-38 | | | రా 1-3<br>ఇంద్ర 24-0 |
| | శ 12-43<br>శు 20-50 | కు 3 12<br>బు 7-10<br>ర 10-10-1 | I 5-53<br>ఆ శ 14-0 |

| | | | |
|---|---|---|---|
| వరుణ 25-32<br>చ 5-34 | I 5-47 | కు 4-39 | పుణ్య 22-49 |
| | సాయనము<br>—<br>శాంతిదేవి<br>పునర్జన్మ<br>జాతకము<br>— | | రా 8-4<br>యము 15-22<br>(వ) |
| కే 8-4<br>X 3-45 | | | ఇంద్ర 26-57<br>(వ) |
| శు 23-22<br>ర 18 32<br>శ 0-59 | బు 27-44 | | |

చూపుచున్నది. కాని, దీనిలో పాఠకమహాశయులు ముఖ్యముగా గమనించదగిన అంశమొక్కటి కలదు. జాతకములో ప్రసవసహాయమును చేరి వక్రించి, ప్రబల క్రూరవేధపాలై యున్న చలితబుధుడు అస్తమించు భాగలోనే ఈ దినజాతకలగ్నము 'తిష్ఠ' వేసియుండుట! ఇది ఆకస్మికమనరాదు.

భూమండలముయొక్క పరిభ్రమణగతిపై ఆధారపడిన 'దినజాతకము' లో పైసూచనలు చూపబడినవి. ఇక దాని (భూమండలపు) చక్రభ్రమణగతిపై ఆధారపడిన 'దైనిక జాతకము' ఏమి సూచించునో, చూతము. దైనిక దశమకేంద్ర మానాడు కన్యారాశి 5° భాగలో, ఆ చలితబుధునికి ఎదురైయున్నది! దైనిక జాతకమందలి పంచమ స్థానబింబువు నికరముగా దినజాతకపు మృత్యుభావముపైకేవచ్చి, మృత్యుస్థానాధిపతి కుజుని ప్రబల సమసప్తక వేధపాలైనది! కాలపురుషుని మహిమ!

ఇది ఇట్లుంచి, పునర్జన్మపు (ఇప్పటి) జాతకమేమనుచున్నదో కొంత పరికింతము. శ్రీ శాంతిదేవి 11-12-1926 నాడు మధ్యాహ్నము 1-40 P. M. వేళలో ఢిల్లీలో జనించెనట! ఆధాన కాలపద్ధతి నుపయోగించి శోధించగా, శుద్ధ స్పష్టజన్మకాలము 1-19' 49" P. M. (I.S T.) గా ఏర్పడగలదు. అనగా, ఉపదిష్టకాలముకంటే, 20 నిమిషములు వెనుకనే జననమనుట. సాధారణముగా నమ్మరాదనిపించు వ్యత్యాసము కాదది. జీవితానుభవములను దైనిక జాతకాద్యప్రమాణములచే ఇది చూపగలదు గనుక, దీనిననుసరించి జాతకము సాధించబడినది.

ఇచట, శక్తిమంతమైన మేషము లగ్నము. లగ్నాధిపతి కుజుడు చతుర్థాధిపతి చంద్రునితో నిండు మిత్రదృష్టిలో నున్నాడు. కుటుంబ సప్తమాధిపతి శుక్రుడు రాజ్యభావములో ధర్మస్థానాధిపతి యగు బృహస్పతియొక్కయు, ఇంద్రునియొక్కయు శుభదృష్టి కలిగి వెలుగుచున్నాడు. పంచమాధిపతి రవి కర్మస్థానములో కలడు. శాంతి, సుఖ, సౌభాగ్యములతో గృహిణీత్వము జరుగగలదని సూచించు యోగములివి. భర్తృస్థానాధిపతి శుక్రునిపై విప్లవకారకుడగు వరుణునికి గల అశుభ కేంద్రదృష్టి వియోగక్లేశమునో, వైరశ్యమునో చూపగలదు. కాని, ధర్మాధిపతి గురువు శుభదృష్టి శుక్రునికి కలదు కావున, లోపము లేనైనా కలిగినా, చక్కబడగలవు. అది యట్లుండనిండు.

మనమీ జాతకమున ముఖ్యముగా గమనింపవలసినది మేధాకారకుడగు బుధుడు. రహస్యప్రియుడగు వృశ్చికరాశిలో అపరిహార్య పురాకృత కర్మానుభవమును సూచించు 28° వ భాగలో ఆ బుధుడుండుట! పోతే, విప్లవప్రియుడగు వరుణునినుండియు, జాతిప్రియుడగు ఇంద్రునినుండియు ఈ బుధునిపైన దృష్టి వచ్చుచున్నది. అసాధారణమగు సూక్ష్మ విషయ

గ్రహణశక్తి, ఇంద్రియములకు సాధ్యముకాని అంతరంగిక రహస్యములను కనుగొనుచాతుర్యము, స్వప్నకథలను స్పష్టముగా జ్ఞప్తిలో నుంచుకోగల శక్తి, ఇవి ఇంద్రుని వరప్రసాదము. సాధారణముగా ఉపరిప్లవముగా వ్యాపించు బుద్ధి బుధునిది. యితనికి వరుణుని సహాయసంపత్తి లభించెనేని, ఉపజ్ఞాయుతమై, నవనవోన్మేషభాసురమై, బుధుని ప్రజ్ఞ ప్రతిభగా మారి, అసాధారణమైన విషయములలో అత్యున్నత స్థాయిలో తన ప్రభావమును చూపగలదు. ఇచట ఇంద్రావరుణుల అప్రమేయశక్తి బుధునిలో మేళవించి స్వప్నజ్ఞానమును పూర్వజన్మజ్ఞానముగా పరిణమింపజేసినది. బుధుడు ఉండు భాగ పూర్వజన్మసంస్కారముతో సన్నిహిత సంబంధము కలది కదా?

కాని, ఇంతమాత్రము చాలునా? చాలుననుట సాహసము. ప్రశంసాదిన ప్రాంతమున పుట్టిన వేలకొలది జనులకు ఈ యోగము లభించును. కాని శాంతిదేవికంటి దృష్టాంతము వేరొకటి వినము. ఈ బుధునిలో ఒక అసాధారణమగు శక్తి ఇమిడియున్నదనుట వాస్తవమే. కాని, దానిని ఉపయోగించుకొనవలసిన వారు వ్యక్తులు. ఉపయోగించుకొననిచో "అంగడిలో అష్టభాగ్యము; అల్లునినోట శనైశ్చరుడు." అను సామెతయగును. ఇట్టి సమస్యలలో ముఖ్యముగా మనము వ్యక్తియొక్క లగ్నమును, చంద్రునిసహా, చూడవలసియుండును. ఇందుకొరకై ఒక్క జన్మకుండలి మాత్రముకాక, ఆధానకాలచక్రముసహా, గమనించక తీరదు. పూర్వజన్మావసానమున నిలిచిన ఉత్కటి కాంక్షాశేషములు ప్రారబ్ధకర్మసహాయమున ఈ జన్మమునకు కారణమగుననియు, పతయాళువైన స్థూలదేహమును విసర్జించి కాంక్షారూపమగు సూక్ష్మదేహము నాశ్రయించియుండిన జీవుడు మరల పాంచభౌతికదేహమును ప్రవేశించుట కారంభించు క్షణమే ఆధానకాలమగుటచే, అప్పటి గ్రహస్థితి ఆ జీవుని ఆశలు, ఉద్దేశములు తెలుపుననియు వానికి కలుగు సౌకర్యాసౌకర్యములు, ఫలములు, జన్మజాతకము సూచించుననియు, పెద్దలు చెప్పుదురు. శాంతిదేవి జీవితమున ఈ సూత్రమున కెంత విలువయున్నదో పరిశీలింతము.

శుక్లపక్షు చంద్రుడు దృశ్యార్థగోళములో నుండగా కలిగిన స్త్రీజనన మిది. లగ్నము, చంద్రుడు సహా, స్త్రీలింగ ద్యోతకములగు భచక్రభాగలలో నుండుట. అగుటచే, జననమునకు పూర్వము పదినక్షత్ర మాసముల ప్రాంతములో, ఏనాడు, ఏ క్షణమున, జన్మలగ్న, జన్మ చంద్ర స్థానములు పరివర్తనయోగమును పొందునో, అదే ఆధానకాలము. 14/15-3-1926 వ తేదీన, 5-43'-36'' A. m. (I. S. T) కాలములో ఆధానకాలమని తేలినది. అప్పటికి సాధించిన చక్రమిది :—

| | | | |
|---|---|---|---|
| వరుణ 25 21<br>ర 23-39-59<br>I 5-34 | చ 5-47<br>బు 12-9 | | |
| గు 15-43<br>శు 14-28 | సాయనము<br>—<br>శాంతిదేవి<br>ఆధానకాల<br>చక్రము | | యము 12-37<br>రా 22-25 |
| కు 24-21<br>కే 22-25 | | | ఇంద్ర 22-36 |
| సంతాన<br>15-30<br>X 13-57 | శ 26-0 | | |

భచక్రములో ఏయే భాగ ఏ విషయమును సూచించునను విషయమున పరిశోధనముల సలిపిన పాశ్చాత్య పండితులు కన్యామీనములలో 4° భాగ "అంతఃకరణ"ము (Sixth-sense) తెలుపుననిరి. అతీంద్రియజ్ఞానమును ఈ భాగ సూచించుననుట. కన్యారాశిలో 6° వ భాగను అత్యద్భుతమగు విషయగ్రహణశక్తి యున్నదని 'బార్ బెల్' అను శాస్త్రజ్ఞుని మతము. ఈ భాగలలో లగ్నమో, చంద్రుడో, ఉండి, అతీంద్రియజ్ఞానకారకులగు గ్రహముల ప్రబల సంబంధముకలిగెనేని అట్టి జాతకునికి గొప్పఅతీంద్రియ జ్ఞానము (Intuition) వచ్చుట కష్టము కాదు. ఆ జ్ఞానము ఏ విషయములలో వ్యాప్తికి వచ్చునో, ఆ జాతకపు మొత్తపు యోగ్యత ననుసరించి యుండగలదు.

ఈ క్రింది ఉదాహరణముల చూడుడు :—

(1) హృషీకేశమందు ప్రసిద్ధిగాంచి యున్న శ్రీ స్వామి శివానందజీ కన్యారాశి 4° లో జనించిన

వ్యక్తి. లగ్నము పుణ్యసహమమునకు నిండుకోణములో యమునికి నిండు కేంద్రములోనున్నది. ఆధ్యాత్మదృష్టిని సూచించుభాగలో నున్న వరుణగ్రహము అతీంద్రియ జ్ఞానము ఏ మార్గము నాశ్రయించియున్నదో సూచించును.

(2) విద్యుద్వేగముతో గణితము చేయగల విదుషీమణి యని (Lightning Mathematician) ఖ్యాతిగాంచిన శ్రీమతి బెంగుళూరి శకుంతల మీనరాశి 5° లో జనించినది. కన్యారాశి 5° లో కూర్చుండి మాయావి ఇంద్రుడు లగ్నమును చూచుచున్నాడు. గణితశాస్త్ర పట్టభద్రులు గంటలకొలది ప్రయాసపడి చేయవలసిన లెక్కలు త్రుటికాలములో ఎట్లు చేయగలుగుచున్నావని, 12-వ సంవత్సరపు పాలవయస్సులో ఆమెను ప్రశ్నించగా, చిరునవ్వుతో, "నేను గణితమేమీ చేయను. లెక్కకు ఉత్తరము నామనస్సునకు స్ఫురించుచున్నది. నేను దానిని వ్రాసెదను. అంతే" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఇంద్రగ్రహముయొక్క ఐంద్రజాలికశక్తి అది.

మరికొన్ని దృష్టాంతములు చూపవచ్చును. కాని ఇప్పటికి ఇవి చాలు. శాంతిదేవి జాతకము యీ విశిష్ట భాగము నెట్లు ఉపయోగించుకొన గలిగెనో పరిశీలింతము.

పూర్వజన్మావసానదినమునకు సిద్ధపరచిన ఒక జాతకముతో మన చర్చ నారంభింతముగాక. కన్యారాశిలో 5°-53' అందలి లగ్నముండుట మనము గమనించదగినది. అతీంద్రియ దృష్టికి సంబంధించిన ప్రదేశము గదా ఇది? ఆ జాతకములో అష్టమభావము (మృత్యుస్థానము) మేషరాశిలో 5°-30'లో నున్నది. 'అపూర్ణ కామములు' తెలుపుభాగ ఇది. ఈ సంబంధములు మనస్సులో నుంచుకొని, ఇపుడు ఆధానకాల చక్రముపై దృష్టిబరపుడు. 'అపూర్ణకామ'ముల భాగలోనే ఆధానచంద్రుడున్నాడు! ఆధానలగ్నము మీనరాశిలో 5° 34' లో నున్నది. ప్రాణావసాన దిన జాతకమున లగ్నమెచట అస్తమించెనో, అనగా, భౌతికదేహము ఎచట అంతర్ధానము నొందెనో, సాక్షాత్తుగా, అచటనే ఆధానకాలములో భౌతిక దేహోత్పత్తికి బీజావాపము జరిగినదనుట !

పూర్వజన్మపు చలితజాతకములో 1925 వ సంవత్సరమున బుధుడు వక్రించెనని కనుగొన్నాము. ఏ చోట వరుణుడొకవైపున, తానొకవైపున, జన్మరవిపై తులాభారము తూగగలరో, నికరముగా ఆచోటనే బుధుడు వక్రించుట, అనగా అంతర్ముఖుడగుట! ఆబుధ స్థానమందే ఆధానలగ్నము, అది అతీంద్రియదృష్టిభాగ! ఇంతేకాదు. ఆధానలగ్నము గురువరుణాల సరి నడుమ నున్నది. గురువరుణుల సంబంధము మనస్సును ఉన్నత స్థాయికి చేర్చునట్టిది. అందులో ఇచట గురువు లగ్నాధిపతి. ఇక, బుధుడుండునది ఆధ్యాత్మదృష్టికి అవకాశమిచ్చు మేషరాశి 12° వ భాగ. పరివర్తకి కారకుడగు యముని కేంద్రదృష్టి ఈ బుధునిపై నున్నది. కాలగర్భమున లీనమైపోయిన ప్రాచీన విస్మృతాంశములను బలాత్కారముగా పట్టి, లాగి, తెచ్చి వర్తమానకాలమునకు అందిచ్చు శక్తి ఈ యముని దృష్టికి కలదు.

పై దినజాతకములో ఆశాసహమము పంచమాధిపతి శనియొక్క, చతుర్థ సప్తమాధిపతి గురువుయొక్క లాభస్థానమందలి యమునియొక్క మిత్రదృష్టి సౌభాగ్యము నందుకొనియున్నది. సంతాన ప్రేమ, గృహిణీ ధర్మము, భర్తృపరాయణత, అను విషయములకే ఆ జాతకురాలి కోరికలలో అగ్రతాంబూలము వచ్చినదని అర్థము. పాపము చిన్నవయస్సులోనే ఆ సీమంతిని నూరేండ్లు నిండుటచే, కాంక్షలకు తగిన ఫలము ఆమె అనుభవించలేదు. అవసానకాలములో ఉత్కట కాంక్షలు ఆమె హృదయమున అట్లే నిలిచిపోయినవి. అతీంద్రియజ్ఞానపు భాగలో లగ్నముండిన దినమున ఆమె జీవుడు జీర్ణమయిన భౌతిక దేహమును వదలి కాంక్షారూపమయిన సూక్ష్మ (లింగ) దేహమున్ప్రవేశించుట! కాలక్రమమున ఆ జీవుడు పునర్జన్మమును స్వీకరించుటకు ఆరంభించినపుడు, అనగా, పునర్జన్మమునకు అంకురార్పణ మైనప్పుడనుట, ఆధాన చంద్రుడు 'అపూర్ణకామ'పు భాగలో ఉండెననియు, జన్మకాలములలో లగ్నము సైతము అదే విశిష్ట భాగ నాశ్రయించియున్నదనియు, గమనించితిమేని కాంక్షాశేషరూపమైన ప్రారబ్ధము (కర్మ) కారణముగా జీవుడు జన్మాంతరమును పొందెనని సులభముగా గోచరించగలదు. విశేషమేమనగా, అవసానదిన జాతకపు లగ్నము, ఆధానకాల లగ్నము, పునర్జన్మపు చంద్రస్థానము, అన్నియు, కూడబలుకుకున్న రీతి, అతీంద్రియ జ్ఞానభాగ నాశ్రయించియున్నవి. దేహములు మారినా, పూర్వజన్మజ్ఞానము మరుగుపడలేదు.

శాంతిదేవికి గల పూర్వజన్మజ్ఞానమునకు కారణము లివి. కాలాత్మకబ్రహ్మముయొక్క విచిత్ర వినోద లీల!

బుధుడు కలడుకదా? అతనికి ఈ నాటకములో స్థానము కలదా? అనవచ్చును. పూర్వజన్మావసాన దినమునకు దైనికలగ్నము సాధించినచో, నికరముగా ఆ లగ్న స్థానములోనే (వృశ్చికరాశి 27½°) ఈజన్మమున బుధుడు కూర్చుండి ఈ నాటకమునకు సూత్రధారుడుగ పని చేయుచున్నాడని చదువరులు గ్రహించగలరు. ఆజన్మపు అనుభవములు బుధుడామెకు స్ఫురణకు తెచ్చుచుండుటలో ఆశ్చర్యమేమి?

మూడు సంవత్సరముల వయస్సులోనే శాంతిదేవి "నా కుమారుడు మధురలోనున్నాడు. నా భర్త అందే ఉన్నాడు." అని అపుడపుడు ముద్దుమాటలతో అనుచుండెనట! పుణ్యసహమును చలించి వరుణుని కేంద్రవేధతో ఇంద్రుని అర్ధకోణదృష్టి సాధించిన కాలమది. ఇంద్రుడు 'సహస్రాక్షుడు' కదా? అతనికి దేహమంతా కన్నులే! బుధునికి ఉత్తేజనము నిచ్చుచున్నవారీ ఇంద్రావరుణులే. శాంతిదేవికి పూర్వజన్మ విషయము కన్నులకుకట్టినట్లు చూపట్టసాగినవి. ఏడేండ్లవయస్సులోనే "మధురకు పోవలెను. కుమారుని చూడవలెను. భర్త ఎట్లున్నాడో?" అను ఉత్కంఠ ఆమె మాటలలో కానవచ్చినదట! చలిత రవి వియోగకారకుడగు వరుణుని కేంద్రవేధ పొందినది అప్పుడే. ఆమె లేతహృదయము వియోగక్లేశము ననుభవించినది. 1935 నవంబరు నెలలో ఆమె శ్రీ పండిత కేదారనాథుని చూడగల్గుట, కుమారుని కౌగలించి ఆనంద మనుభవించుట, మధురానగరమును చూచుట, సంభవించినవికదా? అప్పటికి శేషమానదశలో వచ్చిన ప్రబలదశాయోగములు చిత్తగింపుడు.

(i) సంతానవిషయశుభ (పంచమ) స్థానాధిపతి యగు జన్మరవితో రమ్యమైన కోణదృష్టి చలితలగ్నమునకు వచ్చినది.

(ii) చలిత శుక్రునికి చలిత కుజునితో నిండు త్రికోణ మిత్రదృష్టి సిద్ధమైనది. జాతకములో లగ్నాధిపతి కుజుడు, సప్తమాధిపతి శుక్రుడు. ఈదశకు వేరు వ్యాఖ్యాన మవసరము లేదు.

(iii) ధర్మస్థానాధిపతియగు బృహస్పతికి కోణస్థానమందున్న పుణ్యసహముపైకి వచ్చి చలిత చంద్రుడు జన్మసప్తమాధిపతి శుక్రునికి ఎదురునిలుచుట ఇప్పుడే!

మాతృవాత్సల్యానుభవముతో, ప్రియబంధు సందర్శన ప్రీతితో, వియోగకాతర్యముతో, హృదయమున ఉద్రిక్తభావములు చెలరేగునట్లు, ఉన్నతాదర్శముల సహాయమున, పూర్వపుణ్యఫలము వ్యాప్తికి వచ్చునని ఈదశాయోగములు తెలుపుచున్నవికదా? ఒక్కమాట! అన్నము పున్నము తెలియని అమాయకపు చిరుతవయస్సులో ఈ దశలువచ్చుట శాంతిదేవి జననీజనకుల తపఃఫలము. ఆమెకు తారుణ్యము వచ్చిన తరువాత ఇట్టిదశలు వచ్చియుండెనేని, ఫలమెట్లు పరిణమించి యుండెడిదో, ఊహించుట కష్టము. దైవమామెను రక్షించినది. జాతకములో శుక్రవరుణ వేధాదోషమున్నదికదా? ఆ శుక్రుడో భర్తృస్థానాధిపతి. వైయక్తిక ప్రబలాకర్షణము. అపూర్వ ప్రేమానుబంధము, వియోగక్లేశానుభవము సూచించు యోగమది. దానిఫలము దశలు కారణముగ చిన్నవయస్సులోనే చెల్లిపోయినవి. వయస్సునకు తగినట్టిది ఫలము.

దూరదృష్టిగల కోదండపు శని ధర్మస్థానములో కూర్చుండి కేంద్రదృష్టితో చంద్రునికి (మనస్సునకు) నీతి నియమముల నేర్పి, చక్కని కోణదృష్టితో లగ్నమును పోషించుచున్నాడు. ప్రాపంచికప్రయోజన దృష్టి, నైతికమార్గానుసరణము, గురుజనవిధేయత, యుక్తాయుక్తవివేచనాశక్తి, సామంజస్యసంపాదన కౌశలము, ఇవి ఈ శని అనుగ్రహము. కావుననే, పూర్వజన్మవాసనలన్నియు జ్ఞప్తిలోనుండినా, శాంతిదేవి ఇప్పటి పరిస్థితులతో జీవితమును సమన్వయపరచుకొని, మనశ్శాంతిని సంపాదించుకొని, ప్రశాంతముగా, తృప్తితో, తాత్త్వికదృష్టితో, గృహిణీధర్మమును నెరవేర్చగలిగియున్నది. ఆమె జీవితము ధన్యము.

ఈ జాతకచర్చలో ఒక గొప్ప జ్యోతిశ్శాస్త్ర ధర్మము మనకు చూపట్టుచున్నది. చూడుడు! పూర్వ జన్మజాతకమందలి చలితబుధుడున్న స్థానమందే ఆ జన్మావసానమున దినజాతకలగ్నము సంక్రమించినది. అధాన లగ్నమునకు అంకురార్పణ మచటనే. ఇప్పటి జాతకమున

అదే చంద్రుని స్థానము! ఇంతేకాదు. ఆ దినజాతకమందలి మృత్యుస్థానమందు ఆధానచంద్రుడు (లింగదేహము), అచటికే ఇప్పటి జాతకములో లగ్నము (భౌతిక దేహము), ఉన్నవి. ఈ పరిస్థితులవలన పూర్వజన్మావసానముతో పునర్జన్మమునకు జాతకరీత్యా అవినాభావసంబంధము కలదనియు, ఆ జన్మాంతమున అననుభూతములుగా నిలిచియుండిన ఉత్కృటకర్మశేషములు ఈ జన్మమునకు ప్రారబ్ధకర్మగా పరిణమించి ఆధానకాలగ్రహస్థితివలన సూచితములగుననియు, తేటపడుచున్నవి కదా? ఆ జగన్నాటక సూత్రధారి ఏర్పరచిన నాటకములో నటించుచున్న జీవునిపాలికి పూర్వజన్మము, సూక్ష్మదేహవాసము, గర్భస్థితి, పునర్జన్మము, అనునవి ఒక అంకమందలి చిన్న రంగములగుచున్నవి. కథాసంవిధానములో ఒక రంగముతో మరియొక రంగమునకు సన్నిహిత సంబంధము ఆవశ్యకముకదా?

ఈ ఊహ సత్యమైనచో, పూర్వజన్మ జాతకమునకు దశలు సాధించితిమేని, అవి పునర్జన్మము సంభవించుదాక జీవుని యాత్రను చూపవలయును కదా? అనవచ్చును. పరీక్షింతము గాక.

విప్లవకారియగు వరుణునితో చలిత పూర్వజన్మ చంద్రుడు కేంద్రవేధను పొందినపుడు ఆ దేహావసానమని కనుగొన్నాము. ఆ చంద్రుడు దేవనాగ దశా పద్ధతితోనే ముందుకు చలించి బృహస్పతితో అర్ధకోణ మైత్రి స్థానమునకు వచ్చినపుడే ఆధానకార్యము జరిగినది. మన ప్రాచీనులు బృహస్పతిని 'జీవు' డనిరి; చంద్రుని 'జైవాతృకు' డనిరి. (అనగా, జీవింపచేయువాడనుట) ఋతుమతి అయిన తరువాత చంద్రునికి గురుదృష్టి వచ్చినపుడే గర్భధారణము జరుగునని వరాహమిహిరాచార్యుని మతము. సృష్టిక్రమములో గురుచంద్రుల సంబంధమునకు కల విలువ ఇటిది. అందులో ప్రశంసాజాతకమున గురువు లగ్న (జన్మ) దశమా (కర్మా) ధిపతి. ఇంతటితో ముగిసెననుకొనరాదు. ఆ చలితచంద్రుడు ముందుకు జరిగి ఆధానచంద్ర స్థానమును చేరుకున్నప్పుడే ఇప్పటి జన్మము. ఆ స్థలమందే కదా ఇప్పటి లగ్నము ఉండుట? చలితచంద్రుడు లింగదేహమును భౌతిక దేహస్థితికి మార్చివాడనుట! ఏమి చిత్రమిది?

పునర్జన్మ వచ్చుదాక పూర్వజన్మ జాతకమునకు విలయుండుట వాస్తవమైనచో, వర్ష జాతకపద్ధతిలో పయితము అట్టి విలువ చూపట్టగలదా? చూతము.

1926 వ సంవత్సరమున జనవరి 18 వ తేదిన 5—56—6 Am (I S T) కాలములో వర్షారంభమయినది. అప్పటికి పూర్వజన్మపు దేహమును జీవుడు వదలి మూడు నెలలు కడచినవని మనము జ్ఞప్తిలో నుంచుకొనవలెను.

ఇదే ఆవర్ష జాతకము:—

| | | | |
|---|---|---|---|
| వరుణ 22-30<br>చ 19-23<br>జీవిత 3-23 | | V 17-24 | |
| శు 26-4 (వ)<br>గు 2-49 | సాయనము<br>—<br>శాంతిదేవి పూర్వ జన్మమునకు వర్ష జాతకము<br>—<br>1926 | | రా 25-25 |
| ర 27-10-1<br>కే 25-25<br>బు 9.27<br>I 7-21 | | | ఇం 24-6(వ) |
| కు 14-31 | సంతాన 20-47<br>శ 24 15 | X 22-25 | |

జన్మకాల సంతానస్థానాధిపతి చంద్రుడిచట వర్షలగ్నమును చేరుకొన్నాడు. పంచమాధిపతి శుక్రుడు వక్రియై లగ్నాధిపతి శనితో 'ఇత్థశాల' యోగములో నుండుట! సంతాన సహమునకు దాని అధిపతియగు గురుని తేజస్సును చంద్రుడు 'శక్త' యోగముతో అందిచ్చుచున్నాడు. ఇవి యన్నియు సంతానప్రదములగు వార్షికయోగములు. కాని, దేహమే లేదే, సంతానమెక్కడిది? అని పరిహసించెదరా కాబోలు? సంతానము దేహమునకు సంబంధపడినదే కాని, జీవునికి కాదు కదా? ప్రశంసలోనున్న జీవునికి ఇపుడుండునది సూక్ష్మదేహమే. ఈ దేహములో నున్నప్పుడు సంతానమనగా భౌతిక దేహప్రాప్తియే. కనుక, ఈ వర్షజాతకము వ్యాప్తిలోనున్న కాలమందే భౌతిక దేహారంభమునకు అంకురార్పణము జరుగునని అర్థము. అనగా ఆధానకాలమున వచ్చుననుట! జాతకములో అష్టమస్థానాధికారముగల శుక్రుడిపుడు పంచమ (సంతాన) దశమ (కార్యాచరణ) స్థానములకు అధికారి అయినాడు. వింత ఏమనగా, వర్షారంభదినమందే అతడు వక్రియై

నాడు. ఈ వర్షమున యోగప్రదుడుగా శుక్రుడు నడుముకట్టినాడు.

సరే. ఆధానకార్య మెప్పుడు జరుగగలదో, ఈ వర్షజాతకము చూపగలదా? అని సవాలు చేయవచ్చును. జీవితసహమము చలించి సంతాన భావమును (V) ఎప్పుడు చేరుకోగలదో, అప్పుడు కావచ్చును కదా? భూపరిభ్రమణపద్ధతితో అట్టిసంయోగ మెన్నడు సిద్ధించునో పరికింపుడు.

| | |
|---|---|
| మఘరలో వృషభరాశిలో 17-24 ఉదయించు నాక్షత్రకాలములో | 20-23 |
| జీవితసహమము ఉదయమగు నాక్షత్ర కాలము | 16-42 |
| పోగా, నిలువను ... ... | 3-41 |
| వర్షజాతక రవియొక్క నాక్షత్రకాల భుక్తి చేర్చగా | 19-48 |
| మొత్తపు నాక్షత్ర కాలము | 29-29 |

'ఎఫెమెరిస్సు' అను పథకగ్రంథమును (పంచాంగము) త్రిప్పినచో, పై నాక్షత్రకాలము 15-3-1926 నాటి రవి భుక్తియని కనుగొనగలము. అదే ఆధానదినము!

మరియొక్కటి చిత్తగింపుడు. అవసానదిన జాతకములో లగ్నమునకు (దేహమునకు) ప్రభువు బుధుడు. వర్షజాతకములో ఆ గ్రహము ఉదయోన్ముఖుడై లగ్నములోనుండి, దేహాంతరప్రాప్తిని కోరుచున్నాడు. సంతానసహమము అతనిని ఎప్పుడు చేరుకోగలదో, చూతము.

| | |
|---|---|
| బుధస్థానము ఉదయమగు నా. కా. . | 13-35 |
| సహమము ఉదయమగు నా. కా. . | 9-54 |
| పోగా, నిలువ ... . | 3-41 |
| వర్షజాతక రవి నా. కా. భుక్తి ... . | 19-48 |
| చేర్చగా, మొత్తపు నా. కా. . | 23 29 |

ఇది సయితము పై ఆధానదినముననే చూపుట కాకతాళీయ మనగలమా?

మంచిదే. కాని, వర్షజాతకము చూపిన పద్ధతిలోనే, ఆధానకాలచక్రము ప్రసవకాలమును సూచించగలదా? అని ప్రశ్నించువారుందురు. అదియును గమనించుట యుక్తమే.

ఆధానచక్రములో సంతాన సహమమునకు (ధనుస్సులో 15°-50') ఆధానకాలపు రవితో సంబంధము సంపాదించి చూతము:—

| | |
|---|---|
| ఆధానరవి అస్తమించు నా. కా | ... 5-32 |
| సహమ ముదయించు నా. కా. | ... 11-46 |
| వ్యత్యాసము | ... 17-46 |
| ఆధానరవియొక్క నా. కా. భుక్తి | ... 23-29 |
| మొత్తపు నా. కా. | ... 17-15 |

ఈ నాక్షత్రకాలము ఏనాటిభుక్తియగునో, ఆనాటికి జననము కావలయుననుట. శాంతిదేవి పుట్టిన 11-12-1926 నాటి భుక్తి ఇదే!

ఇంతేకాదు. గత జన్మజాతకాధారమున ఆధానదినమునకు, ఓపికపట్టి, దినజాతకమును సాధించి చూడుడు. పరిణామమును సూచించు చతుర్థభావము ధనుస్సులో 14°లో చూపటగలదు. వర్షజాతకములో సంతాన సహమాధిపతి కుజుడా భాగయందే యున్నాడు కదా? ఫలము సిద్ధించినది.

ఇంకెన్ని సాక్ష్యములు కావలయును? ఇవన్నియు నిష్పక్షపాత బుద్ధితో గమనించితిమేని, ఒక సృష్టిధర్మము గోచరించగలదు. జాతకమందలి రవి ఆ జన్మము ముగిసినంతనే, తన అధికారమును వదలుకొనడనియు, పునర్జన్మము వచ్చిన తరువాత, అప్పటి జాతక రవికి తన ఉద్యోగ ధర్మమును ఒప్పజెప్పి తన కార్యము చాలించుననియు, ఈ చర్చ మనకు సూచించుచున్నది. ఇంకెన్ని రహస్యము లున్నవో, తెలియదు.

గహనమువంటి విషయామిది. ఎంతో పరిశోధనము చేయుటకు అవసరమున్నది. విద్యాధికులాపనికి పూనుకొన్నచో, అపూర్వవిషయములు మరికొన్ని బైటపడవచ్చును. మన జ్యోతిశ్శాస్త్రజ్ఞానము అభివృద్ధి నొందగలదనుటకు సందేహము లేదు.

ప్రకృత మింతటితో చాలింతును. ఆదర్శగృహిణి అయిన శ్రీమతి శాంతిదేవికి సర్వేశ్వరుడు ఆయురారోగ్య సౌభాగ్యములను ప్రసాదించెడుగాక.

"తం సంతః శ్రోతు మర్హంతి
సదసద్వ్యక్తిహేతవః
హేమ్నః స్సం లక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపివా.

—కాళిదాసకవి

# తెల్లవారింది

**హితశ్రీ**

పాత్రలు: రామమూర్తి, గోపీ, కిష్టు, పద్మ, విశ్వనాథం, పేరయ్యశాస్త్రి.



** ఒక మధ్యతరగతి కుటుంబీకుని ఇంట్లో 'డ్రాయింగు రూమ్' అనబడే గది. ఒక బల్ల, దానిమీద ఒక గడియారమూ, కొన్ని లా పుస్తకాలూ, ఫ్లాస్కూ, కప్పులూ, బల్లచుట్టూ మూడు నాలుగు కుర్చీలూ ఉంటాయి. ఉదయం సుమారు ఏడుగంటల సమయం. తెర లేచేసరికి రామమూర్తి ప్రవేశిస్తూంటాడు.

రామ: (కొంచెం గట్టిగా) ఒరే గోపీ, పద్మా, కిష్టూ... పలకరేమర్రా? బారెడు పొద్దెక్కినా ఎవరూ నిద్రలేవనే లేదా ఏం?

పద్మ: (ప్రవేశించి) అబ్బబ్బ. అందరం లేచి గంటన్నరయింది నాన్నా. 'బారెడు పొద్దెక్కినా నాన్న ఇంకా లేవలేదా?' అని అమ్మ ఇప్పుడే అంటోంది.

రామ: హాతోస్మి! మీ అమ్మకి సంగీతజ్ఞానం ఉంది కదా! పోనీ, తెల్లవారుజామునే ఓ చిన్న మేలుకొలుపుపాట పాడకూడదూ? (రాగయుక్తంగా) 'తెల్లవారెను కోడికూసెను...'

పద్మ: కాఫీ తయారాయెను!

రామ: అదీ వరస. ఇంతకీ కాఫీ ఏదమ్మా?

పద్మ: ఇదిగో ఫ్లాస్కులో నీకోసం ఎదురుచూస్తూనే ఉంది.

రా గుడ్—అందుకే ఆలస్యంగానే నిద్రలేవాలన్నారు. ఒక్క రహస్యం చెప్పనా? ఎంతసేపటికీ ఇతర్లు మనకోసం కనిపెట్టుకుని ఉండేట్లు చెయ్యాలిగాని మనం ఇతర్లకోసం పడిగాపులు పడేట్టుండకూడదు.

మీ క్లయింట్ల తత్వంకూడా అదేలా ఉంది నాన్నా.

రా ఏం?

ప ఇందాక ఒకాయన వొచ్చాడులే.

రా పేరు?

ప పేరు చెప్పలేదు. కొత్త కేసేమో.

రా మనిషెలా ఉన్నాడు?

ప మామూలుగానే.

రా అంటే?

ప ధోవతీ, చొక్కా, ఉత్తరీయం వేసుకున్నాడు కాళ్ళకి చెప్పులున్నాయి. రెండు చేతులూ, రెండు కాళ్ళూ...

రా అబ్బబ్బ. అదికాదమ్మా. సరిగా చెబుదూ.

ప బుర్ర మీసాలున్నాయి.

రా అయితే కొత్త కేసే పద్మా. గుడ్. క్రిమినలా? సివిలా?

ప సివిలే!

రా చెప్పాడా?

ప ఊహుఁ.

రా మరి నీకెలా తెలుసు?

ప ముఖంచూస్తే తెలియదూ?

రా ఒకవేళ సివిలేనేమో?

ప ఏమో మరి.

రా చేతిలో కాయితాల్లేవూ?

ప సరిగా చూడలేదు నాన్నా.

రా ఏంచెప్పాడు నీతో?

ప : ఏదో నీతో మాట్లాడాలిట. 'ఇంకా నిద్రలేవ లేదు. కొంచెంసేపు ఖూర్చో' మన్నాను. కాసేపు తటపటాయించి మళ్లీ వస్తానని వెళ్లిపోయాడు.

రా : ఇంకేదో పనుందేమో.

ప : కాదులే. ఇప్పుడు నువ్వు చెప్పిన రహస్యం ఆయనకి కూడా తెలిసే ఉంటుంది. ఇకనించీ ఎదురుచూడటం నీవంతుకదూ ?

రా : (నవ్వి) గడుసుపిల్లవే... ఆఁ-ఏదీ కాఫీ... అమృతమస్తు (రుచిచూసి) పద్మా, మీ అమ్మ సంబంధాలు చూడండో అని పోరుపెడుతుంది గాని, నిన్ను ఎవరిచేతుల్లోనో పెట్టి పంపించేస్తే నాకింక ఇంత మంచి కాఫీ ఎవరిస్తారమ్మా ?

గో : (ప్రవేశిస్తూ) దాన్నే శాస్త్ర పరిభాషలో 'ఎక్స్ప్లాయిటేషన్' (Exploitation) అంటారు, నాన్నా.

రా : ఒరేగోపీ, నువ్వు ఎకనామిక్సు ఆనర్స్ ప్యాస యావని నాకు తెలుసుకదూ.

ప : ఫస్ట్ క్లాస్ గ్రాండుగా మిస్ అయావనీ తెలుసు.

గో : ఒరే కిష్టూ-ఒహో, లేడుకదూ.

ప : ఎందుకు ?

గో : అహఁ. ఏమీ లేదు. మిస్సమ్మగారి ఇంటర్ దండ యాత్ర ఏ సంవత్సరము జరిగినది, తత్ఫలితము లేవి ? అని అడుగుదామని...

ప : నా జోలికి రావద్దన్నాను.

గో : నువ్వు నన్ను అనొచ్చుకదూ ?

రా : అబ్బ. ఊరుకోండర్రా.

గో : నన్నడిగితే ఆఏలూరు సంబంధం తప్పిపోటానికి కారణం పద్మ ఇంటర్ తప్పటమే నాన్నా.

రా : అబ్బే. వాళ్లకి చదువుకున్నపిల్ల అక్కర్లేదుట.

ప : ఆ పళ్ళకోతి సంగతి నాదగ్గిర ఎత్తకండి అన్నానా ?

గో : అనగా అనగా ఓ గురువింద గింజ...

ప : అదిగో, మళ్ళీ.

గో : ఇవాళ చూడబోయే మహానుభావుడికేం వంకలు పెడతావో !

రా : ఆ అబ్బాయి చాలా బావుంటాడురా గోపీ. పచ్చని పసిమి. మంచి విగ్రహం. ఐ. ఎ. ఎస్. పరీక్షకి కడుతున్నాట్ట.

గో : అయితే లాభం లేదు. అతను బి. ఏ. ప్యాసయిన అమ్మాయిని తప్ప ఇంకెవర్నీ చేసుకోడు.

రా : రెండేళ్ళుపోతే మన పద్మ మాత్రం బి. ఏ. ప్యాసుకాదూ ?

గో : రెండేళ్లుపోతే ఆయనకి బి. ఏ. అవసరమే ఉండదు.

రా : ఏం?

గో : అప్పటికి రెండుసార్లు ఢింకీలుకొట్టి ఏజ్ బార్రైపోయి ఇంక పరీక్షకి కట్టడానికి వీల్లేక యేదో సాదా ఉద్యోగంకోసం వాంటెడ్ కాలమ్స్ చూస్తూవుంటాడు. అప్పర్ డివిజన్ గుమాస్తాలకీ, బడిపంతుళ్లకీ పర్సనల్ సెక్రటరీల అవసరం లేదుకదా.

ప : (వ్యంగ్యంగా) అందరూ మా గోపీ అన్నయ్యకి మల్లే అఖండమైన తెలివితేటలు గలవాళ్ళే ఉంటారా ఏమిటి, మరి!

గో : అబ్బో, ఇంకా పెళ్లిచూపులే కాలేదు కాని, అప్పుడే వెనకేసుకొస్తున్నావే.

ప : (కోపంగా) అలా మాట్లాడితే నే నిక్కడనించి వెళ్లిపోతాను.

గో : ముస్తాబు కావటానికా? ఆల్ రైట్, కానీ. ఆయన నైన్ డౌన్ ప్యాసెంజర్ లో వేంచేస్తారు కాబోలు. టైమవుతోంది.

రా : అన్నట్టు ఇవాళేకదూ వాళ్లు వస్తామన్నరోజు. బొత్తిగా మతే ఉండటంలేదు. ఏమిటూ ? మా పద్మ ఇవాళ ఇంత పెందరాళే నిద్రలేచింది అని అనుకొంటూ నేవున్నాను. అదికదూ సంగతి!

ప : ఏమిటి నాన్నా, ఇద్దరూ కలిసి...

రా : లేదులే. నువ్వు చాలా మంచిపిల్లవు గాని కొంచెం పేపరు తెచ్చిపెడుదూ.

ప : సరిపోయింది. పేపర్ కోసమే పాపం గోపీ ఇందా కట్నుంచీ గేట్లో కాపలాకాస్తూ నిలబడ్డాడు.

గో : ఏం? ఇంకా ఇవ్వలేదా ఇవాళ?

ప : ఊఁహుఁ.

రా : మెయిల్ లేటయిందేమో.

గో : ఏంలేటో. ఈమధ్య రోజూ ఆలస్యంచేస్తూనే ఉన్నాడు. అందులో, ఇవాళ స్కూల్ ఫైనల్

రిజల్ట్సుకూడా వస్తాయట. గిరాకీతగిలి అమ్మేసుకున్నాడో, యేమో.

ప : రేపట్నించీ మానేస్తేసరి.

గో : మానెయ్యటమే. ఇంకా నయం. రేపట్నించీ లైబ్రరీలచుట్టూ తిరగాలి.

ప : ఏముంటుందా పేపర్లో నా ముఖం?

గో : అదితప్ప అన్నీ ఉంటాయి.

ప : సంతోషించాంలే. వాంటెడ్ కాలమ్సూ, క్రికెట్ స్కోరేగాని, వార్తలు ఎప్పుడైనా చదివే అలవాటుంటేకదూ.

గో : ఇంకా నయం.

ప : పేపరంతా తిరగేసింతరవాత 'ఇవాళ పతాక శీర్షిక ఏమిటన్నయ్యా?' అంటే నాలిక కరుచుకునేది ఎవరో!

రా : ఎవరో గోపి అనే అబ్బాయిలేగాని, కిష్టుడు కనిపించడేమర్రా?

ప : పేపరుకోసం వెళ్ళాడు నాన్నా.

గో : పిలవబోయిన పేరుసాయెబు జాడకూడా లేదన్నట్టు వాడువెళ్లి గంటయినా ఇంకా రాలేదు. ఏంచేస్తున్నాడో.

రా : అడుగో, వొస్తున్నాడు. నూరేళ్లాయుష్షు. ఏరా కిష్టూ, ప్యాసయావా?

(చేతిలో పేపర్తో ప్రవేశిస్తూ) ఏమో!

రా ఏమో ఏమిట్రా? రిజల్ట్సురాలేదూ?

కి వచ్చాయి.

రా మరి నీ నెంబరు చూసుకోలేదూ?

చూశాను.

గో : లేదా ఏమిటి?

కి : ఉంది.

గో : కంగ్రాట్యులేషన్స్. మరి ప్యాసయావా అంటే ఏమోఅంటా వేంరా, వెధవ సస్పెన్సూ, నువ్వూ.

కి : ప్యాసయానో లేదో తెలియదు.

రా : ఏమిట్రా నీగొడవ?

కి : అదికాదు నాన్నా. 'ఈ క్రింది నెంబర్లుగల విద్యార్థుల ఫలితాలు తర్వాత ప్రకటించబడును' అని కొన్ని నెంబర్లు వేశారు. వాటిలో నా నెంబరుంది.

రా : అదేమిటో చూడరా గోపీ.

గో : ఏదీ పేపరు.....ఓహ్హో! ? అటెండెన్సు తక్కువయిందికదూ? కండోనేషన్ కావలసిన వాళ్ల ఫలితాలు తరవాత ప్రకటిస్తారులే.

కి : మరి ఇప్పుడేం చెయ్యాలి?

గో : ఏంచెయ్యక్కర్లేదు. ఓ వారంరోజుల్లో తెలిసిపోతుందిలే.

కి : మరి ప్యాసయినట్టేనా?

గో : రిజల్టువస్తేకాని తెలియదు. ప్యాసయే ఉంటావులే.

: బాగానేఉంది. పాపం, వాడు రాత్రంతా నిద్రపోకుండా ఎప్పుడెప్పుడు తెల్లారుతుందా అని కనిపెట్టుకూర్చుంటే ఇదా ఫలితం!

గో : వాడు రాత్రంతా నిద్రపోలేదని నీకెలా తెలుసు?

: నేనెప్పుడు లేచినా వాడు మెళకువగానే ఉన్నాడు.

గో : నువ్వూ నిద్రపోలేదన్నమాట.

: "ఎంతసేపటికీ తెల్లారదేం?" అని రాత్రంతా అక్కయ్య ఎన్నిసార్లు విసుక్కుందో!

: అవును మరి. నీ పరీక్షేమవుతుందో నని నీకంటె మాకే బెంగపట్టుకుందాయె.

గో : అంతేకద. ఇంకేమిటోననుకున్నాలే.

ప : అన్నట్టు క్రికెట్ స్కోర్ ఎంతో చెప్పలేదే.

గో : హోమ్ మేచ్... (నాలిక కరుచుకొని) ఎంతయితే నీకెందుకూ?

రా : ప్రకటనల కాలమ్ చూడు గోపీ.

: చూస్తున్నాను నాన్నా...అబ్బే...ఎక్కడా... ఒక్కటికూడా మనకి కావలసిందిలేదు. శుద్ధ దండగ ఇవాల్టి పేపరు.

: అందుకే మానెయ్యమన్నాను.

గో : నువ్వెవరికైనా సంపాదకునికి లేఖలాంటిదేమైనా పత్రిక్కి పంపావా పద్మా?

ప : లేదే, ఏం?

గో : ఏం లేదు. వాళ్ళు వెయ్యకపోతే కోపం వొచ్చి పత్రిక మానెయ్యమంటున్నావేమోనని.

ప : పోదూ. నాకసలే విసుగ్గా వుంది.

గో : మరి పల్లెటూరి పిల్లలా మాట్లాడతావేం? ఈ రోజుల్లో పొద్దున్నే కాఫీతాగి, సిగరెట్ ముట్టించి పేపరు చూడనివాడు నవనాగరికుడే కాడు.

ప : చదివినా చదవకపోయినా, తలకిందులుగా పట్టుకున్నా ఇంగ్లీషు పేపరైతే మరీ గొప్ప.

రా : బాగా చెప్పావు.

[బయటినించి కేక : 'పోస్ట్ సార్'; గోపీ, పద్మ, కిష్టూ ద్వారంవైపు పరుగెత్తుతారు.]

అప్పుడే ఏం పోస్ట్? అలా పరుగెత్తకండిరా... నెమ్మదిగా!

[గోపీ చేతిలో ఉత్తరంతో తిరిగి ప్రవేశం]

ఏమిట్రా గోపీ అది? ఎక్కడినుంచి?

గో : ఎక్స్‌ప్రెస్ డెలివరీ లెటర్ నాన్నా. సర్వీస్ కమిషన్‌నించి. వండర్‌ఫుల్. పద్మా, కిష్టూ... కంగ్రాచ్యులేషన్స్ చెప్పండి వెంటనే. ఊఁ.

ప : ఉత్తరం చూడకుండానే!

గో : ఇంకా చూసేదేమిటే పద్మా! అపాయింట్‌మెంట్ ఆర్డర్. నే ననుకుంటూనే వున్నా. అసలు ఆశలన్నీ ఈ ఉద్యోగంమీదే పెట్టుకున్నా లే.

ప : ఇంటర్వ్యూ కాకుండానే ఉద్యోగం ఇచ్చేస్తారేమిటి ఎవరైనా?

గో : ఇంటర్వ్యూ? ఓ...ఎస్. అవును. అయితే ఇది ఇంటర్వ్యూకి రమ్మని రాసిన లెటరై వుంటుంది. అందాకా వస్తే ఉద్యోగం వొచ్చేసినట్టే లే...ఇంటర్వ్యూలో ఏ ప్రశ్న అడిగితే దానికి టకటక జవాబులు చెప్పి పారెయ్యనూ!

కి : అన్నయ్య ఇంగ్లీషులో బలే దంచి మాట్లాడేస్తాడక్కయ్యా. నేను చాలాసార్లు విన్నాను.

ప : నీముందైతే నేనూ మాట్లాడతాలేరా.

గో : పోనీ, తమరుకూడా ఇంటర్వ్యూకి వొచ్చి వినకూడదూ?

రా : ఇంతకీ ఆ ఉత్తరమేమిటో చూడరా గోపీ.

గో : ఇంకా అనుమానమేమిటి నాన్నా నీకుకూడా. అన్నట్టు వెంటనే ఓ మంచిసూట్ కుట్టించాలి. పర్సనాలిటీ దర్జాగా ఉంటేగాని ఇంప్రెసివ్‌గా ఉండదు. దానికేం భాగ్యంగా! ఇంటర్వ్యూ రావాలేగాని...

గో : ఒరే కిష్టూ, ఇకనుంచీ నేనెవరో తెలుసా, లెక్చరర్. నిన్ను మా కాలేజీలోనే చేర్పించేస్తాను. నీ గ్రూప్‌కూడా ఎకనమిక్సే. అప్పుడు పద్మావతమ్మగారికి మన తడాఖా ఏమిటో తెలుగుగాని, ఏం?

కి : స్కూల్ ఫైనల్ ప్యాసయితే నువ్వే గ్రూప్ తీసుకోమంటే అదే తీసుకొంటాను. నాకేదైనా ఒకటే.

గో : ఆఁ. ఇంకా మనకేం కావాలీ? ఓ జిప్ బాగ్, అది మాత్రం తప్పకుండా ఉండాలిసిందే నాన్నా. టెస్టిమోనియల్స్ అన్నీ అందులో పెటుకుని విలాసంగా బ్యాగ్ పట్టుకుని ఇంటర్వ్యూకి వెళ్లాలని నాకు ఆనర్స్‌లో చేరినప్పటినించీ మనసుగా ఉంది.

రా : ఏదీ, ఆ కవరిలాతే.

ప : ఉండు నాన్నా. పాపం గోపిని కాసేపు సంతోషపడనీ. తీరా విప్పిచూస్తే అందులో ఏముంటుందో!

గో : పద్మా. నీ హాస్యవాసి చాలా మంచిదిగాని కాస్త నువ్వే ఉత్తరంతీసి చదివి వినిపిద్దూ...మా పద్మ మంచిదికదూ! (పద్మకి ఉత్తరం ఇస్తాడు. ఆమె చదువుతుంటే ఆదుర్దాగా ఆమె ముఖంలోకి చూస్తూంటాడు.)

ప : (కొంచెం ఆగి) ఇదేమిటన్నయ్యా? ఇది నీ దస్తూరీలా ఉందే!

గో నా దస్తూరీనా? ఏదీ?...అరె, ఇది నేను రాసి పంపిన దరఖాస్తే నే! తిప్పిపంపారెందుకూ?

రా తిప్పిపంపారా? అదేమిట్రా? సరిగా రాయలేదా?

గో ఎందుకు రాయలేదు? ... ఓహో, ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిద్వారా పంపాలిట! లేకపోతే ఆలోచించరట. హరి! ఉద్యోగం వచ్చిందనే అనుకొన్నా నే!

పోనిద్దూ. అదొక్కటేనా ఉద్యోగం? దాని తలదన్నిన ఉద్యోగం వస్తుందన్నయ్యా నీకు అందుకే అది రాలేదు.

గో : (నిరాశగా) లాభంలేదు పద్మా. ఒక్కటంటే ఒక్క కాలేజినించి కూడా సమాధానం రాలేదు. రోజూ పోస్టుకోసం ఎదురుచూడలేక కళ్ళు కాయలుకాస్తున్నాయే గాని ఫలితం శూన్యం.

రా : అప్పుడే అలా నిరాశపడతావేంరా గోపీ. ఉద్యోగమే దొరక్కపోతుందా ఏమిటి?

కి : మా బళ్లో నిరుద్యోగి అనే నాటకం వేశారు నాన్నా. అన్నయ్యలాగే ఒక...

ప : ష్. నువ్వు కాసేపు ఊరుకోరా కిష్టూ. మన గోపి అన్నయ్యకి ఫస్ట్‌క్లాసయిన ఉద్యోగం దొరుకుతుంది. చూస్తూఉండు.

గో : నీ నోటివాక్కువల్ల ఉద్యోగమే రావాలిగాని నీకో మంచి సంబంధంచూసి వెంటనే పెళ్లి నిశ్చయం చేయించేస్తున్నా?

ప : అదిగో, అలా అంటేనే నాకోపం వచ్చేది.

[బయటనించి కేక. 'రామ్మూర్తిగారూ']

రా : చూడు గోపీ, ఎవరో...(గోపీ నిష్క్రమణ) వాడలా నిరాశపడుతుంటే ఏదో బాధగా ఉంటుందమ్మా. పాపం చాలా దిగులుపడిపోతున్నాడు ఉద్యోగం కోసం.

ప : ఇంటర్వ్యూ దాకా వస్తే గోపిదే నాన్నా ఛాన్సు. మొన్న మా కాలేజీ ఓల్డుబాయిస్ అసోసియేషన్ మీటింగులో అనర్గళంగామాట్లాడుతుంటే అందరూ మంత్రం పెట్టినట్టు చూస్తున్నారు. కాని మెరిట్ చూసేవా ఈ రోజుల్లో?

రా : ఎలా ఉందో అదృష్టం!...ఆయ నెవరో వస్తున్నారు. లోపలికి వెళ్లమ్మా కొంచెం.

ప : (నెమ్మదిగా) బ్రహ్మ మీసాలాయన! ఈయనే నాన్నా పొద్దున వచ్చింది.

రా : ఓహో!

వ్యక్తి: (ప్రవేశిస్తూ) నమస్కారమండి. తమరేనా రామ్మూర్తి గారు?

రా : నేనేనండి. రండి, అలా కూర్చోండి. పద్మా, కాస్త కాఫీ తెచ్చిపెట్టమ్మా.

ప : అలాగే నాన్నా (నిష్క్రమణ).

వ్య : అక్కర్లేదండి. తమతో రెండు ముక్కలు మాట్లాడి వెడతాను.

రా : తొందరేమిటి, సావకాశంగా మాట్లాడదాం కూర్చోండి. ఏమైనా క్రిమినల్ వ్యవహారమా?

వ్య : అబ్బే, అది కాదండి.

రా : మరి ఇంకేం? సివిల్ విషయాలు తాపీగా ఆలోచించాలి. కూర్చోండి, కూర్చోండి.

వ్య అది కాదండి నేను వచ్చిన పని...

రా మరి ఇంకేమిటో?

వ్య ఈ ఇంటి తాలూకు....

రా ఆఁ ఔనండి. నేనే యజమానిని.

వ్య తెలుసండి. అందుకే వొచ్చాను. ఈ ఇల్లు...

రా ఓ అలా చెప్పండి. పొద్దున లేచినప్పటినించీ క్లయింట్లతో పని కదండీ. కోర్టు వ్యవహారం మీద వచ్చారనుకున్నాను. చూడండీ నిక్కచ్చిగా చెబుతున్నాను. ఒక్కటే మాట. నాకు నానుడు వ్యవహారాలంటే కిట్టదు. పన్నెండు వేలు. అంతే.

వ్య ఏమిటండీ పన్నెండు వేలు?

రా రూపాయలండీ. అదేమిటలా అడుగుతారు? నేను ఎక్కువ చెబుతున్నాననా మీ ఊహ? పదకొండు వేల అయిదు వందల కడిగితే వీల్లే దన్నాను. కావాలంటే విచారించండి. నిజాయితీగా చెబుతున్నాను. ఇంకా తగ్గించటం సాధ్యంకాదు. తరవాత మీ ఇష్టం. పేపర్లో కూడా అదే వేయించాను. చూసే వుంటారు.

వ్య : ఈ ఇల్లు అమ్మకానికి పెట్టారన్న మాట.

రా : అంటే? మీరు వచ్చింది ఇంటి బేరానికి కాదూ?

వ్య : నా కెందుకండీ ఇల్లు?

రా . అయితే మీకేం కావాలీ?

వ్య : ఈ ఇంటి తాలూకు పన్ను ఇంకా కట్టలేదండి మీరు. వాయిదా మీరి మూడు నెలలు దాటింది. దయచేసి డబ్బు ఇప్పించి రశీదు పుచ్చుకోండి.

రా : (నిరాశగా) ఇంటి పన్నా? మీరు బిల్ కలెక్టరన్నమాట.

వ్య : అవునండి. కొత్తగా ఛార్జీ తీసుకున్నాను. పాత బిల్ కలెక్టర్ గారికి ట్రాన్స్‌ఫరయింది.

రా : పొద్దున వచ్చింది మీరేనా?

వ్య : అవునండి.

రా : మీరే!...ఒక్క వారంరోజులు ఆగండి. ఇచ్చేసాను.

వ్య : సంవత్సరం పన్ను బకాయి పడ్డారు. బాధ్యత తెలిసిన వారు. ఎలా చెప్పండి. వారం రోజుల్లో తప్పక చెల్లించాలండి. మీరు చెల్లించే దాకా రోజూ తమ దర్శనం చేసుకుంటాను.

రా : అబ్బే, ఎందుకూ? నేను కబురు చేస్తానుకదూ?

వ్య : అది మా విధ్యుక్త ధర్మం లెండి సెలవు (నిష్క్రమణ)

గో : (ప్రవేశిస్తూ) ఇంతా చేస్తే ఈయన బిల్ కలెక్టరా! నేనేదో గిరాకీ తగిలిందనుకున్నాను.

రా : గోపీ, ఈ కొంప ఎవడైనా కొంటాడని నీకు నమ్మకముందా?

గో : ఎందుకు కొనడూ? ఫస్ట్ క్లాసయిన డాబా ఇల్లయితే.

రా : ఇప్పటికి రెండు సంవత్సరాల్నించీ అమ్మటానికి ప్రయత్నం చేస్తున్నాం. సరైన బేరమే రాలేదు.

గో : పేపర్లో వేయించాం కదూ. చూద్దాం.

రా : ఆఁ—అదేం లాభం లేదురా.

గో : ప్రైవేటు రంగయ్య ఏమంటాడు?

రా : అయినకాడికి అమ్మమంటాడు. వాడికేం పోయింది? పైగా ఏమైనాఅంటే 'ఈ రోజుల్లో డబ్బెవడి దగ్గర ఉందండీ?' అంటాడు.

గో ధరలు పెరిగే సూచనలు కనిపిస్తున్నాయి నాన్నా.

రా : అవసరాలు ఆగుతాయిట్రా గోపీ?

గో : ప్రోనోటు రాసేద్దాం.

రా : అంత తేలిగ్గా ఉందా ప్రోనోటు? ఇచ్చేవాడెవడు?

గో : మరయితే ఎలా?

రా : అదే దిగులుగా ఉంది.

గో : నువ్వేం దిగులు పడకు నాన్నా. రేపో మాపో ఎవడో ఒకడు రంగంలోకి దిగి, పోటీలుపడి, అడ్వాన్సు అడిగినంత ఇచ్చేసి తక్షణాలమీద కంట్రాక్టు రాయించుకుని పోతాడు.

రా : అంత అదృష్టమే ఉండాలిగాని, పద్మ పెళ్లి మహావైభవంగా జరిపించమూ?

గో : ఇంకా నెమ్మదిగా అంటావేం నాన్నా. తాషామర్ఫా, నౌబత్తు, సన్నాయి—మేళం మీద మేళం జరిపించి, పాట కచ్చేరీలు పెట్టించి ఔట్లు కాల్పించి—

(ప్రవేశిస్తూ) భూదేవంత అరుగూ ఆకాశమంత పందిరీ వేసి...ఇవన్నీ గోపీ పెళ్ళికేనా నాన్నా?

గో ఇప్పుడు పెళ్ళి చూపులు తమరికేనండి.

ప మనసులో వున్న కోరికలు అలాగే బయటికొస్తుంటాయిలే. అన్నట్టు మీ క్లయింటు మంచినీళ్ళుకూడా తీసుకోకుండా అప్పుడే వెళ్లిపోయాడేం నాన్నా?

గో నీ చేతి కాఫీ తాగే ప్రాప్తం ఉండొద్దూ?

రా (నవ్వి) ప్యాసెంజర్ వచ్చే టైమయినట్టుందే.

గో ఈపాటికి రావాలిసిందే. లేటయిందో, ఏమో.

కిష్టు (వగరుస్తూ ప్రవేశిస్తూ) టెలిగ్రాం నాన్నా.

[అందరూ: టెలిగ్రాం!]

రా ఎక్కడినించిరా?

కి బొంబాయినించి నాన్నా.

గో బొంబాయి నించా?

ప బొంబాయిలో మనచుట్టా లెవరున్నారు?

రా నువ్వేమైనా అప్లికేషన్ పెట్టావా గోపీ?

గో ఊఁహుఁ

చెప్పవేంరా కిష్టూ, ఏమిటా టెలిగ్రాం? చెప్పుకో చూద్దాం.

నాకు తెలియదు. త్వరగా చెప్పేద్దూ.

వారఫలాలు జ్ఞాపకం తెచ్చుకో.

ప ఆకస్మిక ధనలాభం!

కి ఊఁ...అదే!

రా ఒరే కిష్టూ ఏమిట్రా హాస్యాలు మేం ఆ దుర్దాపడి చస్తుంటే.

నిజం చెప్పినా నమ్మకపోతే ఏం చెయ్యనూ?

రా మనకి ధనలాభం ఏమిట్రా!

గో ఆకస్మిక ధన నష్టం అంటే వెంటనే నమ్ముతాం.

ఇదిగో, చెప్పేస్తున్నాను. బొంబాయిలో ఒక లాటరీలో నాన్నకి ప్రైజువచ్చింది. ప్రైజ్!

ప ప్రైజే!

రా ఛ! నేనసలు లాటరీ టిక్కెట్టే కొనందే. ఆ టెలిగ్రాం మందు కాదురా.

నువ్వు కొనకపోతే నీ పేరుతో ఎవరూ కొనకూడదా నాన్నా?

రా ఎవరు కొంటార్రా? ఏరా, గోపీ నువ్వేమైనా కొన్నావా?

గో : ఎబ్బే. టిక్కెట్టుకొనే డబ్బే ఉంటే మరో నాలుగు సినిమాలే చూసేవాణ్ణి.

కి : (గర్వంగా) నీపేర నేనే కొన్నాను నాన్నా.

రా : నువ్వా? నీకు డబ్బెక్కడిదీ?

కి : సంవత్సరం నించీ కూడబెట్టాను. ఆ మధ్య మన ఊళ్ళో ఎవరికో ప్రైజు వచ్చిందని ఊరంతా టాం టాం అయిందికదూ. మనం డబ్బుచాలక అవస్థపడుతున్నాంకదా, అదృష్టం మనకూ కూడా కలిసొస్తుందేమోనని టికెట్ కొన్నాను. ఎప్పుడెప్పుడు టెలిగ్రాం వస్తుందా అని చూస్తుంటే ఇప్పటికి వచ్చింది.

రా : ఎంత ఆలోచనరా బాబూ నీకు.

గో : మనందరికంటే వాడే నయం.

ప : ఇంతకీ ఏం ప్రైజురా, ఫస్టా, సెకండా?

కి : ఇంకా చూడలేదక్కయ్యా.

ప : సరిపోయింది! చూడకుండానే ఈ హడావిడంతా? ఉత్సాహమంతా చంపేశావే!

కి : అబ్బ, నీకన్నీ అనుమానాలే అక్కయ్యా. కావాలంటే నువ్వే చూడు.

: ఒద్దులే. నా హస్తవాసి మంచిది కాదు. అన్నయ్యకియ్యి.

రా : త్వరగా చూడరా, గోపీ.

గో : (టెలిగ్రాం తీసుకుని చదివి) ఇది బొంబాయి నుంచి కాదు నాన్నా.

రా : ఆఁ! మరెక్కడనించీ?

గో : కారణాంతరాలవల్ల ఇవాళ రావటంలేదని పెళ్ళి సంబంధంవాళ్ళు వైరిచ్చారు.

[కొన్ని క్షణాలు నిశ్శబ్దం ఆవరిస్తుంది.]

రా : ఏదో ఇబ్బందివచ్చి ఉంటుంది. ఉత్తరం వస్తుందిలే. (పద్మవైపుచూసి) అమ్మ కాఫీ పెడుతున్నట్టుంది వాళ్ళకోసం. ఒద్దని చెప్పమ్మ పద్మా! (పద్మ నిష్క్రమిస్తుంది) పిచ్చిపిల్ల! దాన్ని చూస్తుంటే ఏదో బాధగా ఉంటుంది గోపీ.

గో : దాని పెళ్ళికోసం మనం మహా శ్రమపడిపోతున్నామనీ, ఇల్లమ్ముకుంటూ ఇబ్బందులు పడుతున్నామనీ, పాపం రాత్రింబగళ్లు మనసు కష్టపెట్టుకుంటుంది. మనకోసం పైకి నవ్వుతూ తనకేమీ పట్టనట్టు కబుర్లు చెబుతుంటే గుండె తరుక్కుపోతుంది. పైగా, తనెంత కులాసాగా కబుర్లు చెబుతున్నా నేనేదో దిగులుగా మనస్ఫూర్తిగా నవ్వటంలేదని బెంగపెట్టుకుంది! దాని అదృష్టం ఎలా ఉందో!

[బయటనించికేక: రామూర్తిగారూ!]

రా ఎవరూ, పేరయ్యశాస్త్రిలుగారా, రండి, రండి. ఎక్కడా దర్శనాలే లేవే!

హా...హా...ఎంతమాట! (నెమ్మదిగా) దయచెయ్యండి విశ్వనాథంగారూ! అయ్యా, వీరు రేపల్లె వాస్తవ్యులు—విశ్వనాథంగారు.

విశ్వ నమస్కారాలండి.

రా నమస్కారాలు. అలా కూర్చోండి.

పే ఏమోయ్ గోపాలరావ్, కులాసాయేనా?

గో మరేనండి.

పే ఇతనేనండి వీరి పెద్దబ్బాయి, విశ్వనాథంగారూ!

వి అలాగా, ఏం ప్యాసయావు బాబూ?

గో ఎకనమిక్సు ఆనర్సు ప్యాసయానండి.

పే యూనివర్సిటీ ఫస్టండీ.

వి అలాగా, సంతోషం.

రా రేపల్లెలో తమరు...

పే పేరుపొందిన పెద్ద ప్లీడర్ గారండీ.

రా అలా చెప్పండి. (నవ్వుతూ) సగోత్రీకులమే నన్నమాట.

అసలుగోత్రం కలిస్తే చిక్కే నండోయ్ రామూర్తిగారూ.

రా (నవ్వి) ఏమిటి విశేషం?

: వారి అమ్మాయిని మన అబ్బాయికి ఇవ్వాలని వారి సంకల్పం.

రా అంతకంటేనా! తథాస్తు. (నెమ్మదిగా) కిష్టూ. అక్కయ్యతో కాఫీ తెచ్చిపెట్టమని చెప్పు. (కిష్టూ నిష్క్రమణ)

వి పెద్దలు తమరు ఆశీర్వదిస్తే అలాగే జరుగుతుంది.

పే మన కుటుంబంలాగే వారిదీ మహా పరువు ప్రతిష్టలు గల కుటుంబమండి రామూర్తిగారూ. ఆవంశమూ, ఆమర్యాదా — మనతో అన్నివిధాలా సరితూగగల సంబంధం అనుకోండి. ఇక కట్నంకానుకల విషయంలో — ఉన్నంతలో ఏమీ లోపం చెయ్యరు.

రా : ఆc కట్నాల దేమిటిలెండి. పిల్లకి పిల్లవాడూ, పిల్లవాడికి పిల్ల నచ్చాలేగాని కట్నాలూ కానుకలూ అడ్డొస్తాయా?

పే : బాగా సెలవిచ్చారు.

రా : అమ్మాయి ఏం చదువుకుందండీ?

వి : కిందటిసంవత్సరమే స్కూల్ ఫైనల్ ప్యాసయిం

రా : సంగీత సాహిత్యాలేమైనా

వి : శాస్త్రోక్తంగా సంగీతం చెప్పించలేదుగాని, కాస్తంత కూనిరాగం తియ్యలేని ఆడపిల్లలెవరుంటార్లెండి.

రా  మావాడి రంగు ఉంటుందా?

ఓ చాయ ఎక్కువేలెండి. ఇంతెందుకూ, మనవాడికి తప్పక నచ్చుతుందని నేను గట్టిగా చెప్పగలను.

రా  మనవాడు అమ్మాయికినచ్చొద్దూ? (నవ్వుతాడు)

పే  నిక్షేపంలాంటి కుర్రాడు, గోపాలాని కేమండీ. ఏమోయ్ గోపాలం, మరి పెళ్ళిమాపు లెప్పుడు?

గో : తరవాత కబురుచేస్తాంలెండి.

పే : ఇంకా తరవాత ఎప్పుడూ? మీరు చెప్పండి రామ్మూర్తిగారూ — మీకెప్పుడు రావటానికి వీలవుతుంది?

రా : ఏరా గోపీ?

గో : నాకిప్పుడు పెళ్ళిచేసుకోటం ఇష్టంలేదు నాన్నా.

పే : ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు చేసుకుంటావోయ్?

గో : ఉద్యోగం ఐంతరవాత.

పే : ఉష్! ఉద్యోగం కాకుండా ఉంటుందీ? దాని కోసం పెళ్ళి మానుకుంటారుటోయ్?

గో : అదీకాక మాపద్మ పెళ్ళయితేగాని నావివాహం సంగతి ఆలోచించను.

పే : సరి, అదిమాత్రం ఆగుతుంది! ఏవో సంబంధాలు చూస్తున్నాంకదూ? వీలైతే రెండు పెళ్ళిళ్లూ ఒకేముహూర్తాన జరిపించేద్దాం.

గో : ముందు దాని సంబంధం నిశ్చయం కానివ్వండి.

పే : తర్వాత 'ఉద్యోగం దొరకనివ్వండి' అంటావు. అంతేనా?

: (నవ్వి) ఈకాలంవాళ్లు చాలామందిఅంతేలెండి. నాకు నచ్చావోయ్ గోపాలరావ్. ఇలాంటి భావాలు గలవాళ్లంటే నాకు చాలా ఇష్టం.

గో : థాంక్స్ సర్!

పే : (ఆశ్చర్యంగా) మీరు కూడా తాళంవేస్తున్నారా?

: (గోపీవంక తేరిపారచూస్తూ) ఓహో! మంచి లలాటం. మనసుకి సుఖం అద్దంలాంటిది. ఒకసారి ఇలా వస్తావూ?...ఏదీ కుడిచెయ్యి చూపించు [గోపీ కొంచెం కుతూహలంగా దగిరికివచ్చి చెయ్యిచాపుతాడు.] ఓహో...... నీకేమోయ్ బ్రహ్మాండమైన భాగ్యరేఖఉంది.

: ఏముండోయ్ విశ్వనాథంగారూ, మీకీవిద్యలో ప్రవేశముందా ఏమిటి, నాకు తెలియదే!

: ఆc—ఏదో కొద్దిగా. పెద్దపాండిత్యమేం లేదులెండి...ఆc- చూస్తే గవర్నమెంటు ఉద్యోగమే వొచ్చేట్టుందోయ్.

గో : ఏం ఉద్యోగమంటారు?

వి : నేర్చుకున్నది ఇతరులకి నేర్పేవృత్తి...లెక్చరర్ కావొచ్చు.

గో : (సంతోషంగా) నాకు అందులోనే అభిరుచి ఉందండీ.

వి : ఇంకేం, మరీ మంచిది. ఇరవై ఒకటి ఆ ప్రాంతాల కావొచ్చు. ఇప్పుడు నీ వయసెంత?

గో : సుమారు అంతేనండి.

వి : అలాగా......చదువులో ఓ గండం తప్పించుకున్నట్టుందే!

గో : నిజమేనండి. ఓ సంవత్సరం ఆనర్స్ పరీక్షకి వెళ్లకుండా విత్ డ్రా అయాను.

: ఓహో : అలా చెప్పు...బాగుందోయ్, మంచి హస్తం. పైకివస్తావు. చాలా సంతోషం....

రా : నాకూడా రెండుముక్కలు చెబుతారేమిటి విశ్వనాథంగారూ!

: అంతకంటేనా? ఏదీ, చెయ్యిచాపండి...ఆగీత దగ్గిర నక్షత్రం ఉంది చూశారూ...ఒక ఉద్దండమైన కేసులో బ్రహ్మాండమైన పేరుతెప్పిస్తుందండీ.

రా : (సంతోషంగా) అలాగాండి. మీతో నిజం చెప్పేస్తున్నాను. మనసులో ఆ కోరిక చాలా కాలంనించి ఉందండీ.

: కాని ఆస్తి...ఏమీ మిగిలేట్టు లేదండీ. అయినా పిల్లలేగదండి మన ఆస్తి!

: బాగా చెప్పారు.

: నిర్విచారంగా గడిచిపోతుంది లెండి జీవితం.

: అదే చాలు. ఒరే కిష్టూ...ఇలా రా. ఏడు మా ఆఖరివాడండీ.

: అలాగా...లాటరీలో ప్రైజ్ కొట్టేటున్నాడండోయ్ మీవాడు. (నవ్వుతాడు). ముఖంలోనే ఆ అదృష్టరేఖ కనిపిస్తోంది!

: నిజంగానా అండీ? ఈ మధ్య పదిరూపాయలు పెట్టి లాటరీ టికెట్ కొంటె పోయిందండీ.

: ఊఁ...ఇప్పుడిప్పుడే కాదు లే...బాగా చదువొస్తుంది. అన్నయ్యని మించిపోతావు లే.

: (ప్రవేశిస్తూ) కాఫీ నాన్నా.

: ఇలా తెచ్చి వారికి ఇచ్చి వెళ్లమ్మా. మా అమ్మాయండీ విశ్వనాధం గారూ. (పద్మ విశ్వనాథం దగ్గిర బల్లమీద కాఫీ కప్పు పెడుతుంది.)

: శీఘ్రమేవ వివాహ ప్రాప్తిరస్తు! ఎడం చెయ్యి ఇలా చూపించమ్మా...అబ్బ. ఆఫీసర్ గారి భార్య. అయిపోయేటున్నావే నువ్వు...అరె, అలా వెళ్లిపోతా వేమిటమ్మా......? పరాయి వాళ్లం కాదు లే. రామమూర్తిగారూ, అమ్మాయికి లలాటంమీద ఆ రేఖఉంది చూశారూ, మహా అదృష్టవంతులకి గాని అలా ఉం: ఫేస్ రీడింగ్ లో కూడా కొంచెం ప్ర: ఉందిగనుక చెబుతున్నాను. ఆ లలా అదృష్టవశాత్తూ హస్తరేఖకూడా అద్భుతంగా కలిసింది కనుక ఘంటాపథంగా చెప్పగలను. అమ్మాయికిఒకటో రకం సంబంధం రావాలండీ!

: ఏదో మీ ఆశీర్వాదబలం. కాఫీ తీసుకోండి, చల్లారిపోతుంది.

: కలిశితే అతకదండోయ్.

: ఆవిషయం ఇందాకే తేల్చేశాడుగా మన గోపాల రావు.

: ఏమోయ్, అం తేనంటావా?

వి : పోన్లెండి, కుర్రవాడిని బలవంతం చెయ్యట మెందుకూ? నాకలాంటివి నచ్చవు.

రా : (మొహమాటంగా, సందిగ్ధంగా) అహఁ బలవంత మేమిటిలెండి!

శే : పెద్దవాడిని కనుక చెబుతున్నాను. అవతల పెద్ద మనిషి పిలిచి పిల్లనిస్తానంటుంటె ఏవో సాకులు చెప్పటం భావ్యం కాదోయ్ గోపాలరావ్!

వి : (ముందుజాగ్రత్తగా) అప్పుడే అక్కడి దాకా ఎక్కడొచ్చిందిలెండి? ఈరోజుల్లో మాట ఇవ్వటానికి మన కధికారం ఎక్కడిదీ? చూపులవరకే మన పెద్దరికం.

శే : బాగా సెలవిచ్చారు. నా అభిప్రాయమూ అదే. అయితే చూపులవరకూ వస్తే ఈసంబంధంమాత్రం ఆగేది కాదులెండి. సలక్షణమైన బంగారపు బొమ్మ అమ్మాయీ- బుద్ధిమంతుడైన ఆనర్స్ గ్రాడ్యుయేటు కుర్రవాడు; ఇంకేం కావాలీ? ఏమోయ్ గోపాలరావ్, నీ అభిప్రాయం ఏమైనా మార్చుకున్నావా?

వి: శాస్త్రిగారూ, ఆ అబ్బాయినలా ఇరుకునపడేస్తే ఎలా? సావకాశంగా ఆలోచించుకోనివ్వండి. ఏది మంచిదనితోస్తే అలాగే చేస్తాడు. మనఅవసరంకోసం అతనిని తొందరపెట్టడం తప్పుకదూ రామమూర్తిగారూ, తర్వాత ఉత్తరం రాయిస్తారుకదూ? మరి మాకు సెలవిప్పించండి.

[రామమూర్తి సందిగ్ధంగా గోపివైపుచూస్తాడు.]

శే : ఉత్తరాలమీద పనులవుతాయటండీ? అదీకాక అతగాడి షరతులేవో తీరేటేవున్నాయికదూ? ఏమంటారు రామమూర్తిగారూ? ఇద్దరికీ కావలసినవాడిని గనుక చెబుతున్నాను. మనకి కావాలన్నప్పుడు ఇలాంటి సలక్షణమైన సంబంధం దొరుకుతుందని నమ్మకమేమిటి? మాటవరసకి అంటున్నాను.

వి : ఎంతమాట! అతనికేంలోటండీ? ఎప్పుడు కావాలంటే అప్పుడే చక్కటి సంబంధం దొరుకుతుంది. రామ్మూర్తిగారూ, తమరు అబ్బాయి అభిమతం కనుక్కుని త్వరలో మన శాస్త్రిగారి చేత కబురు చేయిస్తారుకదూ? ఓ ఉత్తరంముక్క రాయించినా చాలు.

(ఆశగా) ఏరా గోపీ?

[గోపీ నిరుత్తరుడై దిక్కులు చూస్తాడు]

ఒక్కక్షణం ఆగండి, విశ్వనాథంగారూ, వాళ్ళ అమ్మతో కూడా మాట్లాడి పెళ్ళిచూపులకి రావటానికి ఎప్పుడు వీలవుతుందో చెబుతాను.

[విశ్వనాథం, పేరయశాస్త్రి మినహా అందరూ నిష్క్రమణ.]

: ఏమిటేమిటీ! మీకింత బాగా హస్తసాముద్రికం వచ్చని నాకు తెలీదే! ఎంత చక్కగా ఫలితాలు చెప్పారు. ఏదీ, నా విషయం కూడా కాస్త......

: ఆఁ! నాకేం వొచ్చండీ!

: అలా అంటారేం? రాకపోతే ఎలా చెప్పారు మరి?

: ఆ మాత్రం చెప్పటానికి సాముద్రికంలాంటి శాస్త్రాలు రావాలండీ? ఏమిటి, అలా ఆశ్చర్యపడతారు!

: (విస్తుపోతూ) అయితే ఇదంతా బూటకమే! కాని వాళ్ళ మనసుల్లో ఉన్నవీ, కొన్ని జరిగినవీ కూడా చెప్పినట్టున్నారే!

: మిడతంభొట్ల జోస్యం! అంతే!

: (కొంచెం బాధగా) గోపాలరావుకి గవర్నమెంటు కాలేజీ లెక్చరర్ అవుతుందని చెప్పారు గదండీ, పాపం.

: ఎందుకు కాకూడదు? ఖాళీలున్నాయని పేపర్లో చూశాను. ఇతను దరఖాస్తు కూడా పెట్టాడు. బహుశా ఇంటర్వ్యూకు పిల్చి ఉంటారు. ఆ బల్లమీద కవరు చూశారూ? దాని మీద సర్వీస్ కమిషన్ ముద్ర ఉంది. కొత్తగా ఆనర్స్ ప్యాసయినవాడు దేనికి దరఖాస్తు పెడతాడు ఈ రోజుల్లో? సామాన్యంగా లెక్చరర్ పోస్టుకే కదూ? యూనివర్సిటీఫస్టు. ఇవాళ కాకపోతే రేపైనా రాదా ఏమిటి గవర్నమెంట్ ఉద్యోగం?

: (ఆశ్చర్యపోయి) రామ్మూర్తిగారి కేదో ఆశ పెట్టారు!

: తోటిక్లీపర్ని కదండీ. అలాంటి ఆశే నాకూ ఉంది. పైగా పరిస్థితులు విచారించిన మీదట ఆ మాత్రం చెప్పలేనా?

పే : వారి చిన్నబ్బాయి లాటరీలు వేస్తాడని ఎలా తెలిసింది మీకు?

వి : స్కూలుపిల్లలకి అలాంటి ఊహాలూ, అలవాట్లూ ఉంటూంటాయి కదండీ! ఏదో ఊహించి అన్నాను. తమాషాగా అది సందర్భానికి సరిపోయింది.

పే : అమ్మాయికైనా అలా అఖండమైన అదృష్టం కలుగుతుందని చెప్పకుండా ఉంటే బాగుండేది. తీరా, అదృష్టం కలిసిరాక ఆశలన్నీ అడియాసలైతే మనసు సరిపెట్టుకోవటం ఎంతకష్టమౌతోందో, పాపం.

వి : శాస్త్రిగారూ, ఆ పిల్లని చూస్తే అలా అనిపించిందండీ. నిజంగా చెయ్యెత్తి దీవించాలని గుండె కొట్టుకులాడింది. బంగారపు బొమ్మండీ. ఆ ముఖంలో ఏదో నిరాశ, జాలికనిపిస్తుంటే మనసుండబట్టలేదు. తప్పకుండా అ అమ్మాయికి మంచి సంబంధం వస్తుందని నాకు నిజంగానే అనిపిస్తోందండీ.

పే : శుభం. కాని మీరిలా మిడతంభొట్ల జోస్యం చెప్పారని వాళ్ళకి పరిస్థితులు అనుకూలించక తెలిసిపోతే ఏం బావుంటుంది, చెప్పండి?

వి : (కొంచెం బాధగా) నిజమే. కాని నన్నేం చెయ్యమంటారు శాస్త్రిగారూ? కావాలని కల్పించి నేనలా చెప్పలేదంటే మీరు నమ్ముతారా?

పే : ఏదో దైవప్రేరణ అంటారు.

వి : అదికాదు. కష్టాల్లో ఉన్న వ్యక్తిని చూస్తే ఒక్క మంచిమాట, ఒక్క చల్లనిమాట అతనితో అనాలనిపించదూ?

పే : అనొచ్చు కాని...

వి : వాళ్ళందరి ముఖాల్లో ఏదో నైరాశ్యం, నిస్పృహ కళ్ళకి కట్టినట్టు కనిపించాయండీ. మీరు గమనించలేదేమో. కాని వారు పడే ఇబ్బందుల్లాంటివి నేనూ పడ్డవాణ్ణే. జీవితంలో ఎన్నోసార్లు ఆశాభంగం పొందినవాడిని. అందువల్ల సానుభూతి విలువ ఏమిటో నాకు తెలుసు.

పే : సానుభూతి చూపించవచ్చు కాని...

: ఆధారాల్లేని ఆశలు కల్పించానంటారా? నాకు భవిష్యత్తులో నమ్మకముంది. మనిషికి ఉత్సాహాన్ని మించిన మందు లేదు. ఎదుగు తెన్నులు చూసే అవకాశం కల్పించటం తప్పంటారా?

: కాదేమో. కాని ఇదంతా మీరు స్వలాభాపేక్ష లేకుండానే చేశారా? అలా అడిగినందుకు క్షమించండి.

మరేం ఫరవాలేదు. అడగవలసిన ప్రశ్నే. తర్కిస్తే అంతరాంతరాలలో స్వార్థం కొంత ఉండే ఉంటుందేమో. ఆ అబ్బాయి అలా మొండి పట్టుపట్టాడు. ఆపరతులు నెరవేరితే నేను చెప్పాలు అరిగేట్టు ఇంక తిరగవలసినపని ఉండదు. అతని ఉద్దేశాలు నెరవేరతాయనే నమ్మకం అతనికి కలిగించటానికి నేను ప్రయత్నించానేమో, నేను చెప్పలేను. కాని తెలిసే మనసుని మోసగించలేదని మాత్రం చెప్పగలను.

(సవేశించి సంతోషంగా) విశ్వనాథంగారూ, వొచ్చే ఆదివారం ఉదయం పెళ్లిచూపులకి రావటానికి మావాడు ఒప్పుకున్నాడండీ.

సంతోషం. మరి ఆరోజు మీకోసం ఎదురు చూస్తాంటాం. తప్పకుండా వొస్తారు కదూ?

నేను వెంటపెట్టుకుని వస్తాను కదండీ!

[అందరూ నవ్వుతారు]

వి : మరి మాకు సెలవిప్పించండి.

రా : శుభం.

[విశ్వనాథం, పేరయ్యశాస్త్రి నిష్క్రమణ]

ఒరే గోపీ, పద్మా, కిష్టూ! రండర్రా, ఇవ్వాళ్టినించీ మనకన్నీ మంచిరోజులే.

గో : (ప్రవేశించి) అది ఏరోజు కారోజు అనుకునేమాటే!

ప : (ప్రవేశించి) ఇవాళనించీ రాత్రి పన్నెండింటికి అలారం పెట్టుకుని మరీ ఆమాట అనుకో.

గో : (అర్థంకాక) ఎందుకూ?

ప : అలా ఉలిక్కిపడతావేం? తెల్లారితే ఆదివారం కాదులే.

గో : (గ్రహించి) తెల్లారి ఆదివారమైతే రావాలిసిన ఉత్తరం ఓ రోజు ఆలస్యమౌతుందని కాబోలు నీ బెంగ!

[బయటినించి కేక-'పోస్టు సార్' గోపీ, పద్మా, కిష్టు గబగబ ద్వారంవైపుకి నడుస్తారు]

రా : (తనూ ద్వారంవైపుకి తొందరగా నడుస్తూ ఉత్సాహంగా) అబ్బబ్బ-అలా పరిగెత్తకండర్రా నెమ్మదిగా.

[తెలు]

# సప్తద్వీపా వసుమతీ

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ఆర్యులు భారతదేశంనుండి బయలుదేరి ఉత్తరంగాను, వాయవ్యంగాను ఇతర దేశాలకు వెళ్లి ఆయాదేశాలలో స్థిరనివాసాలను ఏర్పరచుకొన్నారని సెప్టెంబర్ భారతిలో నిర్ధారణచేసినాము. దీనికి మరొక ఆధారము మన పురాణాలలో కన్పిస్తున్నది. ఈ పురాణేతిహాసాలలో భూమి ఏడు ద్వీపాలతో నిండినదని చెప్పబడినది. వీటిని ఊహాగానంక్రింద త్రోసివేసినారు పరిశోధకులు. ఈ విషయాన్ని పరిశీలించి, ఇందులో కన్పించే సత్యాన్ని గ్రహించటం చాలా అవసరము.

పూర్వకాలంలో ప్రముఖరాజుల పేర్లు వారు పాలించిన ప్రాంతాలకు కూడా సంక్రమించినవని ముందుగా మనము గుర్తుంచుకోవాలి. పురాణాలలో కన్పించే పేర్లు నేడు వ్యవహారంలో చాలా తారుమారైనవి. ఈ మారిన పేర్లకు సరియైన అర్థం చెప్పకోవాలంటే ఆ సంస్కృత శబ్దాలకు పోయి తీరాలనేది రెండవ విషయం. ఈ పేర్లు మన పురాణాలలో నిలచినవంటే ప్రాచీన భారతీయులు విదేశాలకు వలసపోవటమే కాకుండా, వారు తమ మాతృభూమితో వైజ్ఞానిక, వాణిజ్య సంబంధాలను నిలుపుకొన్నారనేది మూడవ విషయము. ద్వీప శబ్దానికి దేశమని అర్థం నేడు చెప్పకోవటము అవసరము.

స్వాయంభువమనువు కుమారుడు ప్రియవ్రతుడు. ఈయనకు మొదటి భార్యవలన ఉత్తమ, తామస, రైవతులు జన్మించారు. రెండవ భార్య బర్హిష్మతి, ఈమెవలన అగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేతస, గృహపృష్ఠ, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కలి, ఊర్జస్వతీ అనేవారు జన్మించారు. వీరిలో మహావీర, సవన, కలి అనేవారు సన్యాసాశ్రమాన్ని స్వీకరించినారు.

తన తండ్రి ఆస్తిలో జంబూద్వీపానికి అగ్నీధ్రుడు అధికారి ఐనాడు. ఈయనకు తొమ్మిదిమంది పిల్లలు కలిగినారు. మొదటివాని పేరు అజ, అజనాభ, నాభి అని కన్పిస్తుంది. మిగిలినవారి పేర్లనుబట్టి కింపురుష, హరి, ఇలావృత, రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాల వర్షాలు వచ్చినవి. అజశబ్దము నుంచి ఆసియా వచ్చినది.

జంబూ శబ్దము వృక్షనామము. ఈ వృక్షాలు విరివిగా కన్పించే దేశము జంబూద్వీపము. నేటికిగూడా మన దేశంలో ఒక భాగాన్ని జమ్ము అని పిలుస్తున్నాము. హిమాలయాలలో ప్రవహించే నదులకు టిబెట్ దేశస్థులిచ్చిన పేర్ల చివర సన్పో లేక త్సన్పో అనే శబ్దం కన్పిస్తుంది. ఇది జంబూ శబ్దమే.

ఈ జంబూద్వీపస్థులు ఈజిప్టుదాకా వలసపోయినారని చెప్పటానికి ఆధారాలు చాలా ఉన్నవి. ఈజిప్టు చరిత్రలో కన్పించే హశావనిభు శబ్దము అజనాభ శబ్దమునుంచి వచ్చిందని ఒప్పుకోక తప్పదు. గ్రీకుదేశపు దేవుడగు బాకస్, ఈజిప్టులో నున్న ఒసిరిస్ అనే దేవత ఒకటే. మేరోస్ అనే పర్వతంమీద ఈ దేవత విద్యనభ్యసించెనని లెంప్రీర్ నిఘంటువులో సహితం చెప్పబడినది. ఇది మేరుపర్వతము. ప్లినీ ఈ ప్రదేశమును నైస అని పిలచినప్పుడు నిషధశబ్దభవము దానిలో కన్పించగలదు.

ఈజిప్టులో నైలునది ప్రధానమైనది. దీనిని వారు నీలపునైల్ అని ఆప్యాయంగా పిలుస్తారు. వస్తుతః నైల్ శబ్దము సంస్కృత నీలశబ్దమునుంచి వచ్చినదే కావటంచేత నీలపునైల్ అనేవారు ఆ నదీనామమునకుగల అర్థాన్ని మరచిపోయినారన్నమాట. అనగా ఒకానొకప్పుడు ప్రపంచంలోని ఆయా ప్రాంతాలకు, నదులకు, కొండలకు భారతీయులు సంస్కృత నామాలిచ్చినారని, ఆ పేర్లు క్రమక్రమంగా మారిపోయినవనీ, ఈ మార్పులతో వాటి అసలు అర్థాలు విస్మృతమైనవని స్పష్టముకాగలదు. అసలు అయిగుప్టస్ అని నైలునదియొక్క మొదటిపేరు.

ఈ శబ్దము అజశబ్దమునుంచి వచ్చినది. అజమనగా మేక. ఖ్నుము అనే దేవతకు వెనుకరోజులలో ఈజిప్ట్ దేశస్థులు మేకతల నిచ్చినారు. అమల్థెయియా అనే మేక పెంచటంచేతను, మేకతోలును డాలుగా కట్టుకొనటంచేతను జుపిటర్ అనే దేవతను వీరు జుపిటర్ అజియోకస్ అన్నారు. మేకపాదాలుండటంచేత పాన్ అనే దేవుడిని పాన్ అజిపాన్ అన్నారు. ఇచట అజ ఏకపాత్ కన్పించకపోదు. కొరింథియా తీరంలో జుపిటర్‌ను మేక పెంచిన ప్రదేశాన్ని అజియం అన్నారు. గ్రీసియాలోగల అజియోస్‌పొటామస్ అనే నగరనామానికి మేకయొక్క నది అని అర్థము. మెసెడోనియా అనగా మేకలలోయ. దీనికి పూర్వరూపము మేషద్రోణ శబ్దము కావచ్చును. మేకలననుసరించి మెసెడోనియా రాజు పట్టుకొన్న ఎడెస్సానగరాన్ని అజియస్ అన్నారు. ఈ అజశబ్దము ఈజియన్ సముద్రమనే పేరులోను, ఈజిప్ట్ అనే నామంలోను కన్పిస్తుంది.

దక్షప్రజాపతికి మేకతల ఉన్నట్లు ఖ్నుము అనే దేవతకు మేకతల నిచ్చినారు. ఈజిప్ట్‌ను పాలించిన ఫారోలు ర అనే సూర్యదేవుని సంతతివారట! ఈ ర అనే దేవత రవి. ఈ రవిని ఈజిప్ట్ దేశంలో వానరాలను పోలిన రెండు జంతువులు పూజించటం కద్దు. నాగలోకంలో సూర్యుని హయశిరస్ అని అంటారని ఉద్యోగపర్వం (99.5) చెప్పుతున్నది. ఈజిప్ట్‌లో రవిని హార్మెయిసిస్ అనికూడా పిలిచారు. ఈ దేశంలో హోరుస్ అనే గరుడుడు, ఉరెయస్ అనే ఉరగము కూడా ఉండేవి. పరశురాముడు, ఆయన గండ్రగొడ్డలి లేకపోతే ఈజిప్ట్ దేశపు ప్రాచీన చరిత్రయే లేదుకదా! గరుడుడు, నాగులు శాల్మలీద్వీపానికి వలసపోయినారని భారతీయ సంప్రదాయమే చెప్పుతున్నది.

ఐదవ వంశానికి చెందిన ఫారోలలో ఉశిర్కరి అను, అనే రాజు క్రీ. పూ. 3900 నుంచి క్రీ. పూ. 3875 వరకు పాలించినాడు. ఇక్కడ ఉశీనర ఆనవ శబ్దము కన్పిస్తుంది. ఉసిర్తసేన్ అనే పేరుగల ముగ్గురు ఫారోలున్నారు. ఈ శబ్దానికి పూర్వరూపము ఆర్షిసేన కావలెను. మూడవ ఉసిర్తసేనుడు అలక, తురసుల నోడించినాడట. వీరే అలకా, తుర్వసులు. ఈజిప్ట్ రాజులలో మెంథోత్పు అనే రాజు, ఆయనకొడుకు అహ్మోసిస్ కన్పిస్తారు. వీరు మాంధాత, అంబరీషులని ఒప్పుకొనక తప్పగు. సంవత్సరాదిన చేసికొనే పండుగను వీరు ఉగఇత్ అన్నారు. ఇదే ఉగాది అనే శబ్దము.

ఈజిప్ట్‌ను క్రీ. పూ. ఏడవ శతాబ్దంలో తర్హాక అనే ఇథియోపియా రాజు పాలించినాడు. ఇది తారకాసురశబ్ద మనటంలో సందేహంలేదు. అజనాభుని సంతతివారైన భారతీయులు ఆఫ్రికాలోకూడ స్థిరనివాసాల నేర్పరచుకొన్నారని దీనితో స్పష్టమగుచున్నది.

చాల్డియాలోని షగ్గనిమరలీంలో దేవ వృషభానికి గిల్గమెస్ నీరు పెట్టుతున్న దృశ్యమొకటున్నది. ఇది ఋషభ శబ్దానికి వృషభశబ్దంతో వచ్చిన కలయికవలన గలిగియుండవచ్చును. ఋషభావతారము భాగవతంలో (5.4) కన్పిస్తుంది. ఋషభుని పుత్రుడైన భరతుడు రహూగణునకు వేదాంతము నుపదేశించినాడు. ఈ రహూగణుడే షర్గన్ ఐనాడు. వృషభపూజ క్రీట్ దేశానికికూడా వ్యాపించినది. ఋషభుడు భారతదేశానికి నామకరణ మిచ్చిన భరతునితండ్రి. ఈయన అజనాభుని కుమారుడు, ఋషభుడు జయంతిని పెండ్లాడెనని, ఆమెకు భరతుడు జన్మించెనని భాగవతము (11.2.19) చెప్పుతున్నది. ఈ భరతునికి తొమ్మిదిమంది తమ్ములున్నారు. కుశావర్త, ఇలావర్త, బ్రహ్మావర్త, ఆర్యావర్త, మలయకేతు, భద్రసేన, ఇంద్రస్పృక్, విదర్భ, కీకట శబ్దాలు వీరిద్వారా వచ్చినవి.

అగ్నీధ్రుని సంతతిలో ఇలావృతశబ్దము కన్పిస్తుంది. ఆల్టై పర్వతాలకు చెందిన జుంగరియా శ్రేణిలో ఇలి అనే నది ఉన్నది. దీని ఉపనదిఒడ్డున వెర్నో అనే నగరమున్నది. ఇది వరుణశబ్దము. వరుణుని నగరమును నిమలోచని అని భాగవతము (5.21.6) పేర్కొన్నది. ఇదే అస్సీరియాలో నిమ్రోడ్ అని కన్పిస్తున్నది. దీనికి దక్షిణముగా యముని నగరమైన సంయమనీ పుర మున్నదన్నారు. అరేబియా సముద్రంలోకి దారితీసే సొన్మియన్ అఖాతపు తీరంలో సొన్మియని అనే ఊరు నేటికీ ఉన్నది.

ఈ ఇలావృతవర్షములో మధ్యగా మహామేరు వున్నది. దీనికి తూర్పుగా భద్రాశ్వవర్షము, పశ్చిమంగా కేతుమాలవర్షము ఉన్నవని వాయు(34), మత్స్య(113) పురాణాలు చెప్పినవి. ఈ మేరు పర్వతంనుంచి అనేక పర్వతాలు బయలుదేరినవి. వీటిలో కురంగ (కుయెన్‌లెన్), కురకర (కరకోరం), కుసుంభ (హిందుకుష్),

వైకంటక (విటిం), త్రికూట (ఇరుక్కుట్స్కు), శిశిర (త్రైత్సిహర్), పతంక (పెలింగ్), నిషాధ (త్రైన్షన్), శితివాస (స్తనవాయ్), కపిల (యుహ్లనోయ్), శంఖ (ఖింగన్), వైడూర్య (వెర్ఖోయియనోక్), చారు విహంగ (కౌముఘట్కు), రుచక (గుష్య) అనే పేర్లు కన్పిస్తవి. ఇలావృతవర్షానికి దక్షిణంగా హరివర్షము (ఉత్తర టిబెట్), కింపురుష వర్షము (దక్షిణ టిబెట్), భారతవర్షము గలవని, ఉత్తరంగా నీల, శ్వేత, కురు వర్షాలున్నవని వాయు (34 28-31), మత్స్య (113.28-31), విష్ణు (2.2.10-13) పురాణాలు, భీష్మ పర్వము (6.4-9) పల్కినవి.

ఈజిప్, అస్సీరియాలవారు హిత్తైతీలను ఖేతులని, ఖతి అని పిలచినారు. ఈ ఖేతులున్న భూమి కేతుమాల వర్షము. పశ్చిమ పర్షియా, తుర్కిస్థాన్ల మధ్యదేశమిది. శతపథంలో కన్పించే మనువు నిర్మించిన నౌబంధనము ఈప్రాంతంలో నెహ్బందర్ పర్వతశ్రేణిగా మారింది. తూర్పు పర్షియాలో నేటికీ నేయ్‌బందన్ అనే నగరమున్నది. ఇరాన్‌లోని కుబేర్ కోహ్, ఖైబరు కనుమ అనేవి కుబేరునినుంచి వచ్చినవేకదా!

ఇధ్మజిహ్వునకు సంక్రమించినది ప్లక్ష ద్వీపము. అస్సీరియా దేశచరిత్రలో ఇష్మిదగాన్ అనే మొట్టమొదటి రాజు కన్పిస్తాడు. ఈయన కుమారుడు షమష్ రమన్. ఈ పేరుకు పూర్వరూపము క్షేమశబ్దంలో కన్పిస్తుంది. ఇధ్మజిహ్వునకు శివ, యశస్య, సుభద్ర, శాంత క్షేమ (క్షేమక), అభయ, అమృతులనే ఏడుగురుకొడుకులున్నారని భాగవతము(5.20). అస్సీరియా పాలించిన రెండవరాజు షమష్ రమన్. ఇంతే కాకుండా నిమ్రోద్‌లో పాలించిన మేషరాజు పూజించిన దేవుళ్ళలో ఖేమోష్ అనే దేవుడున్నాడు. ఆసియాలోగల తుర్కిస్థానును శివులు పాలించారు. పర్షియాలో యజ్ద్ కన్పిస్తుంది. సుభద్ర శబ్దము కబర్దగాను, అభయ శబ్దము అరేబియాగాను మారింది. అమృతశబ్దము అర్మీనియా కావచ్చును. ఇర్మక్ నదితీరములో అమెసియా ఉన్నది.

ఈ ప్లక్షద్వీపానికి లవణసముద్రమును చెప్పినారు. దీనిని క్షారసముద్రమని కూడా అన్నారు. నేడు ఖోరసాన్ అని పిలువబడేది క్షారసముద్రమే. ఈ ద్వీపంలో అరుణ, అంగిరసీ, సత్యంభరా, సుప్రభాతా, సృమణ అనే నదులుండేవి. సిరియాలోని ఒరెన్‌టిస్‌కు ప్రాచీన నామము అరుణ. అంగిరసీ నది అనటోలియాలోని షంగరియస్. నేడు టైగ్రిస్ అని పిలువబడే నదిని ప్రాచీకాలంలో షత్తెలమర అన్నారు. ఇది సత్త్యంభర. సుప్రభాతా నది యూఫ్రటిస్‌గా మారినది. స్మర్నా అనే నగరము నేడుండేచోట సృమణానది ఉండవచ్చును. ఈద్వీపంలో మణికూట (మనిష్ట్) ధూమ్రవర్ణ (ధూమస్లు) మేఘమాల (మేగ్ఖంచ్) ఇంద్రసేన (అందిష్) వజ్రకూట (బజగ్గొల్పు) పర్వతాలున్నవి. ఈ పేర్లను పరిశీలిస్తే అర్థవంతమైన నామములు సంస్కృతంలోనే కనిపిస్తవి. భారతీయులే ఈ పేర్లను స్థిరపరచినారని స్పష్టముగా చెప్ప విలున్నది.

శాల్మలీ ద్వీపము యజ్ఞబాహువునకు వచ్చినది. ఇచ్చట ఇక్షుసముద్రమున్నదన్నారు. ఈజియన్ సముద్రంలో ఒక భాగానికి నేటికీ మర్ ఇకారియం అని పేరున్నది. ఇక్షు శబ్దము ఇక అని మారింది. ఉత్తర ఆఫ్రికాలోని నూబియా ప్రాంతంలో శాల్మి, ఎల్ సొలిమనిష్‌లు ఉన్నవి. సోమాలి దేశముకూడా ఉన్నది. యజ్ఞ బాహువుయొక్క ఏడుగురు కొడుకులు వారి వారి పేర్లను ఆయా ప్రాంతాలకిచ్చారు. సోమాలికి పడమరగా సుడాన్ ఉన్నది. ఇది సురోచనునికి చెందినది. సౌమనస్యుని ద్వారా సౌనాన్, రమణకుని వలన మూరాకోలోని రిహామ్న, దేవబర్హుని నుంచి థేబముద్ అని పిలువబడు ఉత్తర ఈజిప్ట్, పరిబర్హుని వలన బర్బరి, ఆప్యాయనునినుంచి అబిస్సీనియా, అభిజ్ఞాతుని ద్వారా అబైనది ప్రవహించుప్రాంతము అన్వర్థములైనవి. ఇచట అమృతి (అబియద్) సినీవాలి (నైల్ వద్దగల స్యైని) సరస్వతి (సొబత్) కుహూ (హోవష్), రజని (రట్చిని) నందా (నున్) రాకా (బరాక్) నదులుండేవి. శాల్మలీద్వీపమున గరుడుని నివాసముండేదట. దక్షిణ ఈజిప్ట్‌లో చాలాకాలము వరకు గరుడుడే పతాకాచిహ్నముగా గ్రహించబడినాడు.

హిరణ్యరేతసునకు వచ్చినది కుశద్వీపము. ఇచట ఘృతోదధి ఉన్నదన్నారు. ఘృతశబ్దము నేడు క్రీట్ అని పిలువబడు కృతిశబ్దమునకు మూలరూపము. హిరణ్యపురమైన ఇరాన్‌నుంచి ఇచటికి వచ్చిన హిరణ్యరేతసునకు ఏడుగురు పుత్రులున్నారు. వసుదానుడు మసెదోనియాను, దృఢరుచి థ్రేసియాను, నాభి నౌపాషియాను, గుప్త అనువాడు కోపియస్‌ను,

సత్యవ్రతుడు స్పార్టాను, లిప్రుడు ఎపిరస్‌ను, వామదేవుడు ఎమధియా అనబడ్డ థెస్సలీని బయటకు తెచ్చినారు. ఇచట రసకుల్య (ప్రిసియ) శ్రుతవింద (సరంద) దేవగర్భ (డెలియ) ఘృతచ్యుత (అక్రత్), మంత్రమాల (మంద్ర) అనే నదులు చెప్పబడినవి. బభ్రు (గ్రబోవో) చతుశ్శృంగ (ఒథ్రియా) కపిల (కొవ్వెలి) దేవానీక (డెల్ఫి) ఊర్ధ్వగోమ (వర్ధోలొమిక్) పర్వతాలు ప్రస్తుతించబడినవి. కుశద్వీపానికి చివర దధిమంతోదధి ఉన్నది. ఇది నేటి డల్మేషియా కావచ్చును. వస్తుతః హిరణ్యరేతశ్శబ్దము ట్రోజను వీరుడగు ఈనియాన్ పేరులో కన్పించకపోదు. ఈ శబ్దాలు సంస్కృత భాషను భారతదేశమును సూచించెవి. భారతదేశస్థులిలా ఈ దేశాలకు రాకపోతే ఈ పేరను సరిగా అర్థంచేసికోలేము.

గృహపృష్ఠునకు క్రౌంచద్వీపము వచ్చింది. దధిమంథసముద్రము ఇచ్చట గలదన్నారు. మెడిటరేనియన్ సముద్రమునకుల మొదటిపదానికి అంతర్మథనము అనే అర్థము సరిపోతుంది. గృహపృష్ఠుని ఏడుగురు కొడుకులు ఏడు ప్రాంతాలకు తమపేర్లనిచ్చినారు. మధువహుని నుంచి మాల్దేవియా, సుదాముని ద్వారా స్వీడన్(?) ఋషిజ్యుని వలన రష్యా, లోహితార్ణుని వలన లిథువేనియా వనస్పతినుంచి ఆస్ట్రియాలోని బనత్ బయలుదేరినవి. మేఘపృష్ఠుడు పాలించిన ప్రాంతము ప్రష్యా కావచ్చును. ఇచట కన్పించే ఆర్యకీనది తర్వాతి కాలంలో అరన్‌గామారి ఆపైన రైన్ ఐనది. ఈనదియొక్క ఉపనదులలో ఆర్క అనేది నేటికీ కన్పిస్తుంది. ఇచ్చట శుక్ల (మాంట్ బ్లాంక్) వర్ధమాన (వర్డె), భోజన (బోస్నియా) ఉపబర్హణ (పిరనీస్) సర్వతోభద్ర (కార్పథియన్) పర్వతాలు పేర్కొనబడినవి. పిరనీస్ పర్వతాలను ఆనుకొనియున్న ఒకభాగాన్ని ఇప్పటికూడా బెయర్న్ అంటారు.

శకద్వీపాన్ని గ్రహించినవాడు మేధాతిథి. ఈయన సంతతిలో పురోజవ (బరీషేవ), మనోజవ (మెజెక్), విశ్వాచార (పెట్స్చార), వేపమాన, ధూమ్రానీక, చిత్రరథ, బహురూపులున్నారు. ఈప్రాంతంలో ఉరుశృంగ (యూరల్) పర్వతమున్నది. ఈశాన, బలభద్ర, శతకేసర, సహస్రస్రోత, దేవపాల, మహానసపర్వతాలు ఆల్ప్స్‌లోను, రష్యా జర్మనీలలోను ఉండవీలున్నది. ఈ ద్వీపంలో ఆనఘూ (ఒనేగ), ఆయుర్దా (ఆయరాజ్), ఉభయవృష్టి (ఓబి), పంచపదీ (యనీస్), అపరాజితా (లేనా), సహస్రస్మృతి (సరిసూ), నిజధృతి (నిజ్నై) అనే నదులున్నవి. ఇచట చెప్పబడిన క్షీరసముద్రము అట్లాంటిక్ సముద్రమై ఉండవచ్చును. దీనికి ఉత్తరంగా శ్వేతదీపమున్నదని, ఇది విపరీతమైన ఉష్ణగోళమని శాంతిపర్వము(335,336) చెప్పుచున్నది.

వీతిహోత్రునకు పుష్కరద్వీపం వచ్చింది. ఇది అత్యుత్తర ప్రాంతం కావచ్చును. కాని ఇతనిపుత్రులు రమణక, ధాతకులని చెప్పబడుటచేత ఇది ధమనికోహ్ ప్రాంతం కావచ్చును. ఇచట కన్పించే అర్వాచీనపర్వతమే అరల్, ఐగుక పర్వతములు. ప్రాచీన పర్వతము పరక్కచేసెనగా కన్పిస్తున్నది. ఇచ్చట సాగ్దియానమున్నది. దీనినే భారతీయులు స్వర్గదేవయానమని ఉంటారు. ఈ పుష్కరద్వీపంలో లోకపాలుర నగరాలున్నవన్నారు.

ఆర్యులు భారతదేశమునుండి పశ్చిమముగాను, ఉత్తరముగాను మాత్రమే ఇతర దేశాలను కనుగొనలేదు. ఆ ప్రాచీన భారతీయులు దక్షిణంగాను, తూర్పుగాను కూడా వెళ్ళినారు. భారతదేశానికి దక్షిణంగా మహాసముద్రంలో. విద్యుత్ప్రాక్ పర్వతశ్రేణులలో అనేక ద్వీపాలు బయలుదేరినవని, ఇంవలి ప్రజలు పొట్టివారు, మేఘశ్యామవర్ణముగలవారు, ఫలపుష్పపత్రాలను తినువారు, అల్పాయువు గలవారని వాయుపురాణము (48) చెప్పినది. ఇవి గాక బర్హిణద్వీపముతో కలసిన ఏడు ద్వీపాలు ఇచట ఉన్నవన్నారు. బర్హిణ (బోర్నియో), అంగ, యవ(జావా) మలయ, శంఖ (సయాం), కుముద (కాంబోడియా), కుశ (కూస్), వరాహ(ఆస్ట్రేలియా) ద్వీపాలిక్కడ ఉన్నవి. అంగద్వీపము బాలిద్వీపము కావచ్చును నాగజాతికి ప్రధానమైన కేంద్రము అంగద్వీపమని, ఇచట మ్లేచ్ఛులున్నారని, చక్రపర్వతాలిక్కడ గలవని వాయుపురాణము (48. 17-18) చెప్పినది. వెండిబంగారు గనులు, గంధపుచెట్లు, మహామలయపర్వతముగల మలయ ద్వీపమున మ్లేచ్ఛులు గలరని, ఇచటనే అగస్త్యుని ఆశ్రమము కలదని వాయు (48. 20-29), మత్స్య (163. 74-78) పురాణాలు చెప్పినవి. నాగరాజగు శంఖముఖుడున్నది శంఖద్వీపము కుముదద్వీపమున ధర్మప్రవర్తన గలవారున్నారట. వరాహపర్వతము, వారాహీనదిగల వరాహద్వీపమున మ్లేచ్ఛులున్నారు.

ఇంతేగాక పాతాళలోకాలు ఏడున్నవి. వీటి వర్ణనను పరిశీలిస్తే ఈ ఏడింటి ఉనికి తూర్పునగాని, దక్షిణానగాని కన్పించాలి. తూర్పుసముద్రమున పాతాళలోకములు బయలుదేరుచున్నవని ఉద్యోగపర్వము (108.12) చెప్పుచు, పాతాళము వరుణునిచే పాలింపబడు దేశమని (99.11), ఇది నాగలోకమునకు హృదయమని (99.1) పల్కినది. వితలలోకము అశ్వశిరస్సుగల హయగ్రీవునిది (ఉద్యోగ 99.5, వాయు 50 21) అతల, వితల, నితల, తలాతల, మహాతల, రసాతలముల కన్నింటికి తూర్పుగా నున్నది పాతాళము. మనము పశ్చిమంగా బయలుదేరితిమేని ఇది అన్నింటికన్న పడమరగా ఉండేది కాగలదు. ఈ పాతాళంలో వాసుకి ప్రధాననగరమైన భోగవతీపురమున్నది. ఇచటనే బలిచక్రవర్తి ఆవాసము. ఈ ద్వీపానికి చిట్టచివర అనంతుని నివాసము గలదు. ఇచటనే సజీవమైన అగ్నిపర్వతాలనేకములు గలవని ఉద్యోగపర్వము (98.18,99, 17-19) చెప్పటంచేత ఇది దక్షిణ అమెరికాలోని చివరగలదనాలి.

భూమిమీద దక్షిణ దిక్కుగా చిట్టచివర నరకలోకము గలదని భాగవతము (5 26.4-6) దీని చుట్టూ జలమున్నదని రామాయణము (4.41.44-5) చెట్టుగాని నీరుగాని లేని మంచు ఎడారులనుంచి 99000 యోజనాలు వెళ్తే ఈ లోకము వస్తుందని భాగవతము (3 30 20-25) ఇది 86000 యోజనాల దూరంలో ఉన్నదని వనపర్వము (199), బ్రహ్మపురాణము (22 214) ఇది దైత్య, నాగదేశాల పొరుగున గలదని మత్స్యపురాణము (169 13) అంటే నరకలోకము అంటార్కిటిక్ ప్రాంతము కావాలి.

ఇదంతా, మనము అల్లే కట్టుకథ కాదనటానికి మరొక ప్రబలాధారమున్నది. అక్షాంశాలు, రేఖాంశాలు అనేవాటిని నేడు విరివిగా ఉపయోగిస్తున్నాము. గ్రీన్విచ్ శూన్యభాగమీద ఉన్నది. దీనికి దూరంగా ఉన్న దేశాలకు కాలవ్యవధి ఉంటుంది. ఒక్కొక్క భాగదూరానికి నాలుగు నిమిషాలు తేడా ఉన్నది. గ్రీన్విచ్‌లో మధ్యాహ్నం పన్నెండు గంటలైనప్పుడు, దీనికి 90 భాగల తూర్పుగా నున్నచోట్ల సాయంత్రం ఆరుగంటలు కాగలదు; దీనికి పడమరగా 90 భాగల దూరంలో ఉన్నచోట ఉదయం ఆరు గంటలౌతుంది. ఈ విషయం వాయు (50.94-105), మత్స్య (124.27-35), బ్రహ్మాండ (55.40-50) పురాణాలలో స్పష్టంగా చెప్పబడ్డది. విష్ణు (2 8.8-17), భాగవత (4.21.7-12) పురాణాలలో కూడా ఈ విషయం కొంత ఉన్నది.

ఇంద్రుని రాజధాని అమరావతి. దేవతలు భద్రాశ్వవర్షములో ఉంటారని, వారి రాజధానిపేరు అమరావతి అని భాగవతము (5.21.8). అమూర్ అనే నదీతీరంలో ఉన్న పట్టణము కావచ్చును. మేరుపర్వతానికి తూర్పున భద్రాశ్వవర్షమున్నది. అశ్వశబ్దము అస్సగా చాలచోట్ల మారింది. నేటి లాస్సనగరమున్న దేశము భద్రాశ్వము కావచ్చును యముని ముఖ్యనగరము సంయమనీపురము. సుధానగరము వరుణుని ముఖ్యపట్టణము. సోముని ప్రధాన నగరము విభావరి.

ఛాందోగ్యోపనిషత్తులోని మూడవ ప్రపాఠకంలో పదవఖండములోని నాలవ మంత్రముపైన వ్యాఖ్యచేస్తూ ఆచార్య శంకరులు కొన్ని ముఖ్యవిషయాల నిచ్చినారు. "వస్తుతః సూర్యుడు ఉదయించుట గాని, అస్తమించుట గాని లేదు. ప్రాణులకు తొలిసారిగా సూర్యుడు కన్పించటాన్ని సూర్యోదయమంటారు. సూర్యుడు కన్పడకుండా పోయినక్షణాన్ని సూర్యాస్తమయమన్నారు. మేరుపర్వత శిఖరానగల మానస సరోవరముమీదుగా సూర్యుడు ముందు కన్పించటంగలదు. అమరావతిలో మధ్యాహ్నము పన్నెండు గంటలైనప్పుడు సంయమనీపురమున సూర్యోదయమైనట్లు కన్పించగలదు. ఇదేసమయమున సుధానగరములో ఆ క్రిందటి అర్ధరాత్రిగా కన్పించగలదు. విభావరీ నగరమున అప్పుడు సాయంకాలము ఆరుగంటలు కాగలదు" అని భాష్యంలోగల భావసారాంశము. దీనినిబట్టి మానససరోవరమున్న కైలాస శిఖర ప్రాంతము శూన్యభాగమీద ఉన్నదనుకొనుము. దీనికి తొంబది భాగలు పశ్చిమముగా సంయమనీపురము నూటఎనభై భాగలు పడమరగా సుధానగరం. తొంబది భాగలు తూర్పుగా విభావరీ నగరము కలదని చెప్పవలెను.

ఈ విధంగా రేఖాంశలను నిర్ణయించినవారు భారతీయులు. ఈ భూమిపైనగల వివిధ భాగాలకు వారు గావించిన నామకరణములే నేటికి ప్రసిద్ధిలో నున్నవి. వీరు పెట్టిన పేర్లకే అర్థాలు కన్పిస్తున్నవి. ఇటువంటి సందర్భంలో ఆర్యులు భారతదేశానికి ఎక్కడనుంచో వలసవచ్చినవారనటం హాస్యాస్పదము. భారతదేశమే ఆర్యుల స్వదేశము. ఇచ్చటనుంచి ఇతరదేశాలకు వీళ్లు వలసవెళ్ళినారు. ఆ దేశాలకు పోయినా చాలా కాలందాకా మాతృభూమితో సంబంధాలను నిలబెట్టుకొన్నారు భారతీయులు.

# విపర్యయం

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి—శ్రీ కొండముది హనుమంతరావు

**పాత్రలు:** ప్రెసిడెంట్ ముఖర్జీ, మార్షల్ తివారీ, డాక్టర్ నారాయణ, మిస్టర్ జాకబ్, శాంతాతివారీ

## రంగము: 1

ప్రపంచం చీకటిముసుగును కప్పుకొనబోతున్న సమయం. డాక్టర్ నారాయణ పరిశోధనశాల ముందు హాల్లో బ్లూలైటు వెలుగుతోంది. కర్టెన్ తొలగించబడి ఆపరేటస్ అంతా గజిబిజిగా కన్పిస్తున్నది. ఉండి ఉండీ ఆరిపోతూ వెల్గుతున్న బల్బులూ, అసంఖ్యాకంగా వున్న తీగలూ, వాటిమధ్య చిక్కుబడ్డా బయటకు కన్పిస్తూనేవున్న స్విచ్ బోర్డూ - స్థూలంగా ఇదీ దాని బాహ్యరూపం.

[※ రంగస్థల వివరములకు 74-వ పేజీలోని చిత్రము, వివరణ చూడవలెను.]

డాక్టర్ నారాయణ, మనసు మనసులో లేనివాడులాగా ఆపరేటస్ ముందు నిలబడి తదేకంగా దానివంకనే చూస్తున్నాడు. మొహంలోని ఆవేదనా, ఉద్వేగమూ కన్పిస్తునే వున్నాయి. ప్రక్కగదిలో నుంచి రేడియో విలపిస్తున్న శబ్దం విన్పిస్తున్నది. డాక్టర్ నారాయణ మెల్లగా కదిలి హాల్లో ఉన్న రెండో నెం. ద్వారం దగ్గఱకు వచ్చాడు. ఎవరినో పిలవబోయాడు. కానీ పిలవలేక మెల్లగా అడుగులు వేసుకుంటూ వీథిద్వారందగ్గఱకు వెళ్ళబోతున్నాడు. ఇంతలో గదిలో నుండి చిన్నశబ్దం; తలుపు మెల్లగా తెఱుచుకున్నది. మిస్టర్ జాకబ్ హాల్లోకి ప్రవేశిస్తూ:

జాకబ్ : (మెల్లగా నవ్వుతూ) గుడ్ ఈవినింగ్ డాక్టర్!

నారాయణ: (పేలవంగా) గుడ్ ఈవినింగ్ !

జాక: ఇక నేను వెళ్ళవచ్చుననుకుంటాను. (ముందుకు రెండడుగులువేసి ద్వారందాకా వెళ్ళి, ఏదో జ్ఞాపకానికి వచ్చినట్లుగా) అఁ! డాక్టరుగారూ! ఎవ్వరో ఇవ్వాళ సాయంకాలం వస్తారన్నారు కదూ—నేనిక్కడ ఉండటం......

నారా: అవసరంలేదు.

జాక: థాంక్స్.

నారా: (కొంత విసుగ్గా) మిస్టర్ జాకబ్ !

జాక: ఓహ్ ! మీకు విసుగు కల్గించానట్లుంది.

నారా: కాదు జాకబ్ ! ఇవ్వాళ నా ఒంట్లో ఏమీ బాగాలేదు.

జాక: (ఒక్కసారి) అలాగా ! మాటమాత్రమైనా ముందుగా నాతో చెప్పగూడదా డాక్టరుగారూ!

అవసరానికి ఆదుకునేవాడిని—ప్రొద్దుటినుంచీ లాబ్‌లో నే పడికొట్టుకుంటున్నాను గద!

నారా: కృతజ్ఞతి.

జాక: ఇందులో కృతజ్ఞత ఏముంది. ఇది నా డ్యూటీయే. మీ అసిస్టెంటుగా వుంటున్నందుకు కనీసం ఆమాత్రమైనా సహాయంచేయ లేకపోతే—

నారా: కానీ—ఒకళ్ళను బాధించటం నా కిష్టం లేదు జాకబ్ !

జాక : బాధేముంది డాక్టరు గారూ !

నారా: కాదా? లాబరేటరీలో ఎలాగూ నీచేత పని చేయించుకుంటూనే ఉన్నాను. ఇంకా గృహ కార్యాల్లోకూడా నీకు నేను ఋణపడటం-నాచేతకాదు.

జాక: బాగానే ఉంది—మీ దృక్పథం ప్రకారం; మరి నా ధర్మంమాట? ఉదారులైన మీ నీడలో తల దాచుకుంటున్నవాణ్ణి. ఆమాత్రం చేయలేనా?

నారా: (కొద్దిగా బాధపడుతూ) చేయలేవని కాదు జాకబ్ ! నీచేత చేయించుకోవటం నా కిష్టం లేక.

జాక: అదే ఎందుకూ అని ?

రంగస్థల చిత్రం




ఊరికి దూరంగా, పూర్వీకుల మూలంగా తనకు సంక్రమించిన స్థిరాస్తిలో, డాక్టర్ నారాయణ క్రొత్తగా కట్టించుకున్న ప్రయోగశాల: ఎ. బి. సి. డి అదే అతని ప్రస్తుత నివాసంకూడా. ఆ ప్రయోగశాలకు వెనుక వేపుగా-బయటనుంచి అదాటున చూస్తే కనుపించకుండా వుండేటట్లుగా కట్టించిన గది. ఇ.జి.ఐ.కె. ఆగదిలోనుంచి ఆ ఇంటిలోపలకు ప్రక్కగా ఒక ద్వారం (3). వీధిలోనుంచి హాలులోకి ఒక ద్వారం (1); హాలులోనుంచి ఓ ప్రక్కగావున్న ముందుగదిలోకి మరో ద్వారం (2); ఇంతేగాక ప్రయోగశాలలోనుంచి వెనుకవైపుగా ఉన్న గదిలోకి ప్రవేశించిన తరువాత అక్కడినుండి బయటకు—అదేవీధిలోకి మరో ద్వారం (4); ఇట్లా ఆయింటికి మొత్తం నాల్గుద్వారాలూ. రెండుగదులూ, ఒక ప్రయోగశాలా, ఒక హాలూ వున్నాయి. మొత్తం యింటిని ముఖ్యంగా హాలును విభాగిస్తున్నట్లుగా ఉన్న పట్టుతెర (*....*)

హాలు చాలా అందంగా, హుందాగా అలంకరించబడిఉంది. గోడలకు డాక్టర్ రామన్, డాక్టర్ ఐన్‌స్టీన్ ప్రభృతుల పటాలూ-క్రింద నాలుగయిదు పేముకుర్చీలూ ఒక టీపాయ్, గదిగోడలకు రెండు మూడు సైన్సుకు సంబంధించిన ఛార్టులూ, డాక్టర్ నారాయణ తన యౌవనంలోని బిగువు సడలకముందు తీయించుకున్న ఫొటో ఒకటి ఉన్నాయి. ముందువున్న గదిలో (I) పెద్ద అలంకరణయేమీ లేదు. క్రింద నేలమీద ఒక కంబళి, మూలగావున్న ఓ చిన్నసైజు రేడియో, దానిప్రక్కగా ఫ్లవర్ వేజ్-ఇంతే ఉన్నవి.

వెనుకవైపునున్నగది (1I) లోని వస్తువులు మనకచీకటిలో మనకంతగా కన్పించకపోయినా గదిద్వారం మాత్రం కన్పిస్తే చాలు.

నారా: కొన్నింటికి ప్రశ్న లేకాని జవాబులు ఉండవు జాకబ్!

జాక: డాక్టరుగారూ! ఇంకా నన్ను నమ్మలేకుండా ఉన్నారు మీరు. సరిగ్గా అయిదు సంవత్సరాల క్రితం—ఇదేరోజున—మీ క్రింద అసిస్టెంటుగా చేరాను. జ్ఞాపకం ఉందా? బయట వాతావరణం చాలా భీభత్సంగా ఉంది.

నారా: అవునవును.

జాక: వర్షం కుండపోతగా పడుతున్నది. ఒకటే చలి. ఎలక్ట్రిసిటీ కనెక్షన్ తెగిపోయింది.

నారా: అవును. అప్పుడే నువ్వు, బయటినుంచి, వణికి పోతున్న కంఠంతో 'డాక్టరుగారూ! డాక్టరు గారూ!' అంటూ—

జాక: అవును. అప్పటి నా మనఃస్థితి—ఇప్పుడు చెప్పి కున్నా ప్రయోజనం లేదు. విజ్ఞానంకోసం వచ్చాను...

నారా: నేను కాదన్నానా?

జాక: అవుననలేదు. అంతే!

నారా: ఏమిటీ?

జాక: అవును డాక్టర్! అరమరికల్లేకుండా నా జీవితాన్నే మీగుప్పిట్లో వుంచాను. భద్రంగా, అనేక సంవత్సరాలుగా నా హృదయంలో దాచుకుంటున్న రహస్యాలను మీకు వెల్లడించాను. నా తండ్రి ఎందుకు భ్రష్టుడైందీ, నా తోబుట్టువులందరూ ఎందుకలా పతితులై, నికృష్టులచేతకూడా 'ఛీ! ఛీ!' అనిపించు కుంటున్నదీ...అన్నీ మీకు చెప్పాను—చెప్పలేదూ?

నారా: చెప్పావు.

జాక: ఇంకా అనేకం చెప్పాను. ఆమెనుగురించి—అవును ఆమెనుగురించికూడా చెప్పాను. అయినా ఆమెనెల్లా మర్చిపోను! ఆమె నివసించే ఆ రాజభవనం చూస్తేనే నాఒళ్లు జలదరించేది. ఆమె ధరించిన ఆభరణాలు, ఆమె కట్టుకున్న వస్త్రాలు—ఓహ్! యోజనం మేర ఆమె రాకను ఆమె పూసుకున్న సుగంధద్రవ్యాలే తెలిపేవి. అయినప్పుడు ఎట్లా మర్చిపోనామెను?

నారా: నిజమే జాకబ్! ప్రతిమానవుడి జీవితంలోనూ ఎప్పుడో ఒకప్పుడు ఇటువంటి దురదృష్టకరమైన సంఘటనలు తటస్థపడుతూనే ఉంటాయి. కాని దానికి మనం ఏంచేయగలం? ఒక్కకన్నీటి బిందువు...ఒక్క నిట్టూర్పు. అంతేనా? మనకు మిగిలేది ఆ జ్ఞాపకచిహ్నాలే!

జాక: నిజమేనండి డాక్టరుగారు! నేను అందుకు కాదు విచారపడుతున్నది. ఇంతగా నామనసులోని ఆవేదనను మీముందు వెళ్ళబోసుకున్నా—ఎన్నడైనా మీరు మాటవరుసకైనా, మర్యాదకైనా, మీ మనసును విప్పి చెప్పి మన్ననచేశారా? నాకు తెలుసును డాక్టర్! ఎందరెన్నివిధాలుగా ప్రయత్నించినా అంతస్తుల భేదం అంత త్వరితంగా సమసిపోదు.

నారా: ఎంత పొరపాటుపడ్డావు? అంతస్తుల భేదమా? రహస్యాలేమీ లేవనిగానీ—

జాక: ఇప్పుడేకదు డాక్టరుగారూ!—మీరు చెప్పింది, ప్రతిమానవుడికీ కొన్నిరహస్యా లుంటాయని. ఇంతలోనే మర్చిపోయారా? అందులోనూ ముఖ్యంగా ప్రతి మగవాడి జీవితంలోనూ కొందరు ఆడవాళ్ళు ప్రముఖపాత్ర వహిస్తారని.

నారా: (సిగరెట్టు వెలిగిస్తూ) సిగరెట్ తీసుకుంటావా?

జాక: (తీసుకుంటూ) థ్యాంక్స్?

నారా: ఈ సిగరెట్టులాగానే మన జీవితాలు కూడా మెల్లమెల్లగా దహించుకుపోతున్నాయ్?

జాక: ఆర్పేయండి.

నారా: జీవితాన్నా?

జాక: అదేమిటండీ, సిగరెట్టు నార్పేయమన్నాను కానీ.

నారా: ప్రతిదానికీ అంత బాధపడతావేం జాకబ్! కొన్నింటిని వినీవినకుండా, చూసీచూడకుండా వదిలేయాలి.

జాక: మళ్ళీ మాట తప్పిస్తున్నారు.

నారా: ఏవిషయాన్నిగురించి?

జాక: ఆడవాళ్ళనుగురించికదూ మాట్లాడుకుంటున్నది.

నారా: మిస్టర్ జాకబ్! ఒక్కమాట చెప్పు—నా జీవితగమ్యాన్నే మార్చివేసిన ఆడవాళ్ళనుగురించి తెలుసుకుంటే నీకేమిటి చెప్పు లాభం?

జాక: కోపం తెచ్చుకోకుండా వుంటే—

నారా: ఇందులో కోపానికి ఆస్కారమేముందయ్యా?

జాక: తను బాధపడుతూ, మరొకరి కన్నీళ్లను చూచి, మనస్సులో నే నవ్వుకు నే మానవుణ్ణి ఏమంటారు?

నా రా: నీచుడంటాను.

జాక: నన్నందులో జమకట్టండి. ఆ తర్వాత ... ఆ తర్వాత...ఎలా చెప్పను? నా మనసులోని బాధ తగ్గడానికి మీ మనసులోని బాధను నాతో చెప్పండి.

నా రా: ఎంత పిచ్చివాడవు జాకబ్!

[బయటినుంచి ఓ స్త్రీకంఠస్వరం—'డాక్టరు గారూ!'—అని]

నా రా: (తబ్బిబ్బు పడిపోతూ) ఆఁ! ఆఁ! వస్తున్నా! వస్తున్నా శాంతాదేవి! మిష్టర్ జాకబ్!

జాక: (నవ్వుతూ) వెళ్తాను డాక్టర్! (వీధి తలుపు

నా రా: (అడ్డుకుంటూ) ఇటుకాదు-వెనుక వేపుగుండా.

జాక: (మెల్లగా) అలాగే డాక్టర్!

[మిష్టర్ జాకబ్ మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ వెనకగదిలోకి వెళ్తాడు. అతనిని నారాయణ కూడా అనుమానం తీఱక అనుసరిస్తాడు. కాని జాకబ్ తలుపు తీసినట్లుగా తీసి, ఓ మూలగా నిల్చోడంమూలంగా, నారాయణ అతన్ని చూడక, వెళ్ళాడనుకుని తలుపువేసి తిరిగి హాల్లోకి వస్తాడు. కర్టెన్ వేసి, మెల్లగా ర్చీఫ్‌తో మొహాన్ని తుడుచుకుంటూ, తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో తలుపుతీస్తూ]

నా రా: శాంతాదేవిగారికి సుస్వాగతం!

[శాంతాదేవి లోపలకు ప్రవేశిస్తుంది. మంచి ఒడ్డూ, పొడుగూ గల ఆకారం. అధునాతనమైన అలంకరణ. ఆమె లోపలికి ప్రవేశిస్తున్న సమయంలోనే — జాకబ్ కూడా ఒకటవ నెంబరు గదిలోకి వచ్చి, అక్కడ నుండి, హాల్లో జరుగుతున్న సంవాదాన్ని వింటూంటాడు]

శాం: నమస్కారం డాక్టరు గారికి.

నా రా: రండి. రండి శాంతాదేవీ! చిరకాలదర్శనం—

శాం: కాలానిదేముంది లెండి? మనసుకు గాని ప్రాముఖ్యం.

నా రా: అలాగా! (ఎగతాళిగ) ఈ వేదాంతం ఎప్పటినుంచి నేర్చుకున్నారు?

శాం: (అదేస్వరంతో) మీ స్నేహం మానుకున్నప్పటినుంచి.

నా రా: సన్మార్గంలో పడుతున్నారన్నమాట మెల్లమెల్లగా.

శాం: సన్మార్గాలసంగతి తెలియదుగాని దుష్కార్యాలుమాత్రం ఆచరించడం లేదు.

నా రా: ప్చ్!...ప్చ్!...ప్చ్!!

శాం: సానుభూతి చూపనక్కరలేదు. నీకన్న మంచిదాన్నే.

నా రా: కాదనినే ననలేదే!

శాం: అహా! సానుభూతి చూపిస్తుంటేను.

నా రా: అందుకుగాదు. వివాహమైం తర్వాత ఆడవారెంతగా పాడైపోతున్నారో చూసి జాలిపడి!

శాం: పాపం!

నా రా: నీకెందుకో ఈ భూతదయ?

శాం: ఒంటరిగా ఉన్న మగవారికి వెర్రిమొర్రి ఆలోచనలు ఎట్లా వస్తుంటయ్యో చూసి.

నా రా: శాంతాదేవి! ఎందుకు అకారణంగా నామీద యీవిధంగా కత్తులు నూరడం? నేనేం నేరం చేశాను! అతిథిగా మా యింటికి వచ్చావు. గృహస్థుగా నేనిచ్చే ఆతిథ్యం పుచ్చుకో.

శాం: నేను రాలేదు. నువ్వే పిల్చావు.

నా రా: నేను పిల్చానా?

శాం: మరి నువు రాసిన ఉత్తరం నా గదిలోకి ఎలా వచ్చిందో?

నా రా: నేను ఉత్తరం రాశానా? ఏమిటి శాంతాదేవి ఈ అభాండం?

శాం: అభాండమా? అంతటి కర్మ నాకేమీ లేదు నారాయణా! చిన్ననాటి స్నేహితుడివి—నిష్కల్మషుడవూ—అని నమ్మి వచ్చాను. పొరపాటు పడ్డానని తెలుసుకుంటున్నాను.

నా రా: ఇప్పటికీ నేను నీ స్నేహితుణ్ణే శాంతా! దశాబ్దంగా సాగిన మన స్నేహం ఒక్కరోజుతో విచ్ఛిత్తి చేసుకోవడం ఎంత కష్టమో ఏమన్నా ఆలోచించావూ? నన్ను కల్మషుడన్నావు. ఫర్వాలేదు. ఇందులో నాకు పోయేదేమీ లేదు.

కాని ఎన్నడయినా నీ చిన్ననాటి స్నేహితుడు —తను నవ్వుతూ, ఇతరులను నవ్విస్తూ, పాల వెన్నెలకన్న తెల్లగా, స్వచ్ఛంగా, ఇతరులతో కలిసి మెలిసి తిరుగుతూ, కదిలి మెదిలాడిన నీ చిన్ననాటి స్నేహితుడు—ఎన్నడైనా, నీకు, నీభర్తకు తాంబూలమిచ్చేటప్పుడు కాని, మీ దంపతుల శయ్యామందిరంలో గాని, మల్లెపూల వాసనలు ముద్దుముద్దుగా ఆస్వాదించేటపుడు గాని ఎప్పుడైనా జ్ఞాపకంవచ్చాడా?...రాడు శాంతా దేవీ-నీ చిన్ననాటి స్నేహితుడు నీకు జ్ఞాపకానికి రాడు. నాకు తెలుసు. ఆ సంగతి నాకు తెలుసు. కాని నాకో! నడయాడినా, పవ్వళించినా, పరిశోధన సాగించినా సర్వసర్వత్రా నువుకదూ నాకు కన్పించేది? వెన్నెల పాడితే నీ మొహం నా ముందు నవ్వుతూ ప్రత్యక్షమయేది. పుస్తకం తెఱచినా, పొద్దువాటారమి పట్టణానికిపోయినా నువులేనిలోటు అడుగడుగునా కన్పించేది. అయినా నేను కల్మషుడిని. నువ్వు నిష్కల్మషురాలివి. బావుంది, శాంతా దేవీ చాలాబావుంది-

[ఈ మటలు అంటున్నపుడు శాంతాదేవి మౌనముగా ఒక్కటొక్కటే అక్కడి వస్తువులను పరీక్షిస్తూ మెల్లగా కటైనుదగ్గఱకు పోతుంది. నారాయణ మాట్లాడకపోవటంచూచి తల పైకి ఎత్తి-]

శాం: అయిపోయిందా నారాయణా?

నారా: అయిపోవడానికి తుదీ, మొదలూ-రెండూ లేవుగా దీనికి. అయినా నా ప్రశ్నమాత్రం శేషప్రశ్నగానే నిలిచిపోయింది.

శాం : ఏమిటది?

నారా: (బాగా ఉద్వేగపడిపోతున్నాడు. అయినా ఎలాగో తమాయించుకుంటూ) నీకు తెలుసు.

శాం : ఏమిటీ?

నారా: నా హృదయంలో ఇముడ్చుకోలేక బాధపడుతున్న రహస్యం.

శాం : ఎందుకు నారాయణా అంతపిచ్చివాడవౌతావు? ఇది యథార్థజీవితంగాని కల్పనాప్రపంచం కాదు. మనమనుకున్నవన్నీ జరిగి, కోరికలే గుఱ్ఱాలైతే...లేనిదేముందిగనుక! నువ్వూ, నేను, అందరం స్వారిచేస్తాం. అందుకనే నీలాటివారు కొందరు భూమ్మీదే బ్రతకాలి. జీవితాలు నడవాలి. తప్పదుమరి!

నారా: ఎందుకని? నాకు డబ్బులేదు. (ఒక్కసారిగా కోపంతో) అవును! ప్రెసిడెంట్ ముఖర్జీ! అవును-అతనేకదూ నా వంశాన్ని, ధనాన్ని, సర్వస్వాన్నీ నిర్మూలించి, యిట్లా యీవిధంగా అనామకంగా జీవితాన్ని గడపమని నన్నాదేశించింది. శాంతా! ఒక్కటిగుర్తుంచుకో. ఈనాడు నేనెంతగా పనికిమాలినవాడినైనా, ఒకనాడు నేనే వీరినందరినీ ఉద్ధరించినా, సంహరించినా, ఈ ప్రెసిడెంటు, ఈ మార్షల్!--

శాం : ఆఁ! మార్షల్-ఆయనేంచేశాడు నిన్ను!

నారా: ఏంచేశాడా? నా శాంతను నాకు కాకుండా చేశాడు. ఇంతకన్నా ఏంచేయాలి? ఏమానవుడు మాత్రం ఇంతకన్నా ఏంచేయగలడు? సర్వమూ ధ్వంసమైంది. నా జీవితమే దగ్ధమైంది. శాంత! ఓహ్! శాంతా అని నిన్ను నేను పిలవరాదు కదూ! శ్రీమతి శాంతా తి...వా...రీ! హు!

శాం : నారాయణా!

నారా: ఏం? ఎందుకు ఇంకా పూర్వంలాగానే, ఆ పరిచయంతోనే నన్ను పిలుస్తున్నావు? ఆ చనువూ, ఆ ప్రేమా, ఆ అభిమానమూ—అవి లేవుకదూ మనకు. మిగిలిందల్లా...ఏమిటి? ఏం మిగిలింది?? సర్వనాశనమైంది. శాంత లేదు. సంపద లేదు. ప్రఖ్యాతి లేదు. నా ఉనికినిగుర్తించే నాథుడొక్కడు లేడు. ఏంమిగిలింది? ఏమీ మిగల్లేదు—

శాం : బాధపడి మనమేమీ చెయ్యలేము నారాయణా! స్థిమితం తెచ్చుకోవాలి. కర్తవ్యాన్ని ప్రశ్నించుకోవాలి.

నారా: కర్తవ్యమా? ఏముంది నాకు కర్తవ్యం? తల్లిదండ్రులా, భార్యాబిడ్డలా, ఎవ్వరూ లేనివాణ్ణి, ఒకరికోసం నేను గాని, నాకోసం ఒకరు గాని, బాధపడనవసరం లేదు. స్వతంత్రం, సర్వస్వాతంత్ర్యం నాకు. అహ్హాహ్హా.

శాం : సరే! ఇందుకేనా నారాయణా! నువు నన్ను పిలిపించింది.

నారా: ఏం? ఇది వినడానికికూడా కష్టంగానే ఉందా?

శాం: అదికాదు. ఇంట్లో పనివుంది.

నారా: ఓహ్! మర్చేపోయాను. సంసారమూ, పిల్లలూ, పుణ్యస్త్రీవికదూ నువ్వు.

శాం: అవును. పుణ్యస్త్రీనే. కాదని నువ్వనుకున్నా నాకుపోయిందిలేదు.

నారా: అవును మరి. వీరుదాటింత వ్రాత...

శాం: అది నీలాంటివారు చేసేపని.

నారా: ఆఁ! ఎందుకుగాని ఈపోట్లాట—ఒక్క సంగతి అడుగుతాను చెబుతావా?

శాం: ఏమిటది?

నారా: నన్నింకా నువ్వు ప్రేమిస్తూనే ఉన్నావా?

శాం: నాకు తమ్ముళ్లులేనిలోటంతా నువు తీరిస్తే.

నారా: ఆఁ!

శాం: అభిమానం సార్వజనికం అన్న సంగతి మఱువకు నారాయణా! వస్తాను.

నారా: నేను పదేపదే నిన్ను వేడుకుంటున్నాను శాంతా—నన్ను నువ్వు ప్రేమించలేవూ?

శాం: అంతకన్నా మరణమే మంచిది.

నారా: కనీసం మాటమాత్రమైనా అనలేవా?—దయా ప్రపూర్ణలటనే ఆడవారు.

శాం: దానానికైనా పాత్రాపాత్రవిచక్షణ ఉండవలె.

నారా: మంచిది. అపాత్రుణ్ణే నేను. న్యాయాన్యాయ విచక్షణలేదు నాకు. ధర్మమూ అధర్మమూ నాకెందుకు? అందుకనే...ఆఁ!...అందుకనే—

[ఆమెమీదికి పోబోతాడు]

శాం: నారాయణా! నారాయణా! ఏమిటిది? నన్ను నన్ను...అయ్యో!

[ఇంతలో బయటినుంచి మార్షల్ స్వరం—డాక్టర్ నారాయణా అన్న పిలుపు. తలుపు చప్పుడు]

నారా: (వణికిపోతూ) ఏంచేయాలి? ఏంచెయాలి ఇప్పుడు? శాంత! శాంతాదేవి!

శాం: అయ్యో! అయ్యో!

నారా: (అకస్మాత్తుగా) ఆ! శాంతా; లోపలిగదిలోకి వెళ్ళి దాక్కో. మీవారు వెళ్ళగానే నువ్వూ వెళ్ళుదువుగాని (మళ్ళీ తలుపు చప్పుడు)

శాం: అయ్యో! అయ్యో! ఏమిటీ విపత్తు?

[లోపలకు వెళ్తుంది. అక్కడ జాకబ్‌ను చూసి సన్నగా కేక పెడుతుంది. అది డాక్టరు నారాయణకు విన్పించినా లక్ష్యపెట్టడు. వెనుకగది తలుపు గడియ పడుతుంది. నారాయణ ముంగున్న వీథి ద్వారం తెరుస్తాడు. మార్షల్ లోపలికి అడుగుపెడతాడు.]

మార్షల్: గుడ్ ఈవినింగ్ డాక్టర్!

నారా: గుడ్ ఈవినింగ్ మార్షల్!

మార్ష: ఈసాయంత్రం యిలా వస్తానని నేననుకోలేదు.

నారా: అవును నేనూ అనుకోలేదు.

మార్ష: ఓహ్! అయితే మిమ్మల్ని కష్టపెడుతున్నానన్నమాట.

నారా: సుఖాలుంటేకదా మార్షల్, కష్టాలు ముంచుకొస్తాయని భయపడటం?

[వీరిద్దరూ ఇట్లా హాల్లో మాట్లాడుకుంటూ వుండగానే, అవతల ఒకటవ నెంబరు ముందు గదిలో శాంతా, జాకబ్ ఇద్దరూ ఒకరివేపు ఒకరు అనుమానంగా కోపంగా భయంగా చూచుకుంటుంటారు. జాకబ్ ఏదో కొంచెం సేపు ఆలోచిస్తాడు. అతని మొహంలో ఏవో కొన్ని నీలినీడలు - మెల్లగా శాంతాదేవిని సమీపిస్తూ]

జాక: (మెల్లగా) ఏం శాంతాదేవీ! ఈదాసుడు జ్ఞాపకం ఉన్నాడా?

[శాంత సన్నగా వణుకుతుంది. మెల్లిగా ఓ మూలకు వెళ్ళి నిలబడుతుంది]

జాక: అంతభయమెందుకు శాంతా! నారాయణపాటి చెయ్యలేదా నేను?

శాం: భగవాన్!

జాక: అవునే! వియ్యాలు, కయ్యాలు, నెయ్యాలు సరిసమానులకేగా!

శాం: జాకబ్!

జాక: అవును శాంతాదేవీ! నువు మర్చిపోయినా నేను మర్చిపోలేను. మర్చిపోలేను. నీకు మల్లెపూవులతో సరితూగిన నువ్వు హంసతూలికాతల్పాల గణపయ్యలతో ఆనందం అనుభవిస్తూ వుండి వుండవచ్చు. కాని సామాన్యుల జీవితాల్లోని ఒడుదుడుకులూ, ఆ బాధలూ, ఆ కన్నీళ్ళూ,

నీకు తెలియదుకదూ ? అందుకనే వాటి ననుభ వించి రెండు వేపులా పదునుగల ఈ బ్రతుకును పరికించి, నిన్నూ నీద్వారా నన్నూ ఇద్దరినీ ఉద్ధరించుకుందువుగాని రమ్మన్నాను. కాని రాలేకపోయావు.

* * *

మార్ష : అదేమిటి డాక్టర్ ! అలా అంటారు ? కావలసినంత విశ్రాంతీ, స్వేచ్ఛ...జీవనతాపత్రయం మీకు లేదు. ప్రభుత్వమే మిమ్మల్ని పోషిస్తున్నది.

నారా: (మెల్లగా విన్పించీ విన్పించకుండా) అవును జలగలా నన్ను బాధిస్తున్నది.

మార్ష : ఏమిటి డాక్టర్ అంటున్నారు ?

నారా: ఏమీ లేదు. ప్రభుత్వం నన్ను పోషిస్తున్నందుకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

మార్ష : ఏవిధంగా ?

నారా: కన్పించడంలేదూ ? ఈ పరికరాలూ, ఈ పరిశోధనలూ, ఈ యాంత్రికజీవనమూ, మానసికంగా అహర్నిశలూ ఏకాగ్రత సాధించడం- ఇవన్నీ ఏమిటీ మార్షల్ ? నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తించడం కాదూ ?

మార్ష : కాదని నేనన్నానా డాకర్ ! నాకు తెలుసు, మీరు కర్తవ్యాన్ని విస్మరించరని. నేనేకాదు. ప్రెసిడెంట్ ముఖర్జీ కూడా నాతో చాలాసార్లు అలానే అన్నారు. అంతేకాదు అందరికీ తల్లో నాలికలా మెలుగుతూవుండే మీరు, ఎవ్వరికీ ఏ అపకారమూ చేయరని నాకు మరీనురీ తెలుసు.

నారా: (నిట్టూరుస్తూ) అవును మార్షల్ ! తెలిసి తెలిసీ ఎవ్వరికీ ఏ అపకారమూ చేయరాదనే నా అభిమతం కూడాను. కాని విధిచేతిలో కీలుబొమ్మను.

* * *

శాం : అవును ! విధిచేతిలో కీలుబొమ్మలం. పసిపిల్లల చేతిలోని రెక్క తెగిన పక్షులం—మనమందరం.

జాక: నేనుకాదు. నాలో అహంభావం అభిమానం ఇంకా చచ్చిపోలేదు. శాంతాదేవి ! ఒక్కసారి నువ్వు గెలిచావు. ఈసారి నేను గెలవాలి. అప్పటికిగాని, పడగవిప్పిన నా ఈర్ష్య, కుబుసాన్ని కప్పుకోదు.

శాం : ఎందుకు జాకబ్ ! దశాబ్దంనాటి ఆగాథను స్మృతికి దెచ్చుకుంటూ నన్ను బాధిస్తావ్ ? ఏంజరిగిందో జరిగింది. ఇద్దరమూ తప్పటడుగు వేశాం. మన యిద్దరిదారులూ వేరయ్యాయి. ఇంక ఎవరిబ్రతుకు వారు బ్రతుకుదాం. ఎందుకు ఆ చరిత్రను పునరావృతం చేసుకోవడం?

జాక : అలాగా శాంతా! నాకాసంగతి తెలియదే!— మేడమీద నవ్వుతూ నిలబడ్డనువ్వు—మేడక్రింద నవ్వుతూ నిలబడ్డ నన్ను చూచి గేలిచేసిన రోజులు మర్చిపోయావా ? కారులో నువు— పాదచారినై నేను. వికసితవసంతవనం నీజీవితం. ఒయాసిస్సు కన్పించని వెర్రిబీడు నాబ్రతుకు. ఇదే నా మనిద్దరికీ భేదం?

శాం : క్షమించు జాకబ్! పొరపాటుపడ్డాను.

జాక : ఇప్పుడు సరిదిద్దుకోమంటున్నాను.

శాం : సమయం చాలా మించిపోయింది.

జాక : అయినా స్నేహమేమీ మారలేదు.

* * *

మార్ష : నిజమే! తెలిసి తెలిసీ ఎవరికీ ఏ అపకారమూ నువు చేయలేవు. అందులోనూ స్నేహితులను కంటికి రెప్పలాగా...

నారా : అంత నమ్మకం నామీద ఉంచకు మార్షల్. చివరకు—పశ్చాత్తాపపడవలసివస్తుందేమో!

మార్ష : అదేమిటి?

నారా : అవును మానవుడు పరిస్థితులకు దాసుడుకదూ? కావలసింది లభ్యం కానినాడు ఆ మానవుడే దానవుడు కావలసి వస్తుంది.

మార్ష : కాని—నీకు లభ్యం కానిదీ, సాధ్యం కానిదీ ఏమీ లేదని నా అభిప్రాయం.

నారా : పొరపాటు పడివుండవచ్చుకదూ?

మార్ష : ఎప్పుడైనా నేమో! ఇప్పుడుమాత్రం కాదు.

నారా : ఏమిటా నమ్మకం?

మార్ష : ప్రత్యక్షనిదర్శనమే!

నారా : (ఆశ్చర్యంగా) ఆఁ! నిదర్శనమా?

మార్ష : అవును డాక్టర్ ! ఊరూ నాడూ ఏకమై చెప్పుకుంటున్నారు. పది సంవత్సరాలుగా మీరు చేస్తున్న పరిశోధనలు నేటికి ఫలితానికి వచ్చాయట! అపూర్వమూ, అమోఘమూ, అతో

కమూ—అయినదానిని మీరు కనిపెట కలిగారట! నిజమేనా? చెప్పండి డాక్టర్! అది నిజమేనా!... చెప్పండి... అది నిజమని చెప్పండి. ఈమీ పరిశోధనాఫలితంకోసం వేయికన్నులుగా ఎదురుచూస్తున్న ప్రెసిడెంట్ ముఖర్జీ ఒక్కసారి మీ విజయాన్ని విని ఆనందంలో మైమఱచేటట్లుగా... నిజమని చెప్పండి. మన దేశంకూడా, శాస్త్రవిజ్ఞానంలో సాటి దేశాల మధ్య సగర్వంగా తలయెత్తుకు తిరిగేటట్లుగా ... నిజమని చెప్పండి. చెప్పండి — డాక్టర్! చెప్పం!

నారా: ఊఁ! ఆ తర్వాత?

మార్ష: ఏముందీ-ప్రభుత్వానికి మీపరిశోధనను స్వాధీనం చేసి, తద్వారా మిమ్ములను మీరు దేశసేవలో వినియోగం చేసుకోండి.

నారా: (ఆశ్చర్యంగా) ప్రభుత్వం ఏం చేసుకుంటుంది ఈ పరిశోధనను?

మార్ష: ఏం చేసుకుంటుందా? ఏమిటి డాక్టర్! అంత అమాయకంగా అడుగుతున్నారు? పరాయి రాజ్యాలను మనపాదాక్రాంతం చేసుకుంటుంది.

నారా: అంటే-యుద్ధాలలో ఉపయోగిస్తుందన్నమాట.

మార్ష: అంతే. డాక్టర్. సరిగ్గా అంతే!

నారా: ప్రజల యోగక్షేమాలకోసం వినియోగించదా?

మార్ష: (బిగ్గరగా నవ్వుతూ) ప్రజలా? యోగక్షేమాలా? అహ్హహ్హ. ఏం మాటలివి?—డాక్టర్! ముందు అధిపతుల అధికారానికి భద్రత చిక్కితే— తదుపరి ప్రజల దీనారావాల సంగతి ఆలోచించవచ్చు. ఏ క్షణాన ఏం వాటిల్లుతుందో మనకే తెలీదాయె. అందుకే మీ శాస్త్రజ్ఞుల సహాయాన్ని మే మర్థించవలసి వస్తున్నది

*

శాం: జాకబ్! స్నేహితుడివి కనుకనే, మన స్నేహం మారలేదు కనుకనే, అవసరసమయంలో అర్థిస్తున్నాను. ఈ గండం నాకు తప్పించు. అవతల మా వారు-ఎల్లా వారి బారినుండి తప్పించుకోవడం? ఏ క్షణాన లోపలికివచ్చినా రావచ్చు. వారు చూడకుండా నన్ను గడపదాటించు. నీకు పుణ్యం వుంటుంది.

జాక ప్రతిఫలం లేకుండా సహాయంచేయడం మాకు అలవాటూ లేదు. అది మా ఆచారమూ కాదు శాంతాదేవి!

శాం: ఎందుకు జాకబ్ పదే పదే నన్ను బాధిస్తావు? నేను వివాహితను.

జాక నే నవివాహితుణ్ణి.

శాం: నిన్ను సోదరసమానుడుగా చూసుకుంటున్నాను.

జాక సమానుడినే కాని సోదరుణ్ణి కాదుగా.

శాం (సన్నగా ఏడుస్తూ) జాకబ్! నీ కాళ్లు పట్టుకుంటాను. వచ్చే జన్మలో నీ కడుపున పుడతాను. ఇప్పటికి నామీద పగసాధించకు. నన్ను రక్షించు.

జాక లాభంలేదు శాంతా! ఈ కసాయివాడిని నీ కన్నీళ్లు కరిగించలేవు. మరోవిధమైన మార్గం చూడు- లాభం ఉంటుందేమో!

శాం: అంటే?

జాక: అసలుకు లోపం రాకుండా చేరమాకు.

శాం: నువ్వేమంటున్నదీ అర్థం కావడంలేదు జాకబ్!

జాక: ఏమీ లేదు. కాస్త దయగలిగి ఉండమనిమాత్రం వేడుకుంటున్నాను. అంతే!

శాం: అంటే?

జాక: అంటేనా? మా కుటీరాన్ని మీ రాకతో పావనం చేయమని.

శాం: అదెలా సాధ్యమౌతుంది?

జాక: ఇదెలా సాధ్యమైంది?

శాం: నా దురదృష్టమూ, భగవత్ప్రేరణా.

జాక: అది నా అదృష్టమూ. భగవత్కృపాకటాక్షవీక్షణమూ.

శాం: సరే అయితే! అలాగే విలుచూసుకుని ఓరోజు ఉదయం.

జాక: మాట తప్పరాదు.

శాం: అది మతిమాలినవారు...

జాక: సరే అయితే.

శాం: ఇప్పుడైనా నన్ను పంపించు జాకబ్! ఎందుకింకా ఆలస్యం?

జాక: ఏమిటా తొందర శాంతాదేవి! మీవారుకూడా ఇక్కడే ఉన్నారుగా. కొంచెంసేపు ఇక్కడే ఉండు. అరమరికలేక ముచ్చటించుకోవచ్చు.

శాం : జాకబ్ ! ఎందుకు నన్నింకా బాధిస్తున్నావు? నీ హిరణ్యాక్షువరాల కన్నింటికీ ఒప్పుకున్నా నన్నీ చెఱనుండి తప్పించలేవా?

జాక : సరే ! పద ! త్వరపడుతున్నావు. నీ అభీష్టం ఎందుకు కాదనాలి.

[జాకబ్ శాంతాదేవిని తీసుకుని కర్టెన్ తొలగించుకుని సెం. II గదిలోకి వెళ్తాడు)

*  *  *

నారా: ఇంతకూ ఇందులో మీరు నిర్వహించిన, నిర్వహించబోతున్న పాత్ర ఎటువంటిది మార్షల్ ?

మార్ష : (కొస్త కోపంగా) అంటే ?

నారా: నేను కనిపెట్టింది వినాశనానికే అయితే— ఎంతమందిని ఆహుతి చేయవలెనని మీ సంకల్పమూ అని.

మార్ష : అదేమిటి డాక్టర్ !—అలా అంటారు ? అంతటికీ నేనే కారణమైనట్లు—

నారా: ఎంత కాదనుకున్నా ప్రెసిడెంటుగారికి కుడి భుజంకదూ మీరు ?

మార్ష : ఏం ? మీకు ఈర్ష్యగా ఉందా ?

నారా: ఉండడం అసహజం కాదుకదూ ?

మార్ష : ఇంతకూ నే నడిగిన విషయాన్ని గూర్చి చెప్పనే లేదు.

నారా: క్షమించాలి. ఏమడిగారో మర్చిపోయాను.

మార్ష : మీ పరిశోధన విజయవంతమైనదని విన్నాను. అది నిజమే నేమోనని కనుగొనడానికి వచ్చాను.

నారా: ఏం ? ఇందుకు ప్రభుత్వం మిమ్మలను నియమించిందా ?

మార్ష: కావచ్చు—

నారా: చెప్పక తప్పదా?

మార్ష: క్షమించాలి. తెలుసుకోనక తప్పడం లేదు.

నారా: ఆశ్చర్యంగా వుంది. నిజానిజాలు తెలియనివారూ, శాస్త్రవిజ్ఞానం లేనివారూ ఆడుకునే మాటలు మీ రెలా నమ్మారా అని—

మార్ష: అంటే?

నారా: పరిశోధన ఇంకా ప్రథమస్థితిలో నే వుంది. ఈ సంగతే ప్రెసిడెంటుగారితో మనవి చేయండి.

[ఇదే సమయంలో జాకబ్ శాంతను బయటికి పంపించివేసిన తదుపరి తిరిగి వచ్చి సెం 1 గదిలో నిల్చుంటాడు.]

మార్ష: ఆలోచించి చెప్పండి డాక్టర్! తర్వాత అనుకున్నా ప్రయోజనం వుండదు.

నారా: ఏం ప్రభుత్వమనే సర్పాన్ని చూపించి బెదిరించ దల్చుకున్నారా? నేనేమీ కనిపెట్టలేదు. నాకేమీ తెలీదు. తెల్సినా మీకు చెప్పదలచుకోలేదు. వెళ్లండి ... వెళ్ళండి — మీరంతా దొంగలు...వంచకులు ... మోసగాళ్లు...హంతకులు. (ఆవేశపడతాడు)

మార్ష: ఏమిటి? ఏమిటి డాక్టర్ ఇది?

[ఇప్పుడే, ఏదో కొంచెంసేపు ఆలోచించుకుని, జాకబ్ మెల్లగా లాబరేటరీలోకి వెళ్తాడు.]

నారా: (తమాయించుకుంటూ) ఏమీలేదు......ఏమీ లేదు, మార్షల్ ! నా మనసేమీ ఇప్పుడు బావుండలేదు. దయచేసి వెళ్ళండి. ప్రెసిడెంటుగారితో మాత్రం—దయవుంచి నేనేమీ కనిపెట్టలేదని చెప్పండి. వెళ్ళండి.

మార్ష: ఎందుకంతగా బాధపడిపోతున్నారు డాక్టర్? ఏమిటో దాస్తున్నట్లున్నారు. ఆలోచించుకోండి. తర్వాత చిక్కుల్లో ఇరుక్కోవలసి వస్తుందేమో!

నారా: ఆ సంగతి మాకు తెలుసు మార్షల్!

మార్ష: సరే అయితే వెళ్లొస్తాను, వెళ్లొస్తాను, డాక్టర్! గుడ్ నైట్ !

నారా: గుడ్ నైట్!

[మార్షల్ వెళ్ళిపోతాడు. నారాయణ విచారముగా ఆలోచనతో కుర్చీలో కూర్చుండిపోతాడు. అతని వదనంలో సందిగ్ధావస్థ ప్రస్ఫుటమౌతూనే వున్నది. ఇంతలో మెల్లగా లాబ్ లో నుండి జాకబ్ ప్రవేశం — చేతిలో ఓ ఫైల్ పట్టుకుని]

జాక : హల్లో డాక్టర్! ఏమిటలా ఉన్నారు? ఒంట్లో బాగులేదా?—లేక—మనసు బాగాలేదా?

నారా: (అతన్ని చూసి ఆశ్చర్యపడుతూ) నువ్వు— నువ్వు—ఎట్లా వచ్చావు జాకబ్?

జాక : రావడమేమిటి డాక్టర్ ? అసలు వెళ్తేనా రావడానికి.

నారా: (భయంతో) అంటే?...అంటే?

జాక: అవును. అవునవును. ఇక్కడే ఉన్నాను.

నారా: (ఒక్కసారిగా, పెద్దగా) భగవాన్, భగవాన్! ఏమిటిది?—ఏమిటిదంతా? (కోపంతో) అసలు నిన్నెవరుండమన్నా రిక్కడ? అవసరంలేని విషయాల్లో ఎందుకు జోక్యం కలుగజేసు కుంటున్నావు? ఏమిటి నీకీ ఆసక్తి? చెప్పు—సమాధానం చెప్పు; జాకబ్!

జాక: ఈ విషయంతో మీకే కాదు. నాకు కూడా సంబంధం ఉంది డాక్టర్! ఆ సంగతి మీకు తెలియదు. నేను చెబితేగాని మీకు తెలియదు. కాని—ఆ విషయాలు నేనెన్నటికీ మీకు చెప్పను డాక్టర్?

నారా: (పిచ్చిగా) జాకబ్! జాకబ్! ఏమిటి? ఏమిటి దంతా? ఎందుకు నా మీద నీకీకోపం? (అతని చేతిలో కాయితాలు ఒక్కసారిగా చూసి) అవి, అవి నా పర్సనల్ ఫైల్స్. అవి నువ్వెందుకు తీసుకువెళ్తున్నావు? ఇచ్చేయ్! నా ప్రాణాన్ని నా కిచ్చేయ్ జాకబ్!

జాక: క్షమించాలి డాక్టర్! మీరు మరీ ఆవేశపడి పోతున్నారు. కొస్త నిభాయించుకోండి. అన్నీ మీకు అర్థమౌతాయి.

నారా: ఇంకేమర్థం కావాలి? ఇప్పటికే అర్థమయింది. నువ్వేదో నన్ను మోసం చెయ్యదల్చు కుంటున్నావు. కృతఘ్నుడా? తిన్నయింటి వాసాలు లెక్కపెట్టదలుస్తున్నావు!

జాక: తిటడం అయిపోయిందా డాక్టర్! ఇక నే చెప్పేది వింటారా?

నారా: వినను. నా ఫైల్స్ నా కిచ్చేయ్. నన్ను బాధించకు. బాధించకు జాకబ్!

జాక: వినకపోయినా నే చెప్పక తప్పదు. ఇదివరలో నా జీవితంలోని కొంతభాగం వినిపించాను. జ్ఞాపకం ఉందా? అందుకు ప్రతిఫలంగా— అవును ఈ జాకబ్ ప్రతిఫలం లేకుండా ఏ పనీ చేయడు కదూ?—అందుకు ప్రతిఫలంగా మీ జీవితాన్ని కొంత విన్పించమన్నాను. కాని మాట నిల్పుకోలేనివారయ్యారు మీరు. అయినా అదృష్టవశాత్తూ అనుకోకుండా నే తెలిని రహస్యాలు కొన్ని తెలుసుకోగలిగాను.

నారా: తెలిశాయా? నా రహస్యాలు నీకి

జాక: ఆఁ! నువ్వొక భగ్నప్రేమికుడివి.

నారా: అమ్మో! శాంతా?

జాక: అవును. శాంతను నువ్వు ప్రేమించావు. కానీ ఆమె నిన్ను తిరస్కరించింది.

నారా: జాకబ్! జాకబ్! ఎందుకు తెల్సునన్నా విదంతా?

జాక: అంతేకాదు. నువ్వేమీ కనిపెట్టలేదు. నీ పరిశోధన ఫలించలేదు. అదే ప్రభుత్వానికికూడా నివేదించమన్నావు—కదూ?

నారా: (ఆవేశంతో) కాదు. కాదు. అదంతా అబద్ధం. నేను కనిపెట్టాను. బ్రహ్మాండమైన యంత్రాన్ని కనిపెట్టాను.

జాక: ఇప్పుడామాట నువు చెప్పినా ఎవరూ నమ్మరు నారాయణా!

నారా: భగవంతుడా!

జాక: నీఅంతటనువ్వే చెప్పావు. నేను కనిపెట్టలేదూ— అని మార్షల్‌తో. మళ్ళా నీ అంతట నువ్వే చెపున్నావు నాతో కనిపెట్టానూ—అని. అలాంటప్పుడు ప్రపంచదృష్టిలో శాస్త్రజ్ఞుడగా పైకిరావలసిం దెవరు చెప్పు?

నారా: నేను.

జాక: కాదు. నేను.

నారా: కాదు నేను. (పెద్దగా)

జాక: గొంతు చించుకున్నా ప్రయోజనంలేదు డాక్టర్! ఒక్కసారి తప్పటడుగు వేశావో సర్వమూ నాశనమే!

నారా: జాకబ్! జాకబ్! నన్నన్యాయం చెయ్యబోకు.

జాక: నేను కూడా అంత ఆశాపాతకుణ్ణి కాదు డాక్టర్!

నారా: అయినప్పుడు—

జాక: ఒక్కటిమాత్రం అడుగుతున్నాను. నీ పరిశోధనలో సగభాగం నాది. ఆ ఖ్యాతి నాకు. సమ్మతమేనా నీకు.

నారా: అన్యాయం. అన్యాయమిది. నేనొప్పుకోను.

జాక: అరవకు పెద్దగా. నే చెప్పేది—జాగ్రత్తగా విను. ఈ ప్రపంచంలో అన్యాయం కానిదేది? ఒకరు చేసిన పాపానికి మనం పుట్టడమే ఒక

అన్యాయం. పుట్టినా అనామకంగా మనం నశించిపోతే ఏబాధా ఉండదు. కొంచెం పేరూ, ప్రఖ్యాతులూ వచ్చిందతర్వాత వాటిని నిలుపుకోవడానికి ఎంతటి అన్యాయానికైనా ఇక పాల్పడక తప్పదు. అందుకని—

నారా: ఏమైనా సరే—నీకు నేను భాగం పంచిపెట్టను.

జాక: అయితే అనుభవిస్తావు.

నారా: ఏం? బెదిరిస్తున్నావా?

జాక: ఆఁ! ముందు చెప్పి చేస్తున్నాను. నీ పరిశోధనను నే నుపయోగించుకోలేకపోయిననాడు నీ జీవితాన్ని, నీ గౌరవాన్ని, నీతోడివారల జీవితాలను, సర్వాన్నీ నిర్మూలించి, ఈ ప్రదేశాన్నే ఒక మరుభూమిగా మార్చిగాని మరణించను. జ్ఞాపకం ఉంచుకో—

నారా: అంతదాకా ఎందుకు జాకబ్!

జాక: ఎందుకనే నేనూ చెబుతున్నది. మళ్ళీ రేపుదయం వస్తాను. అప్పటికి నీ నిర్ణయం నాకు తెలియాలి. వస్తా. (ఫైల్ విసిరేసి విసురుగా వెళ్ళిపోతాడు.)

నారా: జాకబ్! జాకబ్! ఉండు జాకబ్. ఈ మాట వినిపో జాకబ్! (వీధిద్వారందాకా వెళ్ళి ఆగిపోతాడు. శూన్యంలోకి చూస్తూ, దిగులుగా) ఏం చేయను నేను? ఎందుకు భగవాన్ నన్నిలా పరీక్షిస్తున్నావు? ఏమిటి నా తప్పిదం?— (లోపలికి వెళ్ళిపోతాడు.) [తెర]

## రంగము: 2

* * బాలభానుని బంగారు కిరణాల చక్కిలిగింతలలో ప్రపంచం పరవశించిపోతున్నా - డాక్టరు నారాయణ మనసులోని కారుచీకట్లు మాత్రం కరిగిపోలేదు. ముందుగది (I) లోని రేడియో ఆహ్లాదకరమైన ఉదయ సంగీతం వినిపిస్తున్నా - ఏదో విషాద గీతం వింటున్నట్లు తలపట్టుకు కూర్చున్న డాక్టర్ నారాయణ ఎవరో పిలిచినట్లుగా లేచి పరిశోధన శాలలోకి పరుగెత్తుతున్నట్లుగా పోయి ఫైల్ తీసుకునివచ్చి కుర్చీలో కూర్చుని కాగితాలు తిరగేస్తుంటాడు. మొదటిద్వారంగుండా జాకబ్ ప్రవేశిస్తాడు. డాక్టర్ నారాయణ తలెత్తిచూసి మాట్లాడించకుండా తల దించుకుంటాడు. ఇది గమనించిన జాకబ్ కోరచూపు చూసి, తొందరపడకూడదనే ఉద్దేశంతో కాబోలు, కోపం దాచిపెట్టుకుంటూ సాధ్యమైనంత సౌమ్యంగా పలకరిస్తాడు.

జాక: గుడ్‌మార్నింగ్ డాక్టర్!

నారా: (తలెత్తకుండానే) యస్! మార్నింగ్! (జాకబ్ సరాసరి ముందుగదిలోకిపోయి రేడియో 'ఆఫ్' చేసి వస్తూ)

జాక: ఏం నిశ్చయించుకున్నారో తెల్సుకోవచ్చునా?

నారా: నిశ్చయించుకోవటానికి ఏముంది?

జాక: ఏమీ లేదా?

నారా: ఏమీ లేదు.

జాక: డాక్టర్!

నారా: జాకబ్?

జాక: ఇవ్వాళ ఉదయం వస్తాను. ఏమాటా చెప్పాల్సి ఉంటుంది—అన్నాను. గుర్తులేదా?

నారా: అవును. అన్నావు. గుర్తుంది.

జాక: అయితే ఏంచెప్తారు మరి?

నారా: నీకేమీ సంబంధం లేదిందులో.

జాక: నాకేమీ సంబంధం లేదు కదూ! (బాధగా నవ్వి) మీ రెన్ని పగళ్ళూ, ఎన్ని రాత్రిళ్ళూ యీ పరిశోధన కొనసాగించటానికి—యీ లేబరేటరీలో—కష్టపడ్డారో జ్ఞాపకం లేదా డాక్టర్!

నారా: (బాధగా) ఒక్క పగలా? ఒక్క రాత్రా?? పది సంవత్సరాలు...నిండు పది సంవత్సరాలు ...రాత్రింబవళ్ళు పడ్డ కష్టానికి ఫలితం యిది. ఈ ఫలితాన్ని చూసుకుని నేపడ్డకష్టం కొంతవరకు మర్చిపోయినా పూర్తిగా మర్చిపోలేదు. ఒకసారి పదిరోజులపాటు స్నానం చేయలేదు

మరొకసారి వారంరోజులు ఆహారమేమీ లేకుండా కాఫీమాత్రం తాగి ఉన్నాను. అయినా నేనుగా నీకివన్నీ చెప్పాల్సిన అవసరం లేదుగా జాకబ్! నాకు తెలుసు—నువ్వర్థం చేసుకోగలవు.

జాక: నేనూ అయిదేళ్ళనుంచీ మీ కష్టసుఖాల్లో భాగం పంచుకుంటూ మీతో పాటే ఉంటున్నానన్న మాట మీరు మర్చిపోయి ఉండరనుకుంటాను.

నారా: అవును! ఉన్నావు.

జాక: మరి యీ పరిశోధనలో నాకూ సంబంధం ఉన్నట్లు ఒప్పుకున్నట్లేగా?

నారా: (ఒకక్షణం ఆలోచించి) పరిశోధనలో సంబంధమా? లేదు జాకబ్! సంబంధం లేదు. సహాయం మాత్రం ఉంది. పక్కనఉండి చెప్పింది చేశావు. అందుకు నేను నీకు కృతజ్ఞుణ్నే జాకబ్.

జాక: మీరు కృతఘ్నులని నేను అంటంలేదు డాక్టర్! ఈ పరిశోధనలో సహాయం చేశాను కాబట్టి నాకూ దీంట్లో భాగం ఉందంటున్నాను.

నారా: పరిశోధనలో సహాయం చేసినంత మాత్రాన ఫలితంలో సగభాగ మీయమని కోరటం సమంజసం కాదు.

జాక: పుట్టిన పిల్లల్ని ప్రేమించటానికి, ప్రేమించబడటానికి తల్లిదండ్రులలో ఒకరికే హక్కుందనటం హాస్యాస్పదం కాదూ?!

నారా: మిష్టర్ జాకబ్! నే చెప్పేది వింటావా?

జాక: విననని నే అనలేదు.

నారా: నేను ఈ పరిశోధన చేసింది ప్రకృతిని జయిద్దామని కాదు ... ప్రపంచాన్ని పరిపాలిద్దామని కాదు... ప్రజల ప్రశంసల పొందుదామని కాదు.

జాక: నోబుల్ బహుమానం పొంది పేరు సంపాదించుకుందామనా?

నారా: అదీ కాదు.

జాక: ప్రభుత్వానికి అమ్ముకుని కోటీశ్వరులై ప్రపంచంలోని ధనవంతులలో ఒకరవుదామని కూడా లేదు. కదూ?

నారా: అవును. లేదు. అంతనీచత్వానికి నేను పాల్పడలేదు. ప్రజలు డబ్బుకు విలువ యివ్వవచ్చు డబ్బున్నవాడిని గౌరవించవచ్చు. అంతమాత్రాన నేను వెధవ డబ్బుకు లోబడి యీపదేళ్ళ పరిశోధనాఫలితాన్ని ప్రభుత్వానికిఅమ్ముకుంటానా! అసంభవం-అది ఎన్నటికీ జరుగని విషయం.

జాక: ధనమవసరం లేదు, పేరుప్రఖ్యాతు లవసరం లేదు. ఏమీ అవసరం లేదు-అని తల నెరిసిన వేదాంతిలా మాట్లాడేశారు నాకు భాగమీయటానికి అభ్యంతరం చెప్తారేం?

నారా: దానికి వేరే కారణం ఉంది. అది...అది... (అనుమానిస్తాడు)

జాక: నాకు చెప్పకూడనిదా!

నారా: ఈ రోజుకి...అవును, ఈ రోజుకి చెప్పకూడనిదే. ఈ రోజు నన్నడగకు రేపు నేనే చెప్తాను. ఆ ఒక్క విషయమే కాదు, కావాలంటే యీ యంత్రం విషయంకూడా పూర్తిగా చెప్తాను. అన్నిహక్కులూ నీకే ధారపోస్తాను.

జాక: అలా వీల్లేదు డాక్టర్! ఆలస్యం అమృతం విషం. అప్పుడే దేశం మొత్తం చెప్పుకుంటున్నది—మన లాబ్‌లో ఒక అపూర్వమైనవిషయ మేదో కనుక్కొన్నట్లు. నిన్న మార్షల్ వచ్చాడా? ఇవ్వాళ ప్రెసిడెంట్ రావచ్చు.

నారా: రానీయి జాకబ్, రానీ! ఫర్వాలేదు. ఒక్క రోజు...ఇరవై నాలుగు గంటలు టైమ్ యియ్యి. నా పరిశోధనాఫలితం నాకు దక్కుతుంది. నా చిరకాలవాంఛితం నెఱవేరుతుంది. నా జీవితం పరిపూర్ణత్వం పొందుతుంది. జీవితలక్ష్యం సాధించిన ఆనందం అనుభవించనీ, జాకబ్! నిన్ను బ్రతిమలాడుకుంటున్నాను. రేపు ఉదయం రా. నీకు సమస్తం సమర్పిస్తాను. నువ్వు యీ నవ్య పరిశోధన ప్రపంచానికి వెల్లడిచేసి పల్లకీయే అలంకరిస్తావో, లేక మూడోవాడికి కూడా తెలియకుండా రహస్యంగా ఉంచి ప్రజావళిని చెప్పుచేతల్లో పెటుకుంటావో—అంతా నీ యిష్టం. ఒక్క రోజు టైమ్ యియ్యి చాలును. నిన్ను బ్రతిమాలుకుంటున్నాను జాకబ్!

జాక: పొరపడుతున్నారు డాక్టర్! నాకు కీర్తి దాహం లేదు, పదవీ కాంక్ష అంతకన్నా లేదు. నాకూ అవసరం ఉండే అడుగుతున్నాను.

నారా: ఏమవసరమో నే తెలుసుకోవచ్చునా?

జాక: నా అవసరమా? వీల్లేదు. క్షమించండి. అదీ రహస్యమే! వెల్లడిచేయటానికి వీల్లేదు. సాయంత్రం

దాకా టైమ్ యిస్తున్నాను. మీరీ విషయం చెప్తారా చెప్పినట్లు లేదా ప్రెసిడెంట్ కి నేనే యిన్ఫారమ్ చేస్తాను.

నారా: జాకబ్!

జాక: సాయంత్రం వస్తాను. గుర్తుంచుకోండి.

నారా: కాదు జాకబ్ రేపు ఉదయం రా!

జాక: ఉహూ! వీల్లేదు. (జాకబ్ వెళ్ళిపోతాడు)

[నారాయణ వినిపించుకోకుండా విదిలించుకు పోతున్న జాకబ్ వంక అసహాయంగా చూసి, తలుపు బిగించి "ఏం చేయాలి? నే నేం చేయాలి యీ పరిస్థితిలో?" అని ప్రశ్నించుకుంటూ పచార్లు చేస్తుంటాడు. సమాధానం దొరకనే లేదు. ఇంతలోకే తలుపు చప్పుడవుతుంది. కాగితాలు త్వరత్వరగా సర్ది ఫైల్ తీసికెళ్లి పరిశోధనశాలలో పెట్టి తలుపు తీస్తాడు. ప్రెసిడెంట్ ముఖర్జీ ప్రవేశం]

ప్రెసి: గుడ్ మార్నింగ్ డాక్టర్!

నారా: వెరీ గుడ్ మార్నింగ్ సర్!

ప్రెసి: మా మార్షల్ నిన్న మీ లాబరేటరీకి వచ్చాడు కదూ?

నారా: అవును. నిన్న వచ్చాడు.

ప్రెసి: అతనితో కొత్తగా ఏమీ కనుక్కో లేదని చెప్పారట గా.

నారా: అవును.

ప్రెసి: ఏమిటి 'అవును' డాక్టర్? మా మార్షల్ తో చెప్పటమా! లేక—ఏమీ కనుక్కోక పోవటమా?

నారా: మీ మార్షల్ తో చెప్పటమే!

ప్రెసి: అయితే మీరు కనుక్కున్నది ఏమీ లేదన్నమాట!

నారా: క్షమించండి. నిన్న అబద్ధం చెప్పాను. నేనొకటి కనిపెట్టింది వాస్తవమే.

ప్రెసి: (సంతోషంతో) కంగ్రాట్స్ డాక్టర్... కంగ్రాట్స్! (షేక్ హాండ్ చేస్తాడు)

నారా: థాంక్యూ సర్!

ప్రెసి: (తమాయించుకుని) ఏమిటి డాక్టర్ ఆ పరిశోధన? మనకూ మన దేశానికీ యావత్ప్రపంచానికీ అది ఎలా ఉపయోగిస్తుంది? అసలది ఎటువంటిదో ఏమిటో ముందు చెప్పండి. అహ...అలా కాదు. అసలది ఎలా కనుగొన్నారో ఏమిటో అంతా సవిస్తరంగా — కాదు, కాదు — క్లుప్తంగా అయిదు నిమిషాల్లో చెప్పండి, డాక్టర్! త్వరగా చెప్పేయ్

నారా: ఒక్క రోజులో కనుగొన్నది కాదు ప్రెసిడెంట్ అది. పదిసంవత్సరాలనుండి రాత్రింబవళ్లు బుర్ర బద్దలుకొట్టుకున్న దానికి ఫలితం అది. క్లుప్తంగా చెప్పాలంటే కుదరదు. క్షమించండి. సాయంత్రం విచ్చేస్తే సవిస్తరంగా విన్నవిస్తాను.

ప్రెసి: అది నిర్మాణాత్మకమా? విధ్వంసకరమా?

నారా: రెండూను.

ప్రెసి: కత్తికి రెండువైపులా పదునుండటం ఎన్నడూ ఎఱగమే? ఎక్కడా విన లేదే!?

నారా: అవును—ఈ రోజు దాకా, నేనీ కొత్తవిషయం కనుక్కున్న దాకా కత్తికి రెండు వైపులా పదును పెట్టుకోవచ్చునని తెలీదు ఎవరికీ. ఇన్నాళ్ళూ వేలు వేలు కత్తులకు పదును పెట్టుకుని కూర తఱుక్కోవటాని కొకటి, కుత్తుక తుఱుమటానికొకటే ఉపయోగిస్తున్నారు. అంతే గాని ఒకే కత్తికి రెండు వేపులా పదును పెట్టటం, పెట్టుకొని అవసరంవచ్చినట్లు ఉపయోగించుకోవటం తెలీదు; తెల్సుకోవటానికి ప్రయత్నమూ జరగలేదు.

ప్రెసి: ఈ కొత్తపరిశోధన వింతగా ఉందే! అదెలా సాధ్యమౌతుంది డాక్టర్?

నారా: ఎందుకు కాదు? మనలో మంచి లేదూ?

ప్రెసి: ఎందుకు లేదూ? ఉంది.

నారా: చెడు లేదూ?

ప్రెసి: చెడా?!

నారా: అవును. చెడు.

ప్రెసి: అవును. చెడుకూడా ఉంది.

నారా: మరి అదెలా సాధ్యం? ఒకరిలోనే మంచీ, చెడూ ఎలా ఉంటయ్?

ప్రెసి: ద్వంద్వప్రకృతి మానవునిది.

నారా: ఆ మానవుడు తయారుచేసిందే యీ యంత్రమూను. ఈ ప్రపంచాన్ని సుందర నందనోద్యానంగా రూపొందిస్తుంది కావాలంటే—లేదా కంకాళాలూ, భేతాళాలూ నర్తించే భయంకర శ్మశానంగా మార్చి ఊరుకుంటుంది.

ప్రెసి: ఎలా కనుక్కోగల్గారు డాక్టర్?

నారా: పది సంవత్సరాలు—శాస్త్రానికి ఓపికా పట్టుదలా పట్టుకొమ్మలు-నిండు పది సంవత్సరాలు పరిశోధన చేశాను. నెత్తురు పిండి పరిశ్రమ చేశాను. సకల సౌఖ్యాలూ పరిత్యజించాను. కఠిన తపస్సు చేశాను. (నిట్టూర్చి) కాని... కాని అది కనుక్కొన్నది ఒక్క రాత్రి...అవును ఒక్క రాత్రిలో....మిస్టర్ ప్రెసిడెంట్ ఏ పరిశోధన అయినా అంతేననుకోండి!

ప్రెసి: అవును! అందరూ అలాగే అంటారు. న్యూటన్ విషయం తీసుకోండి. చెట్టునుంచి రాలిన పండునుబట్టే భూమ్యాకర్షణసిద్ధాంతాన్ని నిర్వచించగల్గాడు.

నారా: అది వేరు—మిస్టర్ ప్రెసిడెంట్! అది యాక్సిడెంటల్. ఆర్కిమెడీస్ సిద్ధాంతంమాత్రం...అదీ అంతే! ఆర్కిమెడీసూ తొట్టిస్నానం చేస్తూ తన బరువు కొంత కోల్పోయినట్లు అనుభూతి పొందాడు. ఆ కోల్పోయిన బరువుకూ, తను తొట్లో మునగటంవల్ల పొర్లిపోయిన నీటి ఘనపరిమాణానికీ గల సంబంధాన్ని సిద్ధాంతీకరించాడు. నా పరిశోధన ఆ కోవకు చెందదు. దీని పద్ధతే వేఱు. దీని పథమే వేఱు. ఒక లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఒక మార్గాన బయల్దేరాను.

ప్రెసి: వేఱొకమార్గాన లక్ష్యం చేరారు. అంతేనా?

నారా: అదే నే చెప్పబోతున్నది. మొదటిమార్గంనుంచి రెండవ మార్గంలోకి మారటం మాత్రం యాక్సిడెంటల్.

ప్రెసి: యాక్సిడెంటల్ కాదన్నారు ఇంతకు ముందుగా.

నారా: అవును కాదన్నాను. హెన్రీ బెక్వెరల్ అనే ఫ్రెంచిశాస్త్రజ్ఞుడి పేరు విన్నారా?

ప్రెసి: మొదటిసారిగా కశకిని కనుగొన్నది అతనేగా?

నారా: అవును. అతనే! ఆ శక్తిని అతను కనుక్కొన్నది క్వైట్ యాక్సిడెంటల్. కాని ఆర్కిమెడీసూ న్యూటన్ల పరిశోధన్లకూ, బెక్వెరల్ పరిశోధనకూ చాలా భేదముంది.

ప్రెసి: ఏమిటా భేదం?

నారా: రేడియోధార్మికకిరణాలంటూ కొన్ని వున్నాయని తెల్సుకుంది బెక్వెరలే. అది 1896 లో. అప్పటికి ఎక్స్-కిరణాలు కనుక్కొని ఒక సంవత్సరమయింది. ప్రపంచం మొత్తం ఎక్స్-కిరణాలమీదే పరిశోధన సాగిస్తున్నది. బెక్వెరల్ ఎక్స్-కిరణాలకూ, కొన్నిరకాల సాల్ట్స్‌కూ గల సంబంధం స్టడీచేస్తూ, ఆరోజు సూర్యరశ్మి లేకపోవటంతో యురేనియం పొటాషియంసాల్టును ఒక కాగితంలో చుట్టి డ్రాయర్లో పెట్టాడట. ఆ డ్రాయర్లోనే ఫోటోగ్రాఫిక్ ప్లేట్స్‌కూడా ఉన్నాయట. తెల్లవారి చూసేసరికి ఆ ప్లేట్స్ దెబ్బతిని ఉన్నాయి.

ప్రెసి: ఆ ప్లేటుకు నల్లకాగితం చుట్టలేదా?

నారా: ఏందుకు లేదూ? దానినిబట్టే యురేనియంసాల్ట్ కొత్తరకం కిరణాలను ప్రసారం చేస్తుందనీ, ఆ కిరణాలకు కాగితాలుగాని, చీకటిగాని ఏవిధంగానూ అడ్డంకాదనీ—చెప్పగల్గాడు.

ప్రెసి: మీ పరిశోధన యీ రకానికి కొంచెం దగ్గఱగా ఉన్నట్లుంది.

నారా: కాదు. నాపరిశోధన ఏరకానికీ చెందదు. మొదటిమార్గంనుంచి రెండవమార్గంలోకి మారటం మాత్రం యిలా యాక్సిడెంటల్. ఆ తర్వాత, ఆ మార్గాన.

ప్రెసి: అర్థమయింది డాక్టర్! రామన్ ఆ సంవత్సరం చెప్పకపోయినట్లయితే రెండుమూడు సంవత్సరాల తర్వాత రామన్ ఎఫెక్టు ఎటూ తెల్సి ఉండేది అంటారు. అలాగే...

నారా: అవును తెల్సిఉండేది.

ప్రెసి: అలాగే మీపరిశోధనా తెలిసివుండేది. ఎటొచ్చీ ఈ రెండవమార్గంలోకి యాక్సిడెంటల్‌గా రావటంతో ఒకటిరెండేళ్ళు ముందుగా కనుక్కోగల్గారు.

నారా: మీకు సరిగా అర్థంకాలేదు—అసలు విషయం. రామన్ ఎఫెక్టు రెండేళ్ళు ఆలస్యంగానయినా తెల్సేదని ఎందుకన్నారనుకుంటున్నారు?

ప్రెసి: మొదటిమార్గంలో ముళ్ళపొదలేవో అడుగడుగునా అడ్డుతగుల్తూ ఉండవచ్చు. ఆ అవరోధాలనధిగమించటానికి రెండేళ్ళాలస్యమయేది.

నారా: అదికాదు. అసలామాటకువస్తే రామన్ మొదటి మార్గానే లక్ష్యంచేశాడు.

ప్రెసి: మరి?

నారా: రామన్ ఎఫెక్టు అంతకయిదేళ్ళక్రితమే— అంటే 1923 లో నన్నమాట—సీక్వెల్ అనే సైంటిస్ట్ థియరెటికల్‌గా చెప్పగల్గాడు. ఎటొచ్చీ రామన్ ప్రయోగపూర్వకంగా నిరూపించాడు. ఆ ఋజువు రామన్ కాకపోతే మరొకరయినా చేసేవారు.

ప్రెసి: రష్యా శాస్త్రజ్ఞు లెవరోకూడా కనుక్కున్నారంటారు?

నారా: అవును. ఇద్దరు రష్యాశాస్త్రజ్ఞులు లాండ్స్‌బర్గ్, మాండెల్‌సమ్ అనేవాళ్ళు దాదాపు రామన్ కనుక్కున్నప్పుడే కనుగొన్నారు. కాని రామన్ ముందు ప్రకటన చేయగల్గాడు. ఆ కీర్తి అతనికి దక్కింది. ఆ ఎఫెక్ట్‌కి అతని పేరు పెట్టటం సంభవించింది. ఒక్కమాటలో చెప్తాను వినండి ప్రెసిడెంట్! నేను పరిశోధన సాగించటంలో గాని, ఫలితం ప్రతిపాదించటంలో గాని ఎవ్వరినీ అనుసరించలేదు.

ప్రెసి. అంటే ఎలా?

నారా: ఎలాగంటే ఏముంది? రెండు స్విచ్‌లు పెట్టాను. ఒకటి ఆన్‌చేస్తే ప్రశాంతి; రెండవది ఆన్‌చేస్తే ప్రళయం.

ప్రెసి: పనిచేయించటం చాలాసులభంలాగా ఉందే!

నారా: అవును. ఈ సౌలభ్యంకూడా కొత్తదనమే. కాని ఒకటి ఆలోచించండి ప్రెసిడెంట్! పులినీ, మేకనూ ఒక రేవున నీళ్ళు త్రాగించటం ఎంతకష్టం? నిప్పునీ, నీటినీ ఒకచోట చేర్చటం ఎంతకష్టమయినపని?

ప్రెసి: కష్టమేకాదు. అసంభవమేనని నా ఉద్దేశం.

నారా: కాదని నిరూపించటం లేదూ నా పరిశోధన?

ప్రెసి: అవును నిరూపిస్తున్నది. ఎలా సాధించగల్గారు?

నారా: శాస్త్రానికి సంబంధించిన వివరాలుకూడా చెప్పమంటారా?

ప్రెసి: అవి అవసరంలేదు. అర్థంకావు కూడాను. స్థూలంగా చెప్పండి.

నారా: ఈరోజుల్లో క్యాన్సర్ ఎలానయంచేస్తున్నారో తెల్సునా మీకు?

ప్రెసి: కొత్తపద్ధతులేవో వచ్చాయని విన్నాను.

నారా: కొత్తపద్ధతులంటూ ఏమీరాలేదు. మందులు మటుకూ కొత్తవి వచ్చాయి. ఇందాక చెప్పాను చూశారూ — బెక్వెరల్ రేడియోధార్మికశక్తి కనుగొన్నాడని. ఆ శక్తిని ఒక్క యురేనియమే కాదు, ఇంకా కొన్ని లోహాలుకూడా కల్గిఉన్నాయి.

ప్రెసి: రేడియం, థోరియం...—

నారా: అవును. ఇవన్నీ సహజంగా ఆ శక్తిని కలిగిఉన్న లోహాలు. సైక్లోట్రాన్లు, బేవాట్రాను కనుగొన్నతర్వాత — అన్నట్లు సైక్లోట్రాన్లు, బేవాట్రాన్లు అంటే మీకు తెల్సునుకదూ?

ప్రెసి: ఎలక్ట్రాన్లూ, ప్రోటాన్లూ గతిశక్తిని వృద్ధిచేసే యంత్రాలుకదూ?

నారా: అవును. అవి వచ్చినతర్వాత రేడియోయాక్టివ్ ఐసోటోప్స్ తయారుచేయగల్గారు.

ప్రెసి: క్యాన్సర్, సిఫిలిస్ మొదలగు జబ్బులు ఈ ఐసోటోప్స్‌తో తేలికగా నయమవుతున్నయ్యని ఎక్కడో చదివినట్లు గుర్తు.

నారా: చర్మవ్యాధులకు రేడియో ఫాస్ఫరస్, క్యాన్సర్‌కు రేడియో కోబాల్టు, రేడియోగోల్డు, సిఫిలిస్‌కు రేడియోబిస్మత్తు—ఇలా, ఇలా ఐసోటోప్స్ ఉపయోగించి ఇన్నాళ్ళూ "ఇక నయమవవు" అని ఆశలు వదులుకున్న భయంకర రోగాల్ని నయంచేస్తున్నారు.

ప్రెసి: ఆ ఐసోటోప్స్ మనయంత్రంతో తయారుచేసుకొనవచ్చునా?

నారా: మొదటి స్విచ్ అందుకే.

ప్రెసి: రెండవ స్విచ్ ఆన్‌చేస్తే అంతా ఆఫ్! అంతే కదూ?

నారా: అంతే! ఛెయిన్‌రియాక్షన్ జరుగుతుంది యంత్రంలోపలే. సమస్తం నాశనం. మీకు హిరోషిమాలో ప్రేల్చిన యాటంబాంబు శక్తి జ్ఞాపకం ఉందా ప్రెసిడెంట్?

ప్రెసి: హిరోషిమా, నాగసాకీ—రెండు నగరాలూ నామరూపాల్లేకుండా నాశనమయాయిగా.

నారా: నాశనంకాక ఏంచేస్తయ్? కోటిడిగ్రీల సెంటిగ్రేడు టెంపరేచరు ఏ జీవి సహిస్తుంది?-కొన్ని

వేల మిలియన్ల రెట్ల గాలి ఒత్తిడికి ఏ ప్రాణి తట్టుకోగలదు?

ప్రెసి: ఆ వేడిమికీ, ఆ గాలి ఒత్తిడికీ భవంతులూ, సర్వభూతాలూ బూడిదయిపోయినాయంటే ఆశ్చర్యమేముంది?

నారా: దానికి వేయిరెట్ల విధ్వంసకశక్తి గలిగింది ఈ మన కొత్త పరిశోధన. ఊహించుకోండి ప్రెసిడెంట్—దీని శక్తిసామర్థ్యాలు!

ప్రెసి: (ఆశ్చర్యంగా) వేయిరెట్లే!

నారా: అహ. అంతేకాదు. శక్తిని వృద్ధిచేయటం గొప్ప విషయంకాదు. ఆ శక్తిని కావాల్సినంత వరకే ఉపయోగించుకోవటం తెల్సిఉండాలి.

ప్రెసి: అంటే పవర్‌ని రెగ్యులేట్ చేయటం—అంతేనా?

నారా: అవును. అదే...ఆ సౌలభ్యంకూడా ఉంది ఇందులో. యాటంబాంబుకిగాని, ఫ్యూషన్ బాంబుకిగాని మరే యితర బాంబుకుగాని ఇంత వరకు ఇలాంటి సౌకర్యంగాని, సౌలభ్యంగాని లేదు. అందుకనే మనపరిశోధన అపూర్వమూ, అమోఘమూ అంటున్నాను; ఈ పరిశోధనా ఫలితము అతి ప్రతిభావంతమూ, అప్రతిహతమూ అని చెప్పగల్గుతున్నాను.

ప్రెసి: కంగ్రాట్స్ డాక్టర్! మిమ్మల్ని మరోసారి అభినందిస్తున్నాను.

నారా: నన్నొకడినేకాదు--అభినందించాల్సింది. ఈ రేడియోప్రవర్తకలోహాల్ని ఖనిజాలద్వారా ప్రకృతి ప్రసాదించలేదనుకోండి; మానవుడు జన్మించి, అతని బుద్ధి వికాసంచెందేదాక ఆ లోహాలలో ఒకటయినా జీవించలేదనుకోండి; లేదా సూక్ష్మపరిమాణంలో ఉన్న ఆలోహాల్ని మానవుడు గుర్తించలేదనుకోండి, గుర్తించినా పరిశోధించకుండా వదిలిపెట్టాడనుకోండి; వీటిలో ఏ ఒక్కటి జరిగి ఉండినా ప్రపంచం చీకట్లో కొట్టుకుంటుండేది, ప్రజాళి చైతన్య రహితంగా పడి ఉండేది. నేను యీనాడు ఈ పరిశోధనాఫలితాన్ని పొందగలేవాడినికాదు.

ప్రెసి: అది నిజమే డాక్టర్! అందరూ అభినందనీయులే. కాని మిమ్మల్ని అభినందించకుండా ఉండలేకున్నాను.

నారా: కృతజ్ఞుణ్ణి.

ప్రెసి: అంత అత్యద్భుత శక్తిసామర్థ్యాలు గల ఆ యంత్రం ఎలా ఉంటుందో చూడనీయండి.

నారా: క్షమించండి ప్రెసిడెంట్! ఇప్పుడు చూపించటం......సాయంత్రం రండి.

ప్రెసి: ఏం? ఇప్పుడెందుకు చూడకూడదు?

నారా: క్షమించండి. కొన్ని కారణాలున్నాయి—చూపించకపోవటానికి.

ప్రెసి: సాయంత్రం డిమాన్స్ట్రేషనుకూడా చేసి చూపించాలి.

నారా: ఓ యస్! తప్పకుండా (నాలిక కరుచుకుని) ఏమి చూపించమంటారు? డిస్ట్రక్షనా?

ప్రెసి: అవును!

నారా: ఆఁ! (గుడ్లప్పజెప్పి ఆశ్చర్యపోతాడు)

ప్రెసి: అహ కాదు డాక్టర్. శాంతికాలప్రయోజనాలు చూపించండి.

నారా: అలాగే. సాయంత్రం ఏడింటికి రండి. మీ రాకకై ఎదురుచూస్తుంటాను.

ప్రెసి: ఏడు గంటలకా? ఏడింటికి నాకు వేరే ఎంగేజ్‌మెంట్ ఉంది. తొమ్మిదింటికి వస్తాను బి రెడీ. బై......బై!

[ప్రెసిడెంట్ వెళ్ళిపోగానే ఒక నిమిషం అటూ ఇటూ పచారుచేసి ఏదో ఒక నిశ్చయానికి వచ్చి నట్లుగా పరిశోధనశాలలోకి పోయి 'మీటగు' యడ్జస్ట్‌చేసి హాల్లోకి వస్తాడు. విన్పించీ విన్పించకుండా "పవర్ రెగ్యులేట్ చేశాను, ఎందుకయినా మంచిది" అని అనుకుంటూ లెటర్ పాడ్ మీద వ్రాస్తూ కూర్చుంటాడు. వ్రాసుకుంటూ పైకి చదువుతాడు:]

"శ్రీమతి శాంతా తివారీకి—

నిన్న సాయంత్రం జరిగిన విషయానికి చాలా విచారిస్తున్నాను. ఏ స్త్రీ సహించని నేరం చేసినందుకు ఎంతగానో చింతిస్తున్నాను. మీ వంటి పుణ్య స్త్రీపట్ల కావించిన పాపానికి పశ్చాత్తాప పడుతున్నాను. క్షణికోద్రేకానికి వశ్యుడనై కోరకూడని కోరికలను కోరినందులకు క్షమించమని ప్రార్థిస్తున్నాను.

## విపర్యయం

(నేపథ్యంలో శాంతాలివారి కంఠం ప్రశ్నిస్తుంది)

శాం. కంఠం : నిజంగా!

"నా అపూర్వ పరిశోధనా శక్తిసామర్థ్యాలు చేతిలో పట్టుకుని ఒక వ్యక్తినేకాదు, ఒక దేశాన్నే కాదు, యావత్ప్రపంచాన్నే గడగడ లాడిద్దామనుకున్నాను. ప్రపంచం పంచప్రాణాలు నాగుప్పిట్లో ఉన్నాయని నిరూపిద్దామనుకున్నాను. నా పరిశోధనాఫలితంగా పాదాల ముందు ప్రజలు సాష్టాంగప్రణామ మాచరించాలని ఆశించాను..."

శాం. కం: ఎప్పుడిదంతా?

"నిన్ను జయించినతర్వాత...నీ ప్రేమనుపొందిన తర్వాత..."

శాం. కం: ఎందుకిదంతా?

"...డాక్టర్ నారాయణంటే సామాన్యమానవుడు కాదనీ, సకల శక్తిసంపన్నుడైన సైంటిష్టనీ నీకు తెలియాలని...ప్రభుత్వం నాకు జరిపే సన్మానాలలో నువ్వూ భాగస్వామిని కావాలని... ప్రజలు నాకు సమర్పించే ప్రశంసాపత్రాలు పక్కన ఉండి నువ్వు నాబదులు స్వీకరించాలని-నీకు అన్నివిధాలా సంతృప్తి కల్గించి, ఆ మార్షల్ కన్న యీ డాక్టర్ ఎన్నోవిధాల...కాదుకాదు ...ఎన్నివిధాల గొప్పో చూపిద్దామని..."

శాం. కం: కాని?

"...కాని నా కలలు కల్లలయినాయి. ఆశలు నిరాశలయినాయి. నీ ప్రేమను పొందలేక పోయాను. పూర్తిగా పరాజయం పొందాను..."

శాం. కం : ఎందుకని?

"...నీ హృదయం అధికారానికీ, ఆయుధాలకీ లొంగదు; నీ ప్రేమ అర్థానికీ, ఆడంబరాలకీ లభించదు-అని..."

శాం. కం : ఇప్పటికయినా తెల్సుకున్నావు కదా?

"...తెల్సుకున్నాను. పూర్తిగా తెల్సుకున్నాను. తెల్సుకుని సిగ్గుపడుతున్నాను. విశ్వశ్రేయస్సుకుపయోగించాల్సిన విజ్ఞానశాస్త్రాన్ని

స్వార్థలాభానికి వృథా చేయదలచుకున్నందుకు.. ఇంద్రియదౌర్బల్యానికీ, ప్రాపంచికవిషయాలకీ అతీతుడుగా ఉండవల్సినవాడిని సామాన్య మానవుడిలా క్షణికోద్రేకానందాలకు లొంగిపోయినందుకు చాలా విచారిస్తున్నాను..."

శాం. కం: నీలో వచ్చిన హృదయపరివర్తనకు హర్షిస్తున్నాను.

"...సాయంత్రం ఏడుగంటలకల్లా ఇక్కడికి వస్తే సంతోషిస్తాను. నన్ను మన్నించమని మనః పూర్వకంగా ముఖతః ప్రార్థిస్తాను..."

[మిష్టర్ జాకబ్ మొదటిద్వారంగుండా ప్రవేశిస్తాడు. ఆ విషయం గ్రహించని నారాయణ వ్రాసుకుంటూనే ఉంటాడు. జాకబ్ నారాయణ వెనుకకువెళ్ళి అతనువ్రాసేది ఒకసారిమూసి నిష్క్రమిస్తాడు.]

"...నా పరిశోధన పుట్టుపూర్వోత్తరాలూ, అద్భుతశక్తులూ పూర్తిగా వివరంగా నివేదిస్తాను; డిమానిస్ట్రేట్ చేసిచూపిస్తాను. ఇంతవరకు ఇట్లాంటి పరిశోధన ఎక్కడా ఎన్నడూ జరుగలేదు. పది సంవత్సరాల తపఃఫలిత మిది సస్యశ్యామల క్షేత్రాలను సహారా ఎడారిగా మార్చగలదు. లేదా ఎడారులసహితం ఫలవంతంచేసి రకరకాల పంటలతో రమణీయం చేయగలదు—ఈశక్తి. వేయిదళాల వికసించిన నాగరికతనూ, అనేక రంగాల అభివృద్ధిగాంచిన నగరాలనూ నామ రూపాల్లేకుండా నాశనంచేసి ప్రపంచాన్ని చీకటిసముద్రంలో ముంచివేయగలదు; లేదా రాత్రింబవళ్ళ భేదం తెలీనీకుండా ప్రపంచాన్ని సువర్ణకాంతుల్లో ముంచెత్తగలదు. ప్రజాళిని ఎన్నడూ కనీ వినీ ఎఱుగని కొత్తకొత్తవ్యాధుల బారిబడ చేయగలదు, లేదా 'ఇక నయంకాదీ రోగం' అని ఆశలు వదులుకున్నవారికి ప్రాణదానం చేయగలదు. ఒక్కమాటలో చెప్పాలంటే దీనిని మానవకోటికి విముక్తిలేని శాపంగానూ తీర్చగలను; లేదా మహోన్నతమైన వరంగానూ మార్చగలను. ఇట్లాకాదు...ఇట్లాచెప్తే కుదరదు..."

శాం. కం: చాలా వింతగా ఎంతో కొత్తగా ఉందే యీ పరిశోధనశక్తి?!

"...సాయంత్రం ఏడింటికి వస్తే బాగుంటుంది. తప్పక వస్తారని ఆశిస్తున్నాను..."

[నారాయణ ఉత్తరం కవరులో పెట్టి ఆ కవరును చూస్తూ ఒక అరనిమిషం పిచ్చివాడులా విపరీతంగానూ, వికటంగానూ నవ్వి కవరును పోస్టుచేయటానికి బయటికి పోతాడు—తెర.]

[సశేషము]

# తలవంచని పువ్వులు

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

౧

విక్రమ ధనంజయా! వీరనారాయణా!
జయీభవ! విజయీభవ!
విద్యాభోజా! విదర్భ రాజా!
విజయీభవ! దిగ్విజయీభవ!

వందిమాగధులు వెండిదుడ్లలో ప్రవేశించి పక్కకు తప్పుకొన్నారు. మాలవ మహారాజులుంగారు రత్నరచిత సువర్ణ సింహాసనంమీద ఆసీనులు అయినారు. మంత్రి, సామంత, దండనాథాదులూ, యావత్ప్రజానీకమూ ఆ వెనుక యథాస్థానాల్లో కూర్చున్నారు. ఇసుక వేస్తే రాలకుండా ఉన్నారు జనం.

ఏటేటా జరిగే శారదా ఉత్సవాల్లో ఆరోజు చివరిది. దేశదేశాగత నట, విట, కవి, గాయక, వైతాళికులతో ఆ నగరం తొమ్మిదిరోజులనుంచీ నిండిపోయింది. అన్నిరోజుల ఉత్సవ సారమూ ఆరోజున మూర్తికట్టి అక్కడికి చేరినట్టుంది.

సూర్యకాంత ప్రాసాదంలో ఆనాడు వినోద ప్రదర్శనం. ముందు ఆస్థాన వైణికుడు వీణమీద పట్టు బురఖాతీసి శ్రుతి సవరిస్తున్నాడు. జనం సుకుమార వీణాగానానికి ఎదురుచూస్తున్నటు లేదు. విచ్చుకత్తుల రాజభటులు ఎర్రని చూపులతో ఎంత అదలిస్తున్నా కోలాహలం అణగటం లేదు.

దాక్షిణాత్య శిల్పి చంద్రమౌళి ఒక ప్రక్క ఒదిగి నిల్చున్నాడు. అతడెప్పుడూ రాజసభలు చూడలేదు. నాగరికుల తళుకు బెళుకులకు అతని అమాయక హృదయం అలవాటుపడలేదు. హృదయాలను సైతం కరిగించి అమృతమూర్తులుగా మలచగల అతనికి నాటి మానవులను పలకరించి ప్రసన్నులను చేసుకోవడం ఎట్లాగో తెలియలేదు. ప్రాసాదం చివర ఒక స్తంభాన్ని ఆనుకొని తెల్లబోయి చూస్తున్నాడు. నగర జనుల నిష్కారణ భంగిమలను, ఒయ్యారాలను చూచి సహజంగా ఉండవలసిన మానవులు ఎందుకిట్లా బిగువులు పోతారో అతనికి అర్థంకాలేదు.

వీణ ప్రారంభం అయింది. ఆ సిద్ధహస్తుడు అమృతవాహిని పలికిస్తున్నాడు. శ్రోతలు ఇంకెందుకో చూస్తున్నట్టుంది. మంత్రి హస్తసంజ్ఞతో వీణ ఆగిపోయింది.

ఇక ఇంద్రజాలం అన్నారు. ఒక పొట్టివాడు ముందుకువచ్చి మహారాజు ఎదుట భూమికి మూడుసార్లు సమస్కరించి నిలుచున్నాడు. శుద్ధ శ్రోత్రియంగావున్న ముఖంలో చంద్రవంకలా గంధపుచారలుంచి దానిమీద ఎర్రని కుంకుమబొట్టు పెట్టాడు. చేతిలోని నెమలికుంచె ఆకాశంమీద మూడుసార్లు తిప్పాడు. జలజల పువ్వులు రాలాయి. 'గగన కుసుమాలు ప్రభూ చిత్తగించండి' అన్నాడు. ప్రజలు విరగబడి నవ్వారు. నెమలిపింఛం గాలిలో సున్నాలుగా చుట్టాడు. అంతలో కన్నులు మిరుమిట్లు గొలుపుతూ బలిష్ఠమైన రెండు వానరవిగ్రహాలు బయలుదేరి యుద్ధం చెయ్యడం ప్రారంభించాయి. "వాలి సుగ్రీవులు" భూలోక దేవేంద్రా!' అన్నాడు. ప్రధాని చూపుతో ఆగి, పక్కకు తొలగిపోయాడు. వీణకన్న దీనితో కొంచం ప్రజలముఖాలు కలకలలాడాయి.

ఒక మహాకాయుడు నడిచే నల్లరాతి విగ్రహంలా సభామధ్యానికి వచ్చాడు. ప్రజల్లో కలకలం బయలుదేరింది. ఉన్నచోటునుంచి ముందుకు త్రోసుకువస్తున్నారు. రాజోద్యోగులు సద్దలేక తొక్కిడిపడుతున్నారు. 'అడుగో బ్రహ్మదేశపు బలశాలి' అనేమాటలు సభలో గుప్పుమన్నాయి. అతనికి కావలసిన యేర్పాట్లన్నీ చరచర చేయించారు. మహారాజు సింహాసనం మీద సుఖస్థితిలో సర్దుకుని కళ్ళల్లో కుతూహలం కనపరచారు. మహాకాయుడు మెడలు తిరగని బింకంతో మహారాజువైపు తలవూపి సమస్కారం అభినయించాడు. ఇద్దరు భృత్యులు రెండుబాహువుల పొడవూ,

రెండంగుళాల మందమూగల ఒక ఇనుపదువ్వను తెచ్చి అతని ముందుంచారు. అతడు అవలీలగా ఏనుగు తామర తూడును అందుకున్నట్టు దాన్నందుకుని కుడిచేతి వేళ్ళ మధ్య రెండునిమిషాలు గిరగిర తిప్పి భూమిపై నిల బెట్టాడు. జనం ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. అతడు దానిని పొట్టకు ఆనించి కండరాలు పూరించి ఇటు ఊగి అటు ఆగి కొంతసేపటికి పూర్ణానుస్వారంలా వంచి ఆ వలయాన్ని నిర్లక్ష్యంగా ఎదుటికి పడవేశాడు. ప్రజలు చప్పటవర్షం కురిపించారు. ప్రభువు ముఖంలో చిరునవ్వు వెలిగింది. ప్రధాని ఆజ్ఞతో రాజభృత్యులు వేయిదీనారాలు వెండిపళ్లెరంలోపోసి అతనికి బహూకరించారు. మహారాజులుంగారు లేచారు. అతన్ని చూడడానికి జనం విరగబడి వెంటబడారు. రాజమార్గంలో జనప్రవాహం పొంగిపోయింది. చంద్రమౌళి జనుల ఒత్తిడికి ఆగలేక తూలి ఘంటాపథంమీద పడ్డాడు. అతని పెదవిమీద, వాడి రేకులూడిన చిరునవ్వుపుట్టి చెదరి అదృశ్యమయింది.

సాయంకాలం చంద్రకాంత సౌధంలో మహాసభ అన్నారు. మధ్యాహ్నంనుంచి సభాభవనం అలంకరిస్తున్నారు. సభాస్థలి భూలోక స్వర్గంలా ఉంది. మాలవమహారాజువైభవానికిఅది ప్రదర్శనశాలగాబోలు. రంగురంగుల తలపాగాలతో సకల సామంతరాజులూ సభలోకి వేంచేస్తున్నారు.

చంద్రమౌళి ఒక పట్టుసంచీ చేతితో పట్టుకొని చంద్రకాంత సౌధం చలువరాతి మెట్లమీద నిలుచున్నాడు. నేటి సభలో ప్రవేశం ఎట్లాగా అని తెల్లని అమాయకపు కళ్ళతో ఆలోచిస్తున్నాడు. ఎక్కడి దక్షిణదేశం ? ఎక్కడి విదర్భనగరం ? రెండు దూర దూర దేశాలను రెండు దూరదూరం మానవ హృదయాలను దగ్గరగా చేర్చి స్నేహపూరితం చేసే శక్తి లోకోత్తరమైన తన శిల్పకళకు లేదా ? అనుకున్నాడు.

మహాకవిగారు సపరివారంగా వస్తున్నారు. ఆయన తెల్లని బట్టతల, చుట్టూ రెల్లుపూలు పూచిన గోదావరిలంకలా ఉంది. చెవులకు బంగారు కుండలాలు, చేతులకు సింహతలాటం మురుగులు. పెద్దరకం కుంకుమ రంగు కాశ్మీరు శాలువ భుజాలను కప్పింది. వెంటవచ్చే ఆశ్రిత కవుల కైవారాలతో ఆయన హృదయం మత్తెక్కి ఉంది. ఆయన చూపునకు మరింత ఒదిగి, తన అల్పత్వం ఒప్పుకొన్న బట్టమూర్తికి ఆ కోటలో కనకాభిషేకం కాదని తలయెత్తినవాడికి దేవిడీమన్నా. ఆ కోట బురుజులు ఆయనకోసం కట్టినవి. వాటి మధ్యకు తనకు తెలిసినంతవరకూ ఏ ప్రతిభాశాలినీ రానివ్వలేదు. తాను ఆ పరిధిదాటి ఎక్కడికీపోడు. తన పద్యాల అర్థం తానే చెప్పాలి. మహారాజే ఆనందించాలి తక్కిన కవీశ్వరులకు మహారాజుకూ ఆయన ఆనకట్టు.

చంద్రమౌళికి సరిగా నమస్కరించడం చాతకాలేదు. అయినా చేతులు జోడించి మెట్టుమీద నిలుచున్నాడు. మహాకవిగారు నిర్లక్ష్యంగా నిలువునా చూసి 'ఎవరయ్యా నువ్వు' అన్నట్టు కళ్లను ఎగరవేశారు.

"చాలా దూర దేశంనుంచి వచ్చానండి"

"మం...చి పనిచే...శావు"

"మాలవ ప్రభువు మిక్కిలి రసజ్ఞులనీ, కళాసౌందర్యవేత్తలనీ మా వైపు గొప్పవాడుక"

"ఎవరు కాదన్నారు?"

"ఆ రసిక ప్రభువు దర్శనం చేస్తేనే నా కళ చరితార్థం; అనే నమ్మకంతో ఎన్ని కష్టాలైనా లెక్కచెయ్యకుండా వచ్చాను."

"అబ్బా!"

"కళాజీవి బాధ, రసజ్ఞ సందర్శనం కోసం పడే తహతహ మహాకవీంద్రులు తమకు తెలియనిది కాదు."

ఈ చివరిమాటతో కవిగారి వికారం కొంత ఉపశమించినా ఆయన అహంకారానికి తగిన ఆహారం పడలేదు.

"ఇంతకీ...ఏమంటావు?"

"నా కళను ప్రభువులవద్ద ప్రదర్శించే అవకాశం కలిగించ వలసిందని కోరుతున్నాను."

"మధ్యను...నేనెవరు? నువ్వేమో మహాకళావేత్తవు. ఆయనేమో మహారసజ్ఞులాయె! ఆలస్యం ఎందుకు. ప్రభువులు సభకు వేంచేసే వేళ అయింది. వెళ్ళి దర్శనం చెయ్యి."

"ఒక దేశాంతర ఆగంతకుడికి ఈ మాత్రం సహాయము చెయ్యలేరా? మీ ప్రభువు కళాప్రియత్వానికి ఈమాత్రం వన్నె పెట్టలేరా?"

"ఈ మధ్య కొత్తమాటలు నేర్చారు. చిన్నప్పటినుంచీ వేల పద్యాలురాసి పోశాను. మహాకవి అనిపించు

కున్నాను. అంతేగాని — ఈ కళ యేమిటి? కళాయి యేమిటి?...కవిత్వం ఏమైనా చేసి తెచ్చావా?"

"లేదండి."

"అయితే...ఈ ఉపన్యాసమంతా ఏమిటి? మాకు చాలా తొందరపని ఉంది. ఇప్పుడు కవుల సభ. నువ్వేమో కవివి కావు. ఇంక నీ కళ ఏమిటి?"

"మనవి చేస్తున్నాను. కవిత్వం అంటే నాకు తెలియదు. నేనేమీ మాటాడలేను. కాని నేను తెచ్చిన అపూర్వ వస్తువు పలుకుతుంది. మాటాడుతుంది. రసజ్ఞుల మనస్సును లాలించగలదు. ఒక్క త్రుటి...ప్రభువు ఎదుట నిలుపగలిగితే..."

"అబ్బో!...ఏదీ ఆ వస్తువు?"

"క్షమించండి. ప్రభు సమక్షంలో తప్ప పైకి తియ్యను. అది నా కళామర్యాద. ఆయన కానుకను ఆయనే తొలిసారి చూడాలని నా కాంక్ష. ఈ ప్రభు గౌరవాన్ని మీరు కూడా ఆమోదిస్తారనే నమ్ముతున్నాను."

మహాకవిగారి కళ్ళల్లో మంటలు రేగాయి. కుండలాలు ఊగాయి. తన ప్రాముఖ్యానికే తీరని అవమానం జరిగింది. ఇంతవరకూ తన అనుగ్రహం కోసం చేతులు జోడించుకు తిరిగేవాడేగాని ఎదిరించి మాటాడిన వాడు లేకపోయాడు. శిల్పివైపు చురచుర చూసి జారే కాశ్మీరు శాలువాను మరింత ఎర్రగా పైకి తోసి చరచర పరివారంతో నడిచి వెళ్ళిపోయారు. చంద్రమౌళి తన తప్పేమో తెలియక తెల్లబోయాడు. కర్తవ్యం ఏమిటి??

లోపల సభ ప్రారంభమయింది. మహాకవిగారి చక్క సమాసాలు సాగిసాగి వినిపిస్తున్నాయి. ఇటునుంచి చదివితే రాజుపేరు అటునుంచి చదివితే తనపేరూ ఇందులో ఉందని ఒత్తి ఒత్తి చెబుతున్నారు. చంద్రమౌళి ఇంతి దూరం వచ్చి రాజ దర్శనం చెయ్యకుండా వ దనుకున్నాడు. చర్రున సభలోకి దూసుకువెళ్లాడు. సభాస్థలి చేరకుండా రాజభటు లడ్డగించారు.

"ప్రభుదర్శనం చెయ్యాలి"

"అనుజ్ఞ ఉండి తీరాలి"

"ఇది మీ ప్రభువారికి కానుక. పాదపీఠం దగ్గర ఉంచివస్తాను. వెళ్ళనివ్వండి."

"అడుగు కదలితే...మెడ మీద తల ఉండదు"

"మీ ప్రభువు సరసతా, మీ యోగ్యతా ఇంతటివేనా!"

ఒక రాజభటుడు చటుక్కున వచ్చి ఆ మహాశిల్పి మెడమీద చెయ్యివేసి ఒక్క ఊపున గంటివేశాడు. అతడు చలువరాతి మెట్లమీదనుంచి దొర్లి నేలమీద పడ్డాడు. చేతిలోనిపటుసంచీ దూరంగా పడ్డది. చంద్రమౌళి నెమ్మదిగా లేచి సంచీ తీసుకుని నీరు నిండిన కళ్ళతో ఒక్కసారి రాజభవనం కేసి చూసి చరచర కోట వెలుపలికి నడిచాడు. రాజవీధి నిర్మానుష్యంగా ఉంది. తన లోకోత్తర శిల్పాన్ని పైకి తీసి తనివితీరా చూసుకున్నాడు. దాని వెనకఉన్న కథ అతని తడికళ్ళల్లో తిరిగింది.

## ౩

ఒకనాడు తన పల్లెటి కుటీరంలో చంద్రమౌళి ఉలిని ఒక మంచిగంధపుముక్క మీద నడుపుతున్నాడు. అతని తియ్యని ఊహాలు సున్నితమైన మీదకు జారి చందన ఖండంలో సుందరరేఖలుగా విడుతున్నాయి. శిల్ప సౌందర్యమో, చందన హృదయమో ఆ రేఖల్లో పరిమళాలు నింపుతున్నాయి.

సుందరేశ్వరుని ముందు కృశాంగి హైమవతి. ఆయన కళ్ళల్లో ప్రేమభిక్ష. ఆ కులపాలిక అరమోడ్పు కన్నుల్లో చిక్కని సిగ్గులు. అతని మనస్సుకంటె వేగంగా ఉలిపరిగెత్తుతున్నది. ఉలికంటె వేగంగా ఊహాలు తరుముతున్నాయి. ఆ శిల్పంలో కలిసిపోయి తానున్నట్టే మరచిపోయాడు ఆ కళా తపస్వి

తన కుటీరం వాకిట్లో ఏదో అలజడి. అయినా అతడు తలయెత్తి లేదు. కరగుండెలోనుంచి కళను ఇంకా పిండుతూనే ఉన్నాడు.

భార్య 'ఆశ' అలజడిగావచ్చి ఎదుట నుంచుండి, ఐదేళ్ళబిడ్డ కళ వెక్కి వెక్కి యేడుస్తూ ఉండగా చంద్రమౌళి తలయెత్తి చూచాడు.

తనబిడ్డకంటినుంచి జారే నీలాలు చూచిన అతని చేతిలోని ఉలి జారిపోయింది.

తపోభంగంలా శిల్పం ఆగిపోయింది. 'ఏమిటి సంగతి' అన్నాడు విధిలేక —

ఆశ ఎర్రబడ్డముఖంలో చెప్పడం మొదలు పెట్టింది — "పాపం, 'కళ' యేమీ చెయ్యలేదు

సుమండీ—మన పొగడచెట్లక్రింద పువ్వులేరుకుంటూ ఆడుకుంటున్నది. ఆ ధనవంతుల బిడ్డలేదూ శేషమణి. ఆ పిల్ల, కళను పిలిచి తీసుకువెళ్ళింది. ఇద్దరూ చాలా సేపు ఆడుకున్నారు. ఆ పిల్ల మెడలోని రత్నాలహారం దీని మెడలో వేసి 'నీకిచ్చేశాను తీసుకో' అందిట. కళ నిజమనుకుని ఇంటికి పరుగెత్తుకువస్తూ ఉంటే ఆ అమ్మాయి ఏడుస్తూ కళ హారం ఎత్తుకు పోతున్నదని తల్లితో చెప్పిందిట. వెంటనే ఆవిడ పరుగెత్తుకవచ్చి 'దొంగబుద్ధులు, దొంగపిల్లలు లేకివాళ్ళతో స్నేహాలు వద్దంటే మా పిల్ల వినదు' అని ఈ పిల్లను గుంజి హారం తీసుకుని వెళ్ళిపోయింది "ఇదేనా మర్యాద చూడండి. కూటికి పేదలమైతే గుణానికీనా?" అని ఆమె బరువుగా నిట్టూర్చింది, చురచురమనే కళ్ళతో—

చంద్రమౌళి అన్నాడు నెమ్మదిగా—

"పిచ్చిదానా నీకూ ఉందే ధనవంతులంటే వ్యామోహం. వారి తళతళలాడే నగలూ, మిలమిల లాడే చీరలూ చూచి ఎంత ఆకర్షణ నీకు! వారిలాగే మెరిసి పోవాలని ఎంత ఆరాటపడతావు! ఆ కోరిక ఎప్పుడో మనల్ని శాపమై మొత్తుతుంది. ఈసడిస్తుంది. అని నీకు తెలియలేదు. ఇంక ఊరుకో—" అని మళ్ళా శిల్పాన్ని అందుకున్నాడు.

ఆశ ఊరుకో లేదు.

ఆపండి ఆ పని. ఆలుబిడ్డలు సుఖించని ఈ చెక్కడాలు శిల్పాలూ ఎందుకూ? చేతులో ఇంత నేర్పుంచి ఏం లాభం? తలుచుకుంటే అట్లాంటి రత్నహారాలు పది సంపాదించగలరు. నన్నూ బిడ్డనూ అలరించి అలంకరించగలరు. కళను చూచి మెచ్చి ఇచ్చే ప్రభువులు దేశంలో లేకపోలేదు. వచ్చేవి శారదోత్సవాలు. మీ చెయ్యిసోకితే రాళ్ళుమాటాడతాయి. ఒక్క శిల్పంతో ఆ మాలవరాజును సంతోషపెట్టలేరా?

కాంక్షతో తీవ్రంగా వెలిగే ఆశ కళ్ళకు అతడు లొంగిపోయాడు.

ఆనాడే దీక్ష వహించాడు. ప్రశస్తమైన ఏనుగు దంతం సంపాదించాడు. చంద్రవంకలా ఉన్న ఆ దంత ఖండాన్ని నిలువునా పూలదండగా మార్చివెయ్యాలనుకున్నాడు. ఉలి అమోఘంగా పని చెయ్యడం ప్రారంభించింది.

ప్రతీరాత్రీ ఆశ ఎదురుగా కూర్చునేది. ఆమె కళ్ళ అందం అతని శిల్పానికి దీపం అయింది. ఆమె ఎర్రని పెదవుల చిరునవ్వు అతని కల్పనకు జీవంపోసింది. ఆమె ఒక్కొక్క సుందర భంగిమ అతని చేతిని పరుగులెత్తించింది. ముప్పది రోజులు అహోరాత్రాలు పని చేశాడు.

ముక్కలు చెయ్యలేదు. అతుకు లేదు. ఏనుగు దంతం హఠాత్తుగా మల్లెపూలదండగా మారిపోయింది. రేకు రేకునా సహజమైన ముడుతలు. ముడత ముడతలో అచ్చమైన నొక్కుల సొగసులు. కొన్ని పూర్తిగా విడిన మల్లెలు. కొన్ని అరవిచ్చినవి. చివర ఒక బొడ్డు మల్లె కొలికి పూస.

ఒక్కొక్క పువ్వుకూ ఒక్కొక్క నెత్తురుబొట్టు ఖర్చుపెట్టాడు.

చిక్కిపోయిన చెక్కిళ్ళతో తృప్తిగా నవ్వి అతని ముందే పూచిన పూలమాలను ఆశ ఎదుట సగర్వంగా ఎత్తి పట్టుకున్నాడు. ఆశ కళ్ళల్లో ఆనందజలం చిమ్మింది. ఒక ముహూర్తాన ప్రభు సందర్శనంకోసం మూటకట్టుకు బయలుదేరాడు.

చంద్రమౌళి రాజవీధిలో వేడిగా నిట్టూర్చి తన శిల్పంవైపు ఇంకొకసారి చూశాడు ఆ తెల్లని పువ్వులు తనని చూసి పకపక నవ్వినట్లనిపించింది. ప్రతి పువ్వూ తనకోసం దీనంగా ఎదురుచూసే ఆశ ముఖం జ్ఞాపకం చేసింది. అమాయకపు కళ్ళల్లో నీరు కార్చే తన బిడ్డ కళ పరుగెత్తుకొనివచ్చి కాళ్ళ చుట్ట వేసుకున్నట్లనిపించింది.

పొంగివచ్చే కన్నీళ్లను అపుకుని నగరం వెలుపలి శూన్యంలోకి నడచి ఒక రావిచెట్టుకింద నిలుచున్నాడు. అమోఘమైన తన శిల్పాన్ని ఊచిపుచ్చుకుని చెట్టు మొదటికి విసరి వేశాడు. అది పోయి ఒక రాతికి తగిలిన చప్పుడయింది.

నివ్వెరపోయి చెట్టు మొదట పరిశీలించాడు. ఆశ్వయుజమాసపు వెన్నెల వెలుగుల్లో స్పష్టంగా కనబడుతున్నది.

ఆ పుష్పమాల ధ్యానముద్రలో ఉన్న బుద్ధదేవుని పాదాలముందు పడింది.

అతనికి నవ్వు వచ్చింది.

"సింహాసనంమీది శిలావిగ్రహానికి సమర్పించదలచిన అపూర్వ పుష్పమాల ఈ జీవన్మూర్తి పాదాలను పూజించిందా? ఎంత ధన్యుణ్ణి!"

చంద్రమౌళి నిమీలిత నయనాలతో బుద్ధదేవుని పాదాలముందు నిలువునా మోకరిల్లాడు.

ఒక శీతల హస్తం అతని వెన్నుపై నిమిరినట్టయింది!

# లగూరగంప



## అంకీయా నాట్

అంకీయా నాట్ — అస్సాంలో వైష్ణవ మత ప్రచారానికి, పదహారవశతాబ్దంలో వేసిన నాటకాలు. ప్రచారసమయాల్లో, పర్వదినాల్లో, భక్తిప్రేరక కావ్యాలనూ శాస్త్రాలనూ సమూహాల్లో గానం చేయడం, పదిహేనవశతాబ్దంలో వైష్ణవ మత ప్రచారకులు ముఖ్యసాధనంగా పెట్టుకున్నారు. అలా గానం చేయడం, వ్యాఖ్యానించి చెప్పడం రానురాను నాటక రూపంలోకి దిగింది.

శంకరదేవుడు అనే వైష్ణవభక్తుడు (1449-1569) ఇలా గానంచేయడంకోసం కొన్ని కావ్యాలనురచించి, రానురాను నాటకాల రచనకు పూనుకున్నాడు. 'శంకరదేవ' ప్రస్తుతపు నౌగాంగ్ పట్టణానికి పదహారు మైళ్ళదూరంలో ఉన్న అలిపుఖూరి అనే గ్రామంలో ఒక 'భూయాణ్' వంశంలో పుట్టాడు. భూయాణ్ కులం ఆరోజుల్లో చాలా శ్రేష్టమైనదేగాక, ఆ కులంలో చాలామంది భాగ్యవంతులు కూడాను. వారిలో 'శంకరదేవ' వంశం చాలా ప్రముఖమైనది. అందువల్ల వారిని శిరోమణిభూయాన్లు అనేవారు. శంకరదేవుడు చిన్నవాడు బాగా చదువుకున్నాడు. పెద్దవాడైన తర్వాత సంస్కృతంలో స్వతంత్రంగ వ్రాయడమే గాక, అనేక సంస్కృతకావ్యాలను అస్సాం భాషలోకి అనువదించాడు. భక్తిరత్నాకరము అనే వైష్ణవ తత్వగ్రంథాన్నికూడా రచించాడు. చదువు ఇరవై రెండోఏటనే ముగిసింది. సూర్యావతి అనే కాయస్థ బాలికను పెళ్ళిచేసుకున్నాడు. ఆమె ఒకపిల్లను కని నాలుగేళ్ళతర్వాత మరణించింది. కూతురుపెళ్ళిచేసి 1541 లో దేశం తిరగడానికి ఉపక్రమించాడు. పదిహేడుమంది శిష్యులేగాక ఆయనగురువు మహేంద్ర కందళికూడా ఆయనతో యాత్రకు బయలుదేరారు. గయ, పూరి, భువనేశ్వర్, బృందావనం, మధుర, ద్వారక, కాశి, ప్రయాగ, అయోధ్య, బదరికాశ్రమం, మొదలైన క్షేత్రాలన్నీ తిరిగి, అక్కడ మత ప్రచారం ఎలా చేస్తున్నారో, మహాభక్తులు ఎలా ప్రబోధాలు చేస్తున్నారో చూసి తెలుసుకుని, పన్నెండేళ్ల తర్వాత అస్సాం తిరిగివచ్చాడు. అప్పుడు, మళ్లీ పెళ్లి చేసుకున్నాడు! బార్దోవా అనే గ్రామంలో నివాసం ఏర్పరచుకొని, అక్కడ ఒక సత్రం కట్టించాడు, భక్తులు ఉండేటందుకు. అందరికీ సత్కాలక్షేపాలకు (భజనలు, సంకీర్తనలు, చర్చలు) ఉపకరించే 'నాంఘర్' (భజన మందిరం) నిర్మించాడు. ఈ కాలక్షేపాలను 'నామకీర్తన్' అనేవారు. కొన్నాళ్ళకు శంకరదేవ మరోగ్రామానికి వెళ్ళిపోవలసి వచ్చింది. అక్కడ మాధవదేవ అనే శాక్తేయుడు, శంకరదేవుని శిష్యుడై వైష్ణవ తత్వాన్ని ఆశ్రయించాడు. తర్వాత తర్వాత ఈ మాధవ దేవుడు కూడా శంకరదేవునిలాగానే నాటకాలు, కావ్యాలు వ్రాశాడు. శంకరదేవునికి శాక్తేయులతోనూ వైరం వచ్చింది — బ్రాహ్మణులతోనూ వైరం వచ్చింది. కానీ శంకరదేవునికి గల విద్యగానీ, అనుభవజ్ఞానంగానీ, భక్తిగానీ, వారికి లేక, వారి వైరం నిరర్థకమైంది. ఏమైనప్పటికీ ఆ ప్రాంతం (అహోంరాజుల రాజ్యం) శంకరదేవుని కృషికి ఏమంత అనువైన క్షేత్రం కాలేదు. అందువల్ల కూచిబేహార ప్రాంతానికి తరలివెళ్లాడు. బార్పేట అనే గ్రామంలో ఒక సత్రం, ఒక నాంఘర్, కట్టించాడు. ప్రశాంతంగా ప్రచారం చేసుకున్నాడు. మళ్ళీ తన 97 వ ఏట వందమంది శిష్యులతో తీర్థయాత్రలుసాగించాడు. పూరీలో చైతన్యదేవుని కలుసుకున్నాడు. తిరిగి వచ్చి మళ్లీ ఇనుమిక్కిలిగా ప్రచారం చేశాడు. కూచిబేహార్ లో మరణించాడు. శంకరదేవుడు ఆరు నాటకాలతో సహా మొత్తం 30 గ్రంథాలు రచించాడు.

శంకరదేవుడు తన యాత్రలో వివిధ స్థలాలలో, రామలీల, రాసలీల, భాగవతం, మొదలైన నాటకాలను చూశాడు. తిరిగివస్తూనే భాగవత పురాణం కథలను నాటకాలుగా కూర్చి ప్రదర్శనలు ప్రారంభించాడు.

శంకరదేవుని కాలంలో, అస్సాంలో కొన్ని రకాల రూపకాలను తరుచు ప్రదర్శిస్తూ ఉండేవారు–దేవాలయాల్లో దేవ్ ధాని నృత్యం—'ఓజపాళి' అనే ప్రదర్శనం (బుర్రకథ లాంటిదే). చేస్తూ ఉండడం ఆరోజుల్లో పరిపాటి. ఓజ అంటే ముఖ్య గాయకుడు—పాళి అంటే ఇటూ అటూ ఉండి వంత పాట పాడేవారు. ఓజపాళీలో కొంచెం నాట్యం కూడా ఉంటుంది. 'ఓజ', పాడుతాడు, ఆడుతాడు, నటిస్తాడు. పాళీలు అతడిని అనుసరిస్తారు. వాళ్లల్లో వాళ్లు కథను విమర్శించి చెప్పే ఉద్దేశంతో, సంభాషణలు సాగిస్తారు.

ఇవన్నీ చూసి, శంకరదేవుడు నాటకాలు వ్రాశాడు. నాటకాన్ని, 'యాత్ర', 'నృత్త', 'అంక' 'భావన' అని కూడా పిలిచేవారు. మాధవదేవుడు వ్రాసిన నాటకాల్ని 'ఝుమురా' అనేవారు. మొత్తం మీద 'అంకీయా నాట్' అనేది నలుగురూ వాడేపదం అయింది. అంటే ఒకవిధంగా వైష్ణవ ఏకాంకిక నాటకాలు అని అర్థం చెప్పుకోవచ్చు.

'అంకీయా నాట్'లో సంస్కృత నాటకాల్లోలాగానే నాంది ప్రస్తావన లుంటాయి అయితే సూత్రధారుడు మాత్రం చివరదాకా ఒక నటుడే. సూత్రధారుడే నాటక దర్శకుడు, వ్యాఖ్యాత. కలిసి నాట్యం చేస్తాడు—తోడుగా పాడ్తాడు. పాత్రలను పరిచయం చేస్తాడు–ప్రవేశాలను నిష్క్రమణలను ప్రకటిస్తాడు–మధ్య మధ్య ధర్మప్రవచనాలు చేస్తాడు—మొత్తం మీద విద్యావంతులు అవిద్యావంతులూ కూడా కలిసిన ప్రేక్షకబృందాన్ని రంజింపజేస్తాడు—వైష్ణవ వికాసం కలగజేస్తాడు—కేవలం సర్వజ్ఞుడే. సూత్రధారునికి, గురువులు ప్రత్యేక శిక్షణ నిచ్చేవారు.

అంకీయా నాట్ ఒకరకంగా, గేయనాటిక కూడాను. వర్ణనలన్నీ శ్లోకాలు, గేయాలు. సూత్రధారుడే పాడ్తాడు. ఏ పాత్ర మనస్సులో ఏ ఆలోచన పొరలాడుతున్నదో కూడా సూత్రధారుడు గాన రూపంలో తెలియజేస్తాడు. మధ్య మధ్య 'బార్ గీత్' అనే పేరుగల భక్తికీర్తనలను పాడుతాడు.

నాందిశ్లోకాలలో ప్రార్థనే గాక, కథాసారం కూడా సూత్రధారుడు వివరిస్తాడు. తర్వాత తర్వాత గోపాలదేవుడు తన నాటకాల్లో శ్లోకాలకు మారుగా నాందిలో అస్సామీస్ గీతాలనే ప్రవేశపెట్టాడు. నాంది తర్వాత 'భాటిమా' అనే ఒక పెద్దగీతాన్ని గానంచేస్తారు—నాందిలోవచ్చే మరొకపాత్ర 'సంగి'. సూత్రధారుడు తానేదో దివ్యవాణిని వింటున్నట్లు నటించి, సంగితో నాంది తర్వాత కథా ప్రాముఖ్యాన్ని చర్చిస్తాడు. నటుల ముచ్చట చెప్తాడు. ఆ తర్వాత 'సంగి' నాటకంలోకి రాడు.

వీరుగాక నాటకంలో 'దూత' అని ఒక పాత్ర, 'బహువా' అనే ఇంకొకపాత్ర, (రంగంమీదకు నటులు రావడం ఆలస్యమైనపుడు, ముఖ్యంగా) కొంత హాస్యం కలుగజేస్తారు; నటుల కథలు చెప్పి ప్రేక్షకులను రంజింపజేస్తారు.

చివరకు సూత్రధారుడు, ముందుగా ప్రార్థనా గానం చేసినట్లే, "ముక్తిమంగళ భాటిమా (గీతం)" పాడుతాడు, ఏమైనా తప్పులు తటస్థించి ఉంటే క్షమించాలని దేవుని వేడుకుంటూ. ఆ గీతంలోనే ఆకథ నీతికూడా చెప్తాడు. ప్రబోధం చేస్తాడు. మంగళ గీతాన్ని చివరకు ప్రేక్షకులుకూడా కలిసి పాడ్తారు.

ఈ నాటకాలను 'నాంఘర్'లోనో, నాంఘర్ ముందో వేసేవారు. ఒక్కొక్కప్పుడు నాటక ప్రదర్శనంకోసం పాకలు, పందిళ్ళుకూడా వేసేవారు. మాధవదేవుడు 'బార్పేట'లో ఒక నాటకశాలను నిర్మించాడు, తన నాటకాలు వేయడానికి అనువుగా. ఈ నాటకశాలను, 'బార్ ఘరా' అనీ, 'రంగీయాల్ ఘరా' అని పిలిచేవారు.

'నాంఘర్'లను నాట్యశాస్త్రంలో చెప్పిన 'వికృష్ట' పద్ధతిలో కట్టేవారు—యాభై అడుగుల పొడవు ఉంటుంది—రెండు అంతస్తులుగా నిర్మిస్తారు. ఒక చివరన, 'మణికూట్' అనే చిన్న గృహం కట్టి, దానిలో సింహాసనంపైన పవిత్రగ్రంథాలను ఉంచేవారు. 'మణికూట్'లోకి అర్చకులు అధికారులు తప్ప అందరూ వెళ్ళడానికి వీలులేదు. నాంఘర్ ముందు భాగం 'రంగమండప్' ఇక్కడ ప్రేక్షకులు కిందనే కూర్చునేవారు. ముందుభాగంలో ప్రముఖులకు కొంత మేర ప్రత్యేకించేవారు. నాంఘర్‌లో మూడింట రెండు వంతులు 'రంగమండప్'—ఆ తర్వాత 'రంగభూమి'. రంగభూమి ప్రత్యేకంగా ఎత్తైన వేదికలాంటిది కాదు. కాకపోతే రంగభూమికి ఇటూ అటూ నటులూ, హంగుదార్లూ, వాద్యగాళ్ళు కూర్చునేవారు. రంగభూమికి ముందు భాగంలో 'అర్క్ షార్' (తెల్లటితెర) ఉంటుంది. నటులు వేషాలు వేసుకునే 'చోఘరా' (ఛద్మగృహం లేక గ్రీన్ రూం) రంగభూమి వెనకగా ఉంటుంది. సూత్రధారుడు పిలిచినప్పుడు ఛద్మగృహం నుంచి నటులు రంగభూమిపైకి వెళ్ళేవారు.

నటులకు "భావరియా"లు అని అస్సాం భాషలో పేరు. నటన వృత్తి గలవారు ఆ రోజుల్లో లేరు. ఆసక్తి భక్తి ఉన్న యువకులు గురువు మాట ప్రకారం ఈ వేషాలు వేసేవారు. స్త్రీలు వేషాలు వేసేవారు కాదు. అందరూ చదువుకున్నవారు—గురువు

ఆజ్ఞను పాలించి, చక్కగా శిక్షణపొంది నటించేవారు. వారు ఎవ్వరూ నిషిద్ధులు కారు. నాటకానికి ఊరిలో ప్రముఖుడు అధ్యక్షత వహించడం పరిపాటి. ఆయనకు అప్పుడు అందరూ విధేయులే. ఆయనను "అధికారి", "ప్రేక్షాపతి", "సభాపతి" అనేవారు. ప్రేక్షకులు, సభాసదులు లేక సమాజికులు.

నటులకూ నాటకానికీ కావలసిన సరంజామాను తయారుచేసే వృత్తి కొందరికి ఏర్పడింది. వాళ్లు "ఖానికార్"లు. బొమ్మలు వేయడం కావలసిన కలపవస్తువులు మృణ్మయవస్తువులు, విగ్రహాలు ('చో'లు), ముసుగులు ('ముఖా'లు) రకరకాల దుస్తులు, యుద్ధపరికరాలు, ఛద్మగృహ నిర్వహణ, నటులకు అలంకరణ కూర్పు—ఇవన్నీ ఈ ఖానికార్ల పనులు. అంటే ఇతడు బాగా తెలిసినవాడే అయిఉండాలి.

సూత్రధారుడు మోకాళ్ళకిందదాకా వచ్చే, జరీజిలుగు ఉన్న అంగరఖా (ఘూరీ) ధరిస్తాడు; చేతులులేని ఒక కూర్పాసం (ఫాతో లేక వెస్ట్‌కట్), ఒక రంగురంగుల కమ్మర్ బంద్ (కారాధాని లేక నడుం పట్టీ), ఒక తట్టుతలపాగా కూడా ధరిస్తాడు. గాయక్ బాయక్‌లు (వాద్యగాళ్లు) కూడా ఇలాటి దుస్తులే వేస్తారు. అందరూ ధోవతులు (చక్కటిఅంచులుకలవి, పాత్రకు తగినవి) కట్టుకుంటారు. స్త్రీపాత్రల అలంకరణలలో ముఖ్యం, 'మేఖల' లేక ఒడ్డాణంలాంటిది. మంచిరంగులు అప్పటికప్పుడే తయారుచేస్తారు. కాళి, జటాయు, రాక్షసపాత్రలు ధరించడానికి అనేక ముసుగులు తయారుచేయవలసివచ్చేది.

ఆ రోజుల్లో 'మైథిలి' భాష బాగా పుష్టి చెంది ఉంది. విద్యాపతి ఈ భాషలో అనేక వైష్ణవగీతాలు రచించాడు-అక్కడికి పరిసరప్రాంతాలనుంచి అనేకులు కవులు రచయితలు వెళ్ళి మైథిలి నేర్చుకునేవారు. అస్సాంనుంచీ అలాగే వెళ్ళారు. 'మైథిలి' భాషను కలిపివ్రాయడం ఒక సంప్రదాయం, ఒక వాజూకు అయింది. ఈ మిశ్రమభాషను 'బ్రజబూలి' అనేవారు. అస్సాం బెంగాల్‌లలో 'బ్రజబూలి' విస్తృతంగా వాడారు. శంకరదేవుడు, మాధవదేవుడు కూడా 'బ్రజబూలి' వాడారు.

శంకరదేవుడు, కాళీయదమన్, కేళీగోపాల లేక రాసక్రీడ,పత్నీప్రసాద్ (గోపికలకు కృష్ణుని దర్శనం), పారిజాత్ హరణ్, రామవిజయ, రుక్మిణీ హరణ్ అనే ఆరు నాటకాలు వ్రాశాడు.

మాధవ దేవుడు, అర్జున భంజన (కృష్ణుడు అర్జున వృక్షాలను పడగొట్టడం), భూమి లోతోవా (కృష్ణుడు మన్నుతినడం వగైరా), భోజన విహార (యాదవుల పశువులను బ్రహ్మ మాయంచేయడం వగైరా), భూషణ హేరోవా (కృష్ణుని కంఠహారాన్ని యశోద దొంగిలించడం!), చోరధార (దొంగకృష్ణుని పట్టుకొనడం), కోతోరా ఖేలా (కృష్ణుడు గోపాలురు పాలు తాగుతూచేసే నృత్యం), పింపారా గుచావా (వెన్నదొంగ, తాను చీమలను తోలడానికి వచ్చాననడం), రాసఝుమురా (రాసక్రీడ) వ్రాశాడు.

గోపాలదేవుడు, జన్మయాత్ర (కృష్ణుని జననం), ఉద్ధవ సంవాదము వ్రాశాడు.

వైష్ణవమత ప్రచారం ఈ నాటకాలద్వారా ఎంతో రమణీయంగా సాగిపోయింది. ప్రచారానికి, ఆటను పాటను సాహిత్యాన్ని ఇంతగా వాడుకోగలిగారు వైష్ణవ భక్తులు. ఈనాటికీ కూడా ఆదర్శ ప్రచారం చేయదలచినవారికి బలీయమైన సాధనాలుగా ఉపకరించేవి ఇలాటి 'అంకీయా నాట్'లే.

జి. కృష్ణ.

# గ్రంథ విమర్శనము

## భాష్య ప్రకాశికా

రచయిత: శ్రీ వాధూల శ్రీనివాసాచార్యులు. సంపాదకులు: మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాధ్యక్షులు (క్యూరేటరు) శ్రీ టి. చంద్రశేఖరన్. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రచురణ. మద్రాసు. మూల్యము: రు 6-8-0.]

అద్వైతానుయాయు లందరకు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, అవశ్యోపాదేయము లగు ప్రామాణిక గ్రంథములు. అనంత వేదార్థములను క్రోడీకరించు ఉపనిషత్తులలో పరస్పర విరుద్ధములుగ గనిపించు సిద్ధాంతములను విశదీకరించుటకు వ్యాస భగవానుడు బ్రహ్మసూత్ర నిర్మాణం చేశాడు. ఆ విధముగ తాను సూత్రబద్ధ మొనరించిన విషయమునే, తిరిగి మహాభారతేతిహాసమున సర్వజనులకు విశదముగురీతి, కృష్ణార్జున సంవాద రూపమున భగవద్గీతగా పునః ఉపన్యసించాడు. ప్రస్థానత్రయమను ఈ మూడు గ్రంథములకు శంకర రామానుజ, మధ్వ, నింబార్క ప్రభృతి మతకర్తలు, తదనుయాయులు వ్యాఖ్యానములు రచించారు. అందు బ్రహ్మసూత్రములకు భగవద్రామానుజ విరచితమగు వ్యాఖ్యకు శ్రీ భాష్యమని రూఢి. ప్రకృత గ్రంథము శ్రీ భాష్యమునకు సంగ్రహ సుబోధానుకృతి.

ఇందు ప్రత్యధికరణమున భాష్యకారులు చేసిన పూర్వపక్ష సిద్ధాంతములు, తత్తద్వ్యాఖ్యాతల వివరణాలు సంక్షిప్త రూపమున క్రోడీకరింపబడినవి. శైలి సరళముగ సులభగ్రాహ్యముగ నుండుటచే ఉపోద్ఘాత కర్తలనినట్లు శ్రీ భాష్యమును సేవించిన వారికి, సేవించనున్నవారికి కూడ ఈ గ్రంథ మవశ్య ముమిత సహకారి.

గ్రంథ ప్రకటనమున ముద్రణ స్ఖాలిత్యము లెక్కువ దొరలకుండ శ్రద్ధతీసికొని నందులకు' గ్రంథమును గ్రంథకర్తను గురించిన విపులోపోద్ఘాతమును సమకూర్చినందులకు సంపాదకులు అభినందనీయులు. దొరలిన స్వల్ప దోషములకు సవరణ పట్టిక నీయవలసినది.

మరియొకటికూడ సంఘటిల్లినది. ఈ గ్రంథమును మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గల ఒక్క ప్రతి ననుసరించి ముద్రించినారు. అందుగల లోపములను అచటి పండితులు యథాశక్తి పూరించి, అట్టిభాగములను కుండలీ కరణముల (Brackets) లో ఉంచారు. కాని, ఈ గ్రంథమునకు మరిరెండు లిఖిత ప్రతులు తిరుపతి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున లభించుచుండగా, వాని నకలుల కొరకు వారికి వ్రాసికూడ, వారు పంపుసరికే ఈ గ్రంథముద్రణను పూర్తిచేయించి నటుల ఉపోద్ఘాతములో వివరించినారు.

"తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధ్యక్షులు (డైరెక్టరు) అచటగల రెండు ప్రతులలో ఒక అసంపూర్ణ ప్రతి నకలును, ఈ గ్రంథాలయము కోరిక ననుసరించి పంపిరి. కాని, ఈ గ్రంథముద్రణ పూర్తి అయిన పిమ్మట ఆ ప్రతి మాకు చేరినది. అయినను, ఆందలి పాఠ భేదములు ఈ గ్రంథాంతమున అనుబంధ

రూపమున నీయబడినవి. సమగ్రమైన అచటి రెండవ ప్రతి నకలును తిరుపతి ప్రాచ్య లిఖిత భాండాగారాధ్యక్షులు పంపనందున అందలి పాఠ భేదములను ఈ గ్రంథములో చేర్చుటకు వీలుపడలేదు" అని ఉపోద్ఘాతాంతమున వీరు వ్రాసినారు.

ఇట్టి అమూల్య గ్రంథములను ప్రభుత్వం ప్రజాధన వ్యయముతో ప్రకటించేటప్పుడు, ముందుగా ఉపలభ్యమానము లగుచున్న ప్రతుల నన్నిటిని సేకరించి, తెలిసినంత వరకయినా గ్రంథమును సంస్కరించి, చక్కజేసి, సమగ్రముగ ప్రకటింప జేయుట విచార్యము. పాఠభేదములు గ్రంథాంతమున అనుబంధముగ నిచ్చుట పాఠకులకు శ్రమ కల్పించుచున్నది. ఏ పుట లోని పాఠాంతము లా పుట దిగువను సూచించుచు సమగ్రమయిన ప్రతిని పునర్ముద్రణమున నయిన ప్రకాశకులు సమకూర్పగలరని ఆశిస్తున్నాము. —సిం. సు.

## ఆచంట రామేశ్వర శతకము

రచన: కీ. శే. మేకా బాపన్నకవి; ప్రాప్తి స్థానం: మేకా పల్లమ్మగారు, ఆచంట, పశ్చిమ గోదావరిజిల్లా; అమూల్యం:

ఇది ప్రౌఢమైన రచన; కవికి 'పండిత బాపన్న' అన్న ప్రసిద్ధి వున్నట్టుకూడా తెలుస్తుంది. సంస్కృతాంధ్రములను ముచ్చటగానూ అవలీలగానూ విన్యాసం చేయగల ప్రతిభాశాలి. వీరి మరొక రచన "మదన గోపాల శతకము" కలదట.

ఆచంట రామేశ్వరుణ్ణిగురించి విచిత్రమైన కథ ఒకటివున్నది. సామాన్యులకు కొంత జుగుప్సాకరంగా కనుపించుతున్నా, భక్త్యావేశంలో ప్రాచీనులు నానా రకాలుగా ఎలాంటి కథలు ఊహించారో తెలుస్తుంది. ఇది ఆచంట స్థలపురాణం. ఇది అపవిత్రంగా వుందంటే అక్కడి వారికి కోపం కూడా రావచ్చు.

ఆచంట పూర్వనామం మార్తాండపురం. ఈ గ్రామంలో పూర్వం, "ఒడయనంబి" అనే భక్తాగ్రేసరుడు, "పరమనాచి" అనే వారాంగనా వుండేవారట. ఒకనాటి అర్ధరాత్రి 'ఒడయనంబికి' విలాసగృహంలో వుండగా శివభక్త్యావేశం కలిగింది. పరమనాచి నిద్రపోతూనేవుంది. ఉన్మత్తుగావున్న వారాంగన వక్షోజాన్ని శివలింగంగా భావించి అర్చనచేస్తున్నాడు. ఆవిడకు నిద్రమెలకువ వచ్చింది. ఈ విచిత్రంచూచి అతన్ని పరిహాసించుచున్నది. అతను చలింపలేదు. దండకస్తోత్రాదులతో పరమేశ్వరుని హృదయం కరగించాడు. పరమేశ్వరుడు సాక్షాత్కరించి ఆదంపతులకు సాయుజ్యమిచ్చాడు. సంత, 'చంటి' వెలసి పలుకుట చేత ఆ గ్రామానికి ఆచంట అనేపేరు వచ్చిందంటున్నారు. ఇది స్థలపురాణం.

ఈ కథలో శృంగారచ్ఛాయలు ఎలా ఎలా వున్నాయో ఈ రచనలోకూడా ఆ ఘుమఘుములు వాసించుతున్నాయి.

సీ॥ జేజేల రారాల సీ యను వేనలి
మించుల జిగి నవలించు మేను
కవకవ జక్కవకవ నవ్వ చనవ
కలదు లేదనను నా కౌను వెలయు
నూడిగపుంజేడె లాడావ దోడరా
వలినులమూలితో గలసి వలపు
పుప్పొడితిప్పల పొగడల నీడల
మావుల తావుల మల్లెపొదల
జాజి పందిళ్లి కిసిమిసి దప్పరముల
వన్నెగ్రుమ్మగు నీ హొయ లెన్న దరమె
ఘూతంగో కేశ! ఆచంటపురని వేశ
భావభవ నాశ! రామేశ! పార్వతీశ!




# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
జేస్తుంది

లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.

అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము.






అమృతాంజన్
లిమిటెడ్.
మద్రాసు-4, బొంబాయి-1. కలకత్తా-7.

AL.36.4

ప్రతి ఆదివారం రాత్రి 6.30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష లన్నింటిలో వెలువడే [illegible] కాల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.